# కేతు విశ్వనాథరెడ్డి

# కథలు

◆ 1998-2003 ◆

కేతు విశ్వనాథరెడ్డి



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

KETHU VISWANATHA REDDY KATHALU (1998-2003)
*by Prof. Kethu Viswanatha Reddy*

ప్రచురణ నెం. : 2350/24

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : మే, 2004



ముఖపత్ర చిత్రం : చంద్ర
- సాహిత్యప్రస్థానం - సాహితీ స్రవంతీ పత్రిక సౌజన్యంతో

**వెల: రూ. 45**
**విదేశాలల్లో:$ : 5**

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



అక్షరాలంకారం: ట్వంటీఫస్ట్ సెంచరీ, దిల్‌సుఖ్‌నగర్. ఫోన్: 24066986
ముద్రణ: **శ్రీ కళాంజలి గ్రాఫిక్స్**, హిమాయత్‌నగర్, హైదరాబాద్.

మా ఊరి కరువు పొలాల్ని చూసి
'ఇక్కడ మనుషులు బతకడం ఎంతకష్టం ?' అని
జానకమ్మ  అక్క బాధతో అన్నప్పుడు...
తన కన్పించీ కన్పించని నవ్వుతోనే చరిత్రను చెప్పిన
జానకమ్మ అక్క భర్తా,
మంచి అధ్యాపకుడూ,
పాలనాదక్షుడూ,
సీమ జీవితంతో మమైకమైన వ్యక్తీ,
ఆశయాల్ని జీవించిన మంచి మనిషీ,
మా వియ్యంకుడూ,



సుందరయ్య (గోళ్లమూడి సుందర రామిరెడ్డి, 1933-1991)

స్మృతికి...

# కథల వరుస



– వల్లంపాటి వెంకట సుబ్బయ్య

# ఒక వాల్మీకి

రాజులుకు వాల్మీకి అంటే చాలా ఇష్టం; ముదిజేజి కన్నా ఇష్టం; అమ్మ కన్నా ఇష్టం; బళ్లో చదువు చెప్పే రాములు సారు కన్నా ఇష్టం; తనకున్న ఇద్దరు ముగ్గురు సావాసగాళ్ల కన్నా ఇష్టం. వాల్మీకిని రాజులు 'తాతా!' అని పిలుస్తాడు. 'మనవడా' అని వాల్మీకి రాజులును పిలుస్తాడు. ఎప్పుడైనా రాజులు ముదెబ్బ కాలం నాటి సంగతులు చెప్పేటప్పుడో, ముదిజేజి ప్రస్తావన కొచ్చినపుడో 'అదీ చిన్రెడ్డీ కత! అని ముగించేవాడు. వాడిన బంగారం రంగు శరీరం, చాలీ చాలని పై పంచె భుజాల చుట్టూ కప్పుకొని, గోచీపోచీ కట్టిన పంచె, తెల్లబడి మెడ కిందకి వాలిన జుట్టు, పెద్ద నుదురు, ఎక్కడికో చూస్తున్నట్లు ఉండే కళ్లు, కొనదేలిన ముక్కు, నోరు తెరిస్తే తప్ప స్పష్టంగా కనిపించని తెల్లటి మీసాల గుబురులో దాక్కున్న పెదాలు, పొడవాటి నెరిసిన గడ్డం, అమ్మ చెప్పిన కథల్లోని ఋషులు ఇట్లాగే ఉండి ఉంటారని రాజులు నమ్మకం. బడిలో గోడకు వేలాడదీసిన రవీంద్రనాథ్ టాగూరు బొమ్మ చూసినప్పుడు వాల్మీకి తాత లాగే ఉన్నాడని రాజులు అనుకునేవాడు.

బడికి సెలవులొస్తే చాలు. రాజులు వాల్మీకి దగ్గరకు చేరేవాడు – వాల్మీకి ఉంటున్న గూడమిద్దె లోకో, గూడమిద్దె ముందున్న అరుగు మీదికో, గవినిలోని డొంకలో బావి గట్టు నుండే వేపచెట్టు చుట్టూ కట్టిన అరుగు మీదికో, ఊరి పడమటి వైపు రెండు ఊర్లకు వెళ్లే దారులను వేరు చేసే పెద్ద అరుగుతో ఉండే రావిచెట్టు, వేపచెట్టు కిందకో తమ ఇంటికి సేద్యం పనికో, మరొక పనికో వచ్చినపుడు సంగటి తినే సమయంలో రాజులు పక్కన కూచొనేవాడు. వాల్మీకితో వామికొండకు వెళ్లాలనే కోరిక మాత్రం రాజులుకు ఇంకా తీరలేదు. ఏమైనా, వాల్మీకి ఎప్పుడు ఎక్కడుండేదీ

రాజులకు తెలిసినంతగా, ఊళ్లో వాళ్ళకెవరికీ తెలియదు. రాజులు తప్ప ఊళ్లోని మిగతా పిల్లలు వాల్మీకిని చూస్తే జడుసుకునే వాళ్లు; వాల్మీకి నడివీధిలో నడుస్తున్నా, ఇండ్ల సందుల్లో నడుస్తున్నా ఎదురుపడితే తప్పుకునేవాళ్లు. అంత భయం! ముఖ్యంగా వామికొండ మీదుండే ఎంగ గురుడి దేవళానికి వెనుక తట్టు ఉండే రాతిబావి లోని నీళ్లతో తలస్నానం చేసి, వెండి జుట్టూ, గడ్డమూ గాలికి ఎగురుతూ ఉంటే, ఎంగ గురుడిని పూజించి రూపాయంత ఎర్రటి కుంకుమ బొట్టును నొసట బెట్టుకొని పరధ్యానంగా నడిచివస్తున్నపుడు చాలా మంది పిల్లలు చూశారా పారిపోయేవాళ్లు. 'ఇంత మంచోణ్ణి చూస్తే ఎందుకంత భయం?' అని రాజులు తరచూ ఆశ్చర్యపడేవాడు. 'అదీ చానా మంచిదేలే, నేనొక్కణ్ణే బాగా కథలు వినవచ్చు' అనుకునేవాడు. అప్పుడప్పుడూ పిల్లల భయానికి కారణం కనుక్కోవాలనుకునేవాడు. ముదిజేజినో, అమ్మనో అడగాలని ఉండేది. 'ఈ పెద్దవాళ్లను నమ్మకూడదు. అబద్ధాలు చెప్తారు. 'అసలు అంత ముసలాడితో నీకెందుకు?' అంటారని బెరుకు.

సంక్రాంతి సెలవుల్లో ఒక రోజు పైటేల పని అయ్యాక వాల్మీకి రావిచెట్టు అరుగు మీదికి చేరి 'భూమి లోన పుట్టు భూసార మెల్లను' అనే వేమన పద్యాన్ని చదువుతున్నాడు. రాజులు పక్కన వచ్చి కూర్చొన్నాడు. పద్యం పూర్తి అయింది. వేమనను గురించి వాల్మీకి ఏదో చెప్పబోతున్నాడు. దారిపక్క కళ్లంలో షేపు కట్టుకొని నెత్తి మీద పెట్టుకొని, అరుగు దగ్గర ఆగి, రంగయ్యనాయుడు వాల్మీకిని పలకరించాడు:

"ఏం మామా! కొండ కింద సేలో సెనిక్కాయ వేసినాం. కాయ పడింది. ఏదుపందులొస్తున్నాయి. రాత్రిళ్లు కావిలికి ఒప్పుకోరాదా?"

వాల్మీకి నవ్వి ఊరుకున్నాడు.

రంగయ్యనాయుడు కాసేపు ఆగి వేళాకోళమాడాడు:

"మా కెందుకు వొస్తావులే మామా. నువ్వొస్తే మాత్రం భరాయించగలమా? చీకట్లో ఇంటి మనిషి వచ్చినా, ఏదు పంది అనుకొని ఈటె విసరగలవు. మీ బోయోళ్ల ధైర్యం మాకెక్కడిది మామా."

ఫక్కున నవ్వుకుంటూ వెళ్లిన రంగయ్యనాయుణ్ణి చూసి రాజులుకు కోపం వచ్చింది. "ఏంది తాత, అట్లా మాట్లాడతాడు?" అన్నాడు.

వాల్మీకి జ్ఞాపకాల వడికి తట్టుకోలేక, కళ్లు తుడుచుకొంటూ చెప్పాడు:

"మనవడా! మీ ముదెబ్బ బాగా వయసులో వుండే రోజులు. నేనూ అంతే. ఆ సారి మాసూలు... మీ కళ్లంలో ముప్ఫయి పుట్ల జొన్నల రాసి. కావిలుండా, నేనొక్కణ్ణే. జొన్నదంట్ల గూట్లో. చీకటి. చలి. అలికిడంటూ లేని ఏ అపరాత్రో అలికిడి విన్నా–జొన్నలరాసి దగ్గర.

ఫక్కన బెట్టుకున్న నాటుకట్టెను బలంగా చీకట్లోకి విసిరినా–అలికిడి వచ్చిన పక్క. కాసేపు చెవులు రిక్కబెట్టుకొని విన్నా. చప్పుడు లేదు. ఏ కుక్కో లెమ్మనుకొని

పడుకున్నా. మర్చిపోయా. తర్వాత రెండ్రోజులకు తెల్సింది. కర్సుగుంటపల్లె దొంగకోళ్ల నారిగాడు చచ్చిపోతూ చెప్పినాడంట-కళ్లంలో జరిగిన సంగతి. ఆయం పాటున దెబ్బేమో సచ్చినాడు. అదిగాదు నన్ను తొలిచింది. నారిగాడు సచ్చినాక ఆ పెండ్లాంగోడు గ్యాపకం వచ్చినప్పుడల్లా ఆడోళ్లది ఏమి జల్మం అనుకుంటా. నేను చేసింది పాపమో పున్నెమో నాకు తెలీదు. అన్నాయం అయిపోయింది మాత్రం నారిగాడి పెండ్లాం."

రాజులు వాల్మీకిని అదంతా పూర్తిగా చెప్పమని అడగాలనుకున్నాడు. వాడి బుర్ర నిండా అనుమానాలే. వామికొండ వైపు వెళ్తున్న వాల్మీకిని చూస్తూంటే నోటమాట రాలేదు. బెదురు, వణుకు, భయం. ఊరి వైపు పరుగు తీశాడు, రాజులు.

(రచయిత స్వగ్రామం రంగశాయిపురం. ఆ గ్రామానికి చేరువలో వున్న 'వామి' ఆకారం లోని కొండ - వామికొండ. ఈ కొండ వాలులో సన్యాసి గుండు అనే ఒక గుండు కూడా ఉంది. ఈ గుండు మీద ఐదో శతాబ్దికి చెందిన ప్రాకృత జైన శాసనం ఉంది. ఈ శాసనం లోని విషయాలు తెలియని స్థానికులు నిన్న మొన్నటిదాకా ఏదో బంగారం ఉందని రకరకాల పూజలూ, బలులూ చేసిన సందర్భాలు కూడా ఉన్నాయి. ఈ వామికొండ ముందు వున్న గ్రామాలు కుడివైపు రంగశాయిపురం, కర్చుకుంటపల్లె, ఎడమవైపు పెనికలపాడు, వెనకవైపు మాదన్నగారిపల్లె ఉంది. దాదాపు ఈ గ్రామాల చుట్టూ తిరిగేవే వామికొండ కతలు. వామికొండ చుట్టుపట్ల గ్రామాలలోని వ్యక్తులే ఈ కతల్లో పాత్రలుగా కన్పించవచ్చు. సన్నివేశాలు, సంఘటనలూ మాత్రం రచయిత కల్పించినవి. పల్లెజీవితం ఒక రచయితను తీర్చిదిద్దటంలో ఎంతగా తోడ్పడుతుందో చెప్పటానికి ఈ కథలు మచ్చుతునకలు (అఫ్సర్ మాటల్లో). ఇంకా రాయని యాభై కథల్లో ఇది మొదటిది.)

● *సహకార సమాచారం, ఆగస్టు 1998* ●

# పోలికలు

నిజం చెపుతున్నా,

మా శంకరయ్య తాతకు చిన్నచిన్నవి కూడా తెలియదు. "అదేంది? ఇదేంది?" అని నన్నే అడుగుతాడు. మా తాతయ్యకే నాన్న, ఈ శంకరయ్య తాత. అంత పెద్ద తాతయ్య 'ఏదడిగినా నాకు బలే బాగుంటుంది. నాకెన్నో తెలుసు. చెపుతాను. చెబితే ఏంలే, పిల్లలకు తెలియకపోతే పెద్ద వాళ్లనడిగి తెలుసుకోవాలంటారు. మరి, పెద్దవాళ్లకు తెలియకపోతే, పిల్లల్ని అడగటంతప్పా? అడిగి తెలుసుకుంటే తప్పేముంది? పెద్దవాళ్లకు కూడా తెలియనివి ఎన్నో ఉంటాయి. శంకరయ్య తాతను వచ్చినప్పటినుంచి చూస్తున్నాగా...

శంకరయ్యతాత బలేగుంటాడు - సన్నగా, ఎత్తుగా, కొంచెం తెల్లగా. పంచె కట్టుకుంటాడు. జుబ్బా వేసుకుంటాడు. భుజం మీద టవల్ వేస్తాడు. బలేవాడులే. 'పాపోడా!' అని నన్ను ముద్దుగా పిలుస్తాడు. అమ్మను 'పాపా!' అని పిలుస్తాడు. అమ్మమ్మను 'గంగమ్మా!' అని పిలుస్తాడు. తాతయ్యను ఎట్లా పిలిచేదీ నేను వినలేదు. నన్ను పిలిచేదే ఎక్కువ. నాతో మాట్లాడేదే ఎక్కువ. నన్ను 'ప్యార్' చేసేదే ఎక్కువ. నన్ను అడిగేదే ఎక్కువ. సెలవులకు వచ్చాగదా! శంకరయ్యతాత లేకుంటే ఎంత బోరుగా ఉండేదో?

సెలవుల్లో అయితే నేను ఆలస్యంగా నిద్రలేస్తా. ఎవరూ ఏమీ అనరు. నిద్ర లేచానా, బాత్రూముకు వెళ్లానా, బ్రష్ చేసుకున్నానా, హాల్లోకి వచ్చానా, అన్నీ చకచకా. శంకరయ్య తాత కనబడలేదు. నేను తోడులేకుండా బయటికి పోడే. తాతయ్య అయితే బయటికిపోతాడు. పోలీస్ డిపార్ట్‌మెంట్ గదా! ఎప్పుడు పోతాడో,

ఎప్పుడొస్తాడో? నేను చూసి నాలుగు రోజులైంది. మరి శంకరయ్యతాతకు ఏం పని ఉంది? ఏ పనీలేదుగా - నాకులాగే. ఇద్దరికీ సెలవులే. డాక్టరుకు చూపిస్తాను రమ్మని తాతయ్య గట్టిగా పిలిచాడట! బలవంతంగా వెంటబెట్టుకొని వస్తే వచ్చాడట! ఈ శంకరయ్య తాత ఇంతకూ ఎక్కడకు పోయినట్లు? అమ్మనడిగితే తెలుస్తుంది.

అమ్మ బూస్ట్ తెచ్చింది. బూస్ట్ ఈజ్ సీక్రెట్ ఆఫ్ మై ఎనర్జీ. నాప్కిన్‌తో మూతి తుడుచుకున్నాక అమ్మనడిగా, "శంకరయ్యతాత ఎక్కడ మమ్మీ" అని.

"పెదతాతయ్య అని అన్లేవా?" అమ్మ కొంచెం కోప్పడింది. అమ్మలకు కోపం ఉంటుంది.

"పప్పాతో" మాట్లాడేటప్పుడు 'మా పాతపల్లె తాత'... 'మా శంకరయ్యతాత' అని అంటావు గదా మమ్మీ?" అన్నా.

"ఎదుటివాళ్లకు చెప్పేటప్పుడు అట్లా అంటారు", అంది మా అమ్మ.

నేనేం తక్కువ తినలేదు. నాకూ తెలుసు. మా పప్పా నాకెన్నో చెపుతాడు, మమ్మీ చెప్పేవిగాక. టీచర్లు చెపుతారు. దోస్తులు చెపుతారు. నాకూ తెలుసు.

"నేనిప్పుడు నీతో మాట్లడుతున్నా. అందుకే శంకరయ్యతాత అన్నా. పిలిచేటప్పుడు 'పెత్తాతయ్యా' అనే పిలుస్తున్నాలే," అన్నా.

"అన్నీ మీ నాన్న బుద్ధులే. సరేలే. కింద ఉంటాడు. పిల్చుకొని రా. ఇద్దరూ కలిసి టిఫిన్ తిందురు", అంది అమ్మ.

మెట్లు దిగి కిందికి వెళ్లా. వాచ్‌మన్ రూం ముందు మంచంలో కూచొని శంకరయ్యతాత బీడీ కాలుస్తున్నాడు. బీడీలు కంపే. శంకరయ్యతాత కాలుస్తుంటే సరదాగా ఉంటుంది. చేతివేళ్లు పైకెత్తి కుక్కమూతి లాగా పెట్టి, గోడలమీద కుక్క బొమ్మ నీడపడేట్లు చేస్తామే - ఎడమ చెయ్యి వేళ్లను అట్లా పెట్టి కాలుస్తాడు. దగ్గరికి వెళ్లి "తాతయ్యలాగా గోల్డ్‌ఫ్లేక్ పెద్ద సిగరెట్లు కాల్చకూడదా, పెత్తాతయ్యా?" అన్నా.

"ఇదే ఖర్చు దండగ పాపోడా. అలవాటయి చచ్చింది", అన్నాడు.

"స్టయిల్ గదా!" అన్నా.

"అంటే?" నా తాతయ్య నా గడ్డం పట్టుకొని అడిగాడు.

"అది ఇంగ్లీషులే" అన్నా.

శంకరయ్యతాతకు నాకొచ్చినట్లు ఇంగ్లిష్ రాదు, పాపం! ఇంగ్లిష్ అని కూడా అనలేదు. ఇంగిలీసు అంటాడు. నాకు తెలుసు. నాకు హిందీ, మరాఠీ కూడావచ్చు. శంకరయ్యతాతకు తెలుగే తెలుసు. శంకరయ్యతాత బీడీని నేల మీద రాసి ఆర్పివేశాడు. ఒక మూలకు విసిరేశాడు.

"పాప పిలుస్తోంది", అన్నా.

"మీ అమ్మ నాకు పాప. నీకు కాదు పాపోడా", నా జుట్టు నిమురుతూ అన్నాడు. బలే నిమురుతాడు.

'జోక్‌లే' అందామనుకున్నా. శంకరయ్య తాతకు జోకులు వెయ్యడం తెలుసు. జోక్ అనే ఇంగ్లిష్ మాటకు అర్థం తెలియదుగా. చెయ్యి పట్టుకున్నా. మా ఫ్లాట్‌లోకి వచ్చాం. డైనింగ్ టేబుల్ మీద అమ్మ బ్రేక్‌ఫాస్ట్ సర్దుతోంది. శంకరయ్యతాత సోఫాలో కూర్చున్నాడు. నేనూ పక్కన కూర్చున్నా. "టి.వి. పెట్టుకొని, చూస్తూ టిఫిన్ తిందాం పెత్తాతయ్యా" అన్నా.

"పెట్టడం నీకొచ్చునా?", అన్నాడు.

నాకు వి.సి.ఆర్. పెట్టడం కూడా వచ్చు. రిమోట్ తీసుకున్నా. ఛానల్ నొక్కా, స్టయిల్‌గా ఒంగి, శంకరయ్య తాతవైపు చూస్తూ ఫోజు పెట్టాలే. కార్టూన్ ఫిల్మ్ టైం. అదే ఛానల్ నొక్కా. నాకు కార్టూన్ ఫిల్ములంటే ప్రాణం.

"తోలు బొమ్మలాటల్లో మాదిరిగానే ఉండాయే ఈ బొమ్మలూ, మాటలూ పాపోడా!" శంకరయ్యతాత మాటలు బలేగా ఉంటాయి.

"అట్లాంటిదేలే తాతయ్యా! బొమ్మలు వేసే వాళ్ళు రకరకాల కదలికల్తో ముందు బొమ్మలు వేస్తారు. ఆ బొమ్మల్ని కదిలేటట్లు సినిమా తీస్తారు", అంది అమ్మ.

"మనూళ్లో పిచ్చయ్య తోలుబొమ్మల్ని తయారుచేసేవాడులే. అట్లాగేమోలే." అన్నాడు.

శంకరయ్యతాత కార్టూన్ ఫిల్ము చూడటం ఇదే మొదటిసారట! నేను ఎన్నిసార్లు చూశానో!

"ఇదేదో ఇంగిలీసు గొడవ పాపోడా. కథ చెప్పు" శంకరయ్యతాత అడిగాడు.

నేను టూకీగా చెప్పా. తను చూస్తున్నాడు. వింటున్నాడు. నేను మళ్ళీ చూడాలిగా. శంకరయ్యతాత నాలాగా ఎంజాయ్ చేస్తున్నాడు. డైనింగ్ టేబుల్ వద్దకు రమ్మని పిలవకుండా, టిఫిన్ తెచ్చి మాచేతుల్లో పెట్టింది మమ్మీ. శంకరయ్యతాత ఉన్నాడుగా. నాకెందుకు భయం? డైనింగ్ టేబుల్ దగ్గరే తినాల్సిన పనిలేదు.

"ఎప్పుడూ మాటలూ, టి.వి., ఆటలూ. సెలవులకు ఇక్కడికి వస్తామా. ఇదీ నీ మనుమడి పని తాతయ్యా", మమ్మీ నామీద చెప్పింది. "పసిపిల్లోడు గద పాపా!" శంకరయ్యతాత సపోర్టు చేశాడు.

"నాకు పదేళ్లు", అన్నా శంకరయ్యతాత వైపు తిరిగి.

" మరి చదువేం కావాల? బొంబాయికి తిరిగి పోతాం గదా. స్కూలు తెరిచేటప్పటికి. కూర్చోబెట్టి చదివించి, చదివించి అవస్థలు పడాలి– మరచిపోయినవాటిని" అమ్మ అంది.

"పాపోడు తెలివిమంతుడు పాపా! మీ పెదనాయన పిల్లలమాదిరి కాదు. అక్కడున్న వాల్లకు ఒక్కడంటే ఒక్కడికి చదువబ్బలేదు. వాల్లకంటే గొర్లు నయం పాపా!"

"గొర్లు అంటే ఏంది మమ్మీ?"

"షీప్" అని మమ్మీ చెప్పింది. అమ్మమ్మ పిలిస్తే మాస్టర్ బెడ్‌రూంలోకి వెళ్లింది.

"షెఫర్డ్‌బాయ్ అండ్ ద టైగర్ కథ నీకు తెలుసా పెత్తాతయ్యా?" అని శంకరయ్యతాతను అడగబోయా. ఇంగ్లిష్ మాటలు మాట్లాడితే శంకరయ్యతాత బలే ఇదిగా నవ్వుతాడు.

సాయంత్రం శంకరయ్యతాతను పార్కుకు తీసుకవెళ్లా.

"ఏందిది? వనమా? కాదే పాపోడా?" చుట్టూ చూస్తూ శంకరయ్యతాత అడిగాడు.

"పార్క్" అన్నా.

"గాలి బాగుందనుకో. ఈ గడ్డీ గాదానికీ, మొక్కలకూ, చెట్లకూ ఇంత భూమి ఎందుకు పాపోడా? పశువుల్ని మేపనిస్తారా, పాడా? ఒక అయిదెకరాలుంటుందేమో. నీళ్ల పారకం ఉంటే మంచి తోటకట్టు. తోటలాగే ఉందనుకో. మల్లె పొదల్లాగా ఉండే చెట్లను చుట్టూగా రెండు వరసలు నాటినారు - నడుమ దారి విడిచి, రెండో ఫరస బయట పాదులు తవ్వి ఏమిటేమిటో మొక్కలు నాటినారు. గోడలవారంతా చెట్లు - సుంకేసలచెట్లు, అవేవో నేరేడు చెట్లు మాదిరిగా ఉండేవి. ఒక్క వేప చెట్టులేదు. మర్రిచెట్టు లేదు. రావిచెట్టు లేదు. ఇది ఎవరిది? గ్రామనెత్తం ఏమోలే! ఇంతకూ ఇది దేనికి పాపోడా?"

శంకరయ్యతాత మాటలకు బలేగా నవ్వొచ్చింది. పెద్దవాళ్లను ఎగతాళి చెయ్యకూడదు. నవ్వును బిగబట్టుకున్నా.

"ఈ పార్కు జాగింగుకూ, వాకింగుకూ పెత్తాతయ్యా. పిల్లలు ఆడుకోవచ్చు" అన్నా.

"జాగింగు, వాకింగు అంటే పాపోడా?"

శంకరయ్యతాతకు అర్థమయ్యేట్లు చెప్పాలంటే కష్టంగదా.

అదుగో ఆ నల్లపాంటు, తెల్ల టీషర్టు అంటే చొక్కా వేసుకున్నాడే ఆయన, తొందరతొందరగా నడుస్తున్నాడు చూడు పెత్తాతయ్యా. అట్లా నడవడం జాగింగ్, అదిగో, ఇంకొకాయన చేతిలో స్టిక్ అంటే కర్ర ఊపుకుంటూ నడుస్తున్నాడు. అది వాకింగ్", అమ్మయ్య! చెప్పేశాను.

"మనూర్లో పొలాలకు పొయ్యే రయితులంతా, కూలోల్లంతా చేసేది ఇదేలే. పల్లెటూర్లలో పనికోసం నడుస్తారు. పట్నాల్లో పొద్దుపోక నడుస్తారు, బూడ్సుల్తో. అంతేనా పాపోడా?"

శంకరయ్యతాత కష్టమైన ప్రశ్నలు వేస్తాడు.

ఒక మూలగా చెట్టుకింద కూర్చున్నాం. పార్కంతా కన్పిస్తోంది. మాకంత దూరంలో ఒకాయన కూర్చొని ఉన్నాడు. ముక్కును ఒక పక్క ఒకసారీ, మరొకపక్క ఒకసారీ చూపుడు వేలితో మూసుకుంటూ గాలిని పీలుస్తున్నాడు. శంకరయ్యతాత ఆయన్ని చూసి "పాపోడా!" అని పిలిచాడు. శంకరయ్యతాత ముఖంలోకి చూశాను.

"ఆ పెద్దమనిషి ఏం చేస్తండాడంటావు? మన ఊర్లో ఒక మఠం ఉందిలే. ఆ మఠంలో సాధుపక్కీరయ్య అని ఉణ్ణాడులే. ఆ సాధుచేసినట్లు చేస్తండాడు. ఈ మనిషి సన్నాసో, సాధో అయితే, కాషాయబట్టలు కట్టుకోలేదే?"

"మంచి గాలి పీలుస్తున్నాడు పెత్తాతయ్యా, గుండెలకు మంచిదని..." అని చెప్పా.

"సరేగానీ పాపోడా! అదుగదుగో ఆ చెట్టును బట్టుకొని... కూర్చుంటా ఉండాడు. లేస్తా ఉండాడు. మర్లా కూర్చుంటా, లేస్తా. ఇవి పట్నంలోని పిల్లాటలా?"

"అది ఒక ఎక్సర్‌సైజ్" అన్నా.

"ఏందో తలాతోకాలేని యవ్వారం... ఇట్లాటోళ్లను మనూర్లో కట్టెపేళ్లను చీల్చమనాల. సరేగానీ, మీ తాతకూడా ఇట్లా నడుస్తాడా?"

"ఆఁ ప్రతిరోజూ అందరికన్న ముందు లేస్తాడు. ఈ పార్క్‌లోనే వాకింగ్ చేస్తాడు", అని బదులు చెప్పా.

"ఎందుకంట? రోజూ రాత్రిళ్లు తాగేది దిగిపోడానికా?"

శంకరయ్యతాత కెందుకొచ్చిందో అంత కోపం?

షుగర్ ఉంది తాతయ్యకు, పెత్తాతయ్యా. రోజుకు ఇరవైరౌండ్లు నడుస్తాడట, తాతయ్య. అమ్మతో చెపుతూవుంటే విన్నాలే", అని సర్ది చెప్పా.

"సుగర్ అంటే అదేంది పాపోడా?"

"అదో జబ్బు పెత్తాతయ్యా. చెక్కర లేకుండా కాఫీ తాగాలి. లడ్లూ అవీ తినకూడదు..."

"అయ్యో! అదేం పాడుజబ్బు పాపోడా? పాపం! వీడికొచ్చింది. బెల్లం బువ్వ, బెల్లం పరమాన్నం, ఓళిగలు, అప్పచ్చులు, కజ్జికాయలు, నూగుంటలు ఎంత ఇష్టమో మీ తాతయ్యకు, పిల్లప్పటినుంచీ!. అవన్నీ తినకూడదా? మద్దెలో ఈ రౌండ్లు తిరగడమేంది?"

తాతయ్య అంటే పెత్తాతయ్యకు ప్రేమే.

"డాక్టర్లు చెప్పారు", అన్నా.

"ఏం డాకటేర్లో, ఏం పాడో! నాకేం రోగంలేదు కుయ్యోమొర్రో అని మొత్తుకున్నా. చిక్కిపోయినానంట! ఈ అయిద్రాబాదు తీసుకొని వచ్చినాడా? ఇంకా పోలేదనుకో. పోతే పని పంగాలేని ఏది చెయ్యమంటారో - దబ్బు గుంజి", శంకరయ్యతాత దిగులుచూసి నాకూ దిగులైంది.

రెండుగేట్లలో నుంచీ దీదీలు, అంటీలు, అమ్మమ్మలూ వచ్చారు. వాకింగ్ మొదలుపెట్టారు. శంకరయ్యతాత వాళ్లందరినీ ఎగాదిగా చూస్తున్నాడు. అట్లా ఎగాదిగా చూడటం మానర్స్ కాదు. టీచరు చెప్పింది. ముక్కూ ముఖం తెలియని స్త్రీలను ఎగాదిగా చూడకూడదు. శంకరయ్యతాత మరీ ఓల్డ్‌మాన్ గదా! ఎవరూ ఏమనుకోరులెమ్మనుకున్నా. శంకరయ్యతాత అడిగాడు.

"ఇదేంది పాపోడా! ఇక్కడ తిరుగుతూ ఉండే ఆడోళ్లకు కూడా రోగాలున్నాయా? ఇళ్లల్లో పనీపాటల్లేవా?"

"ఆరోగ్యానికి వాకింగ్ మంచిది తాతయ్యా. ఆడామగా తేడాల్లేవు", అన్నా.

"పొలం పనులకంటేనా? ఇంటి పనులకంటేనా? అయినా ఇక్కడ పొలం పనుల్లేవు. ఇంట్లో పనులూ తక్కువే... బొంబాయి సంగతులు చెప్పు పాపోడా", శంకరయ్యతాత బొంబాయి అనే వేళకు నాకు హుషారొచ్చింది.

బొంబాయి ముందు హైదరాబాద్ పనికిరాదని చెప్పాను. జుహుబీచ్‌లో ఒంటెలు ఎక్కడం, సముద్రం ఒడ్డున ఇసకలో పరుగెత్తడం, ఐసుక్రీములు తినడం, డింపుల్ కపాడియా ఇల్లు, జితేంద్ర ఇల్లు, మా విలేపార్లే ఇర్లాలేన్‌లోని సన్యాసి ఆశ్రమం, నూడుల్స్, పిజాలు, కోకోకోలాలు, గణపతిపప్పా, పార్కులు, గేట్ వే ఆఫ్ ఇండియా, అక్కడ పావురాలు, ఎలిఫెంటాకేవ్స్, పెద్ద పెద్ద హోటళ్లు, మల్టీస్టోరీడ్ బిల్డింగులు, షారూఖాన్... చాలా చాలా చెప్పాలే. బొంబాయికి రమ్మని కూడా చెప్పాను. అంతా విని శంకరయ్యతాత అన్నాడు:

"మీ బొంబాయి ముందూ, ఈ హైదరాబాదు ముందూ మనూరు పాతపల్లె ఇంత ఉంటాదంటావా?", గోలీ అంత మట్టిపెళ్లను చేతిలో తీసుకొని "ఇంత?" అని నాకు చూపించాడు.

శంకరయ్యతాత మాటిమాటికీ వాళ్ల ఊరితో పోల్చి చూస్తాడు. అదేదీ శంకరయ్యతాత వాళ్ల ఊరు? పాతపల్లె... ఓల్డ్ స్మాల్ విలేజ్. నేను చూల్లేదు ఇంతవరకు. గోలీ అంతే ఉంటుందిలే.

చీకటి పడింది.

"ఇంటికి పోదాం, పెత్తాతయ్యా, అమ్మ కోప్పడుతుంది", అన్నా.

నాకు చీకటంటే చాలా భయం. పార్కులో లైట్లను ఎవరో పగలగొట్టారు.

ఇంటికి వెళ్లేసరికి, సోఫాలో కూర్చొని అమ్మా, అమ్మమ్మా మాటల్లో ఉన్నారు. శంకరయ్యతాత, నేనూ బాత్‌రూంలోకి వెళ్లి కాళ్లు కడుకున్నాం. సోఫాల్లో కూర్చున్నాం.

అమ్మ చెప్పింది:

"తాతయ్యా! నాన్న ఫోను చేశాడు. రేపు పొద్దున్నే డాక్టరు దగ్గరకు పోవాలట. మనిద్దరం కలిసి పోవాలి. అక్కడ అన్నీ నాన్న మాట్లాడి పెట్టాడులే. ఏర్పాట్లన్నీ చేశాడు."

"నాకేం రోగాలున్నాయి పాపా! మీ నాయన ఇదిగానీ", శంకరయ్యతాత గొణిగాడు.

"నేనూ వస్తా మమ్మీ మీతో", అన్నా. నేను గొడవచేస్తానని అమ్మకు తెలుసు.

"సరేలే. కారొస్తుంది వెళ్దాంలే", అంది.

మరుసటి రోజున శంకరయ్యతాతకు ఎన్ని టెస్టులో! టెస్టులమీద టెస్టులు. శంకరయ్యతాత టెస్టులకు వెళ్లడం, మమ్మీ అక్కడికీ ఇక్కడికీ పరుగెత్తడం. నేనేమో కదలకుండా ఒకచోట కూర్చోవాలి - రిసెప్షన్‌లో ఎవరితో మాట్లాడాలి. చదువుదామంటే అన్నీ పెద్దవాళ్ల మ్యాగజైన్లే. రిసెప్షన్ హాళ్లలో పిల్లలకు మ్యాగజైన్లు అవసరం అనే తెలివిలేదు. బోర్ కొట్టింది. ఇంకా రెండు రోజులు టెస్టులు చెయ్యాలన్నారట. ఆ రెండు రోజులూ నేను వెళ్లలేదు. ఇంట్లోనే ఉన్నా. అమ్మమ్మ ఎక్కువ మాట్లాడదు. నేనేమో టి.వి., కంప్యూటర్‌గేమ్స్‌లో. ఫ్లాట్స్‌లో నా ఈడు పిల్లలు లేరు. శంకరయ్యతాతలాంటి ఫ్రెండు ఒక్కరూలేరు.

శంకరయ్యతాత సాయంత్రానికి వచ్చినా, దిగులుగా ఉంటాడు. ఎక్కువగా మాట్లాడడు. అమ్మను అమ్మమ్మ ఏదో అడుగుతుంది. అమ్మ ఏదో చెపుతుంది. తాతయ్య నన్ను అడగడు. రోగాలమీద కోపం వచ్చింది. మూడురోజులు టెస్టులే టెస్టులు.

నాలుగోరోజు తాతయ్య ఇంట్లో ఉన్నాడు.

"నాకేం జబ్బుందిరా, డాక్టర్లు ఇట్లా చంపినారు?" అన్నాడు శంకరయ్యతాత.

"అదీ నీకు తెలుసా? నాకు తెలుసా? వైద్య పరీక్షల్లో తేలాల. డాక్టర్లు చెప్పాల", అన్నాడు తాతయ్య.

"మన ఊరినంతా - ఇల్లూ, భూములూ, గొడ్డూగోదా-తెగనమ్మితే కూడా ఇట్లాటి ఆస్పత్రిని కట్టడం కుదరదనుకో. మంచి సోకుల ఆస్పత్రిలోనే చూపించినావు. అడిగి అడిగి, పరీచ్చలు చేసి చేసి చంపినార్రా", శంకరయ్యతాత నావైపు చూస్తూ అన్నాడు.

"ఇప్పటికి నీకేం లేదని చెప్పినారు గానీ, కాస్త తిండీ అదీ బాగా తినాల", అన్నాడు తాతయ్య, అమ్మమ్మవైపు చూస్తూ.

"ఎంత గుంజినారు?" అని అడిగాడు శంకరయ్యతాత, నావైపు చూస్తూ.

"నీకెందు కా తంటా? కొడుకునైనందుకు ఆ మాత్రం పెట్టుకోలేనా?" అన్నాడు తాతయ్య, అమ్మమ్మవైపు చూస్తూ.

"ఇంకా పెళ్లిగాని ఇద్దరు కూతుర్లున్నారు. బయట ఊర్లల్లో చదువుకుంటున్నారు", అన్నాడు శంకరయ్యతాత అమ్మవైపు చూస్తూ.

"అదంతా నీకెందుకుగానీ... బాగా తిను. బాగా పడుకో. ఒక పది రోజులపాటూ. పని ఉంది..." అని తాతయ్య బయటికి వెళ్లిపోయాడు.

శంకరయ్యతాతకు అమ్మ, అమ్మమ్మ ప్రతిరోజూ బలవంతంచేసి తినిపిస్తున్నారు. కాఫీ తాగనివ్వడంలేదు. గుడ్లు, మటనో, చికెనో, ఫిషో, ప్రాన్సో పూటపూటా... నన్ను బలవంతంచేసి తినిపించటంలా, అట్లా... నాలాగే శంకరయ్యతాత సరిగా తిననే తినడు. నాకంటే నూడుల్స్ ఇష్టం. లేకపోతే తినను. తాతయ్యకు ఏ ఇష్టమూలేనట్లుంది.

ఆ సాయంత్రం పార్కులో చెప్పా, "బాగా తినాల పెత్తాతయ్యా" అని.

"తినబుద్ధిగాదు పాపోడా" అన్నాడు.

"ఎందుకు?" అని అడిగా.

"అంతంత ఖర్చా?" అన్నాడు.

"అయితే ఏం?" అన్నా.

"మన ఊరు గ్నాపకం వస్తోంది", అన్నాడు.

"వస్తే ఏం?" అన్నా.

"అది నీకు తెల్దులే" అన్నాడు.

"నాకన్నీ తెలుసు" అన్నా.

"నీకేం తెలుసు?" అన్నాడు.

"నువ్వు ఏదోఒకటి అడుగు తెలుస్తుంది", అన్నా ఉపాయంగా.

"గట్టిగా అడిగితే పాప చెప్పిందిలే. రోగం లేదని చెప్పడానికి పదివేల ఖర్చా? మనూర్లో పండితేగిండితే అయిదెకరాల్లోని సెనక్కాయ పంటకు సమానం - అదీ ఇంటి , మనుషులంతా పనిచేస్తే - కూలి ఖర్చులు గాక. ఫలసాయం ఇంటికొచ్చిందాకా నమ్మకంలేదు. ఈ రోజు ఊరి దగ్గరనుంచీ జాబు వచ్చిందా? మీ మామ రాసినాడు. మన తోటలో సెనక్కాయకు లద్దెపురుగు పట్టుకుందంట. బెల్లం పానకం, తవుడూ దూనెట్టు కలిపి మొక్క మొక్కకూ పూస్తుండారంట. రోజూ గండమే. వెంటనే రమ్మని రాసినాడు, మీ మామ. మన పల్లెలట్లా ఉండాయి. ఇంతంత ఖర్చుబెట్టే అన్నం సయిస్తుందా పాపోడా? ఇక్కడంతా వేలూ, లచ్చలూ, కోట్లూ. పట్నాలిట్లా ఉండాయి. డబ్బు పెంచిక బిల్లల్తో సమానం. ఇదంతా ఏమిటి పాపోడా?", శంకరయ్యతాత ఆకాశంవైపు చూస్తూ అడిగాడు.

నిజ్జంగా చెపుతున్నా.

ఇంత పెద్దపెద్దవి తెలిస్తే, శంకరయ్యతాతకు చెప్పేవాణ్ణి.

● *ఈనాడు ఆదివారం, 27 సెప్టంబరు 1998.* ●

# ముఖదర్శనం

ఇంటినిండా మనుషులు.

పెళ్ళికి వచ్చినట్లు వచ్చారు.

బంధు బలగం పెద్దది మరి.

ఇంట్లో ఇవతలి భాగంలో నేలమీద ఆడవాళ్ళూ, పిల్లలూ ఒకరినొకరు ఒరుసుకొని కూర్చున్నారు.

నాలుగు తరాలవాళ్ళున్నారు. పెద్దతరం, మధ్యతరంవాళ్ళు తమ జాతి తల రాతల్ని గురించి వాపోతున్నారు.

పిల్లలకు మరీ అయోమయంగా ఉంది. అమాయకమైన ఉల్లాసంతో ఇంట్లోకీ, బయటకూ తిరుగుతున్నారు - ఏదో చూద్దామని, మరేవో బాల్యచేష్టలు చేస్తూ.

అందరి మధ్యలో సావిత్రమ్మ ముఖం కనపడనీయకుండా చీరకొంగు కప్పుకుంది. పది రోజుల దుఃఖం గడ్డకట్టుకున్నా, ఆమె సన్నటి మూలుగు వినిపించీ వినిపించకుండా ఉంది.

'ఈ జేజి వేరు. ఈ సావిత్రమ్మ జేజి వేరు' అనుకుంది భార్గవి - సావిత్రమ్మ మనుమరాలు; పెద్ద కొడుకు చిన్న కూతురు; తొమ్మిదేళ్ళ పాప. పది రోజులుగా భార్గవి, సావిత్రమ్మ జేజిని చూస్తూనే ఉంది. ఎప్పుడూ ఏదో పనిలో, పలకరింపుల్లో, నవ్వుల్లో, కోపాల్లో, అదిలింపుల్లో కనిపిస్తూ ఉండి, పది రోజులుగా ముఖం కళదప్పిన జేజిని చూస్తూనే ఉంది. 'అబ్బ చచ్చిపోక ముందు జేజి వేరు, ఈ జేజి వేరు...' భార్గవి పసి బుర్రకు దిక్కుతోచకుండా ఉంది.

ఇంట్లో అవతలి రెండు భాగాల్లో, ఇంటి ముందు వసారాలో మంచాల మీదా, కుర్చీల్లోనూ మగవాళ్ళు కూర్చున్నారు.

జగితి మీదా, నడవలోనూ, అవతలి మరొక భాగంలో గాటిపాటకు ఎదురుగా నడవలోనూ, సావిత్రమ్మ భర్త రామిరెడ్డి దాయాదులైన మగవాళ్ళు వాళ్ళు; వసారాలో రామిరెడ్డికి వరసైన మగవాళ్ళు ఒకరినొకరు పలకరించుకుంటున్నారు.

పరస్పరం యోగక్షేమాలు కనుక్కుంటున్నారు.

వానలు, పంటలు, పంటలకు పట్టిన తెగుళ్ళు, పడిపోయిన పంటల ధరలు, గ్రామ పార్టీలు, జన్మభూమి, స్థానిక రాజకీయాలు - అన్నీ మగవాళ్ళ మాటల్లో దొర్లిపోతున్నాయి.

కొందరుమాత్రం చనిపోయిన తమ బంధువు రామిరెడ్డిని గురించీ, వాళ్ళ కుటుంబ స్థితిగతుల గురించీ గొంతులు తగ్గించి మాట్లాడుకుంటున్నారు.

భార్గవి మనసు ఇవేవీ అందనంత దూరంలో ఉంది.

'ఈ రోజు అబ్బ దివసం.

చిన్న దివసం, పెద్ద దివసం అంటారు.

ఈ పొద్దు దివసం.

అసలు దివసం అంటే ఏందో?

జేజిని ఏం చేస్తారో?

జేజి మాట్లాడడం లేదు.

అమ్మ, గాయత్రి పెద్దమ్మ, పార్వతమ్మ చిన్నమ్మ, రాజేశ్వరత్త, సరస్వతత్త, లక్ష్మి అత్త, వెంకటమ్మ అవ్వ, సుబ్బయ్య జేజి - అందరూ వచ్చినారు.

జేజిని చూడగానే కన్నీళ్ళు పెట్టుకున్నారు. కళ్ళు తుడుచుకుంటూ కూర్చున్నారు. అత్తలు, అవ్వ, జేజి చేతుల మీద చేతులు వేసి జేజి పక్కనే కూర్చున్నారు.

అందరూ మాట్లాడుతున్నట్లే ఉంటుంది.

ఏదీ సరిగ్గా తెలియదు.

అమ్మ మంచి బట్టలు కట్టుకోనీలేదు.

బయట ఊర్ల నుంచి వచ్చిన చుట్టాలు మంచి బట్టలు కట్టుకొని వచ్చినారే?'

తల్లిని అంటిపెట్టుకుని కూర్చున్న భార్గవికి అక్కడి దృశ్యాలన్నీ గందరగోళంగా ఉన్నాయి.

"మీ ఆడవాళ్ళ పని ఇంక మొదలు పెట్టండ్రా. రావలసిన చుట్టాలంతా వచ్చినారు. బ్రామ్మణయ్య కూడా ఇప్పుడే వచ్చినాడు." ఇవతలి వైపునకు వచ్చి, ఎవరో ఒక పెద్దాయన చెప్పి, అవతల వైపునకు ఆదరాబాదరా వెళ్ళిపోయాడు.

అప్పటి వాతావరణంలో ఇవతలకీ, అవతలకీ మధ్య కనపడని సరిహద్దులేవో ఉన్నట్లుంది.

'ఆడవాళ్ళ పని ఏమిటి? ఏం మొదలు పెడతారో?' ప్రతిరోజూ ఇంట్లో, పండగల్లో, పబ్బాల్లో, తోటల్లో, పెళ్ళిళ్ళల్లో ఆడవాళ్ళ పని ఏదో భార్గవికి తెలుసు.

ఈ రోజు ఆడవాళ్ళ పనే తెలియదు.

ఇవతలింట్లోకి పిచ్చమ్మవ్వ వచ్చింది. డెబ్భయ్యేళ్ళ పైబడిన పండు వితంతువు. అంచులేని తెల్లచీరలో, రవికలేని గుండెల్ని పైటకొంగుతో కప్పుకొని వచ్చింది.

ఊళ్ళో ఎవరింట్లో ఏ కార్యం జరిగినా పిచ్చమ్మవ్వ సాయం కోరతారు.

పురుళ్ళకు తోడు వస్తుంది.

బాలింతలకు జాగ్రత్తలు చెబుతుంది.

సమర్త సంబరంలో ఎప్పుడెప్పుడు ఏది ఎట్లా చెయ్యాలో బోధిస్తుంది.

పెళ్ళి తంతులన్నీ ఏ వరుసలో, ఏ ప్రకారం సాగిపోవాలో చెప్పవలసిన వాళ్ళకు చెప్పి, దూరంగా వంటల దగ్గర అజమాయిషీకి వెళ్ళిపోతుంది. శుభకార్యాల్లో తనెంత దూరంలో ఉండాలో, అశుభకార్యాల్లో ఎంత దగ్గరగా ఉండాలో పిచ్చమ్మవ్వకు అనుభవం రక్తమైంది.

పద్దెనిమిదో ఏట, పసిది పాలు తాగే వయసులో ఉన్నప్పుడు పిచ్చమ్మ భర్త ఖూనీ అయిపోయాడు.

"బయట పనులన్నీ పూర్తి అయినాయర్రా. సావిత్రమ్మ మొగుడికి ఇష్టమైనవన్నీ తయారైపోయినాయి. బయటనే లే. ఆచారం తప్పుతుందా? ఇంటి చాకలోళ్ళు కాచుకొని బయట్నే వీధిలో ఉండారు. సావిత్రమ్మకు స్నానం చెయ్యించాలా? సాంగ్యాలన్నీ పూర్తికావాలా? రేవుకు తీసుకపోవాలా? మన కర్మలన్నీ చానా చానా... తొందరగా బయలుదేరండి" పిచ్చమ్మ చెప్పింది.

"మొగోళ్ళ పనులు మొదలైనాయా?" ఎవరో అన్నారు.

"మొగోళ్ళ పనులు మొగోళ్ళవి. ఆడోళ్ళ పనులు ఆడోళ్ళవి. ఎవరి కర్మలు వాళ్ళవి" అంటూ పిచ్చమ్మ అందర్నీ లేవదీసింది.

అందరితో పాటూ తల్లి చెయ్యి పట్టుకొని భార్గవి లేచి నిలబడింది.

'రేవు అంటే ఏమిటో? ఆడవాళ్ళ పనులు ఇప్పుడేవో? కర్మలంటే ఏమిటో?' ఇవే భార్గవి మనసుకు అందలేదు. నలుగురైదుగురు సావిత్రమ్మను పొదివి పట్టుకొని వీధిలోకి నడిపించారు.

నట్టనడివీధిలో సావిత్రమ్మ చుట్టూ సాటి స్త్రీలు.

అంతటా వాళ్ళే. ఎదురిళ్ళ ముందరి అరుగుల మీదికి ఎక్కి కొందరు చూస్తున్నారు.

ఎదురిళ్ళ మిద్దెల మీద నుంచి కొందరు తొంగి చూస్తున్నారు.

చిన్న పిల్లలు తల్లుల్ని అంటగరచుకొని కళ్ళింతలు చేసుకొని చూస్తున్నారు.

భార్గవి తల్లి చేతిని వదలకుండా గట్టిగా పట్టుకుంది.

ఎత్తెత్తుగా ఉండే పెద్దవాళ్ళ మూలంగా భార్గవికి జరిగేది సరిగ్గా కనపడడం లేదు.

సావిత్రమ్మ తోడబుట్టినవాళ్ళూ, పుట్టింటి దాయాదులూ - అన్నలూ, తమ్ముళ్ళూ, చిన్నాయనలూ, పెదనాయనలూ వసారాలో నిలబడి చూస్తున్నారు.

"కొంచెం ఫక్కకు తప్పుకోండర్రా. మీదిమీదికి తోసుకొని రావద్దు. ముందు స్నానం కావాల..." పిచ్చమ్మవ్వ, మరిద్దరు ముగ్గురు వితంతువులు, సావిత్రమ్మ చుట్టూ కొంచెం చోటును ఏర్పచగలిగారు. సావిత్రమ్మ ముసుగుతోటి తలను ఎత్తనేలేదు.

పిచ్చమ్మవ్వ ముసుగును తొలగించింది. ఆమె నిర్వికారంగా తల ఒగ్గింది. నేలకేసి తప్ప, చూపులు తిప్పలేదు.

నట్టనడివీధిలో...

సావిత్రమ్మ ముఖానికీ, చేతులకూ, పాదాలకూ పసుపు రాశారు.

అందరి చూపుల మధ్య సావిత్రమ్మకు తల స్నానం చేయించారు.

ఆమె పొడవాటి జుట్టు చెల్లాచెదరైంది. ముఖం మీద పడిన వెంట్రుకల్ని ఎవరో సరిచేశారు.

తల మీద నీళ్ళు ఓడుతూనే ఉన్నాయి.

తడిసిపోయిన రవిక ఒంటికి బిగుసుకపోయింది. రొమ్ములు నలువురికీ కనపడకుండా చీర కొంగును సావిత్రమ్మ చిన్నక్క పట్టుకుంది.

రవికను ఒకంతట విప్పుకోవడం సావిత్రమ్మకు సాధ్యం కాలేదు. పెద్దక్క సహాయంతో ఎలాగో సావిత్రమ్మ రవికను విప్పుకోగలిగింది.

పుట్టింటివాళ్ళు తెచ్చిన కొత్త రవికను తొడుక్కుంది.

తడిసి ముద్దయిపోయిన పాత చీరను విడిచి పుట్టింటివాళ్ళే తెచ్చిన కొత్త చీరను చుట్టుకుంది.

అంతసేపూ సావిత్రమ్మ సిగ్గుతో చచ్చిపోయింది. నిర్వేదం ముంచుకొచ్చింది.

పిచ్చమ్మలాంటి పండు వితంతువులూ, నిండు విధవలూ చెప్పినట్లే చేయసాగింది.

'ఇంట్లో జల్దారిలోనే ఈ పని చేసి ఉండవచ్చు. దరిద్రం. బయటే చెయ్యాలంట' అని సావిత్రమ్మ కూతుళ్ళు మనసులో అనుకున్నారు.

'ఏం ఆచారాలో, ఏం పాడో', అని ఒకరిద్దరు యువకులనుకున్నారు.

"గంధం పూయండి."

"కుంకుమ బొట్టు పెట్టండి."

"పూలు పెట్టండి."

"గాజులు తొడగండి."

"వక్కలాకులు చేతుల్లోబెట్టి నమస్కరించిపోండి."

"పుట్టింటి వాళ్ళు వడి బియ్యం తెచ్చినారా?"

"తెచ్చినారులే."

"ఒడిలో పొయ్యండి."

"పుట్టింటివాళ్ళు టెంకాయ దెచ్చినారా?"

"తెచ్చినారు."

"రండమ్మా రండి, ఒక్కొక్కరే..."

"అయినవాళ్ళందరూ రండి."

పండు వితంతువులూ, నిండు విధవలూ, పండు ముత్తయిదువులూ, నిండు ఇల్లాళ్ళూ ఎవరు, ఏది, ఎందుకు శాసిస్తున్నారో భార్గవికి తెలియకుండా ఉంది.

అమ్మతో పాటు ఎలాగో ముందుకొచ్చి సావిత్రమ్మ జేజిని భార్గవి చూడగలిగింది.

అయినవాళ్ళందరూ ఒక్కొక్కరే వచ్చారు. సావిత్రమ్మ నుదుట పెట్టిన ఎర్రటి కుంకుమ బొట్టుమీద, బొట్టు మీద బొట్టుపెట్టారు. తడిముఖం మీద కూడా కుంకుమ రాలిపడిపోతోంది. నుదుటి మీద పక్కలకు చెదిరిపోతోంది. ఒంటికి రాసిన పసుపు బట్టల కంటుకుంది. తడిసిన జుట్టును ముడివేసి, ముడిలో తురుముతున్న మల్లెపూలూ, చామంతులూ, కనకాంబరాలూ కిందికి రాలేవి రాలుతూనే ఉన్నాయి. కొప్పులో నిలిచినవి నిలుస్తూనే ఉన్నాయి. తొడిగిన అయిదు పది మట్టిగాజులు, చేతుల నిండుగా కనిపిస్తున్నాయి.

స్నానం చేయించిన నీళ్ళ మురికి మధ్య సావిత్రమ్మ రూపమిచ్చిన ముత్తయిదువైంది.

పట్టపగలు.

నట్టనడివీధి...

"చూడండర్రా. కావలసిన వాళ్ళంతా చూడండి. మల్లెప్పుడు చూస్తాం, సావిత్రమ్మ మొగాన్ని, ఈ రకంగా. మొగం చూడండి."

"తోడబుట్టిన వాళ్ళను రమ్మనండి."

"వాళ్ళు తప్పక చూడాలి. రమ్మనండి... రమ్మనండి."

పిలుపులో, ఆజ్ఞలో, హెచ్చరికలో • వాటిని పాటిస్తూనే ఉన్నారు.

'ఏం చూడాల? చూసినాంగదా, రోజూ చూసేదే గదా?' భార్గవికి దిక్కుతోచలేదు.

సావిత్రమ్మ రక్తం పంచుకున్న ఆడబిడ్డలు, తల్లి ఎదుట దుఃఖాన్ని నిగ్రహించుకోలేకపోయారు. అమ్మతో పాటుగా, భార్గవికి కన్నీళ్ళు పొంగుకొచ్చాయి.

పుట్టింటి మమకారాలు. కళ్ళు చెమర్చాయి.

"ఎంతసేపు అట్లా బాధపెడతారు, చేసేది చెయ్యబోతూ?" సావిత్రమ్మ పుట్టింటి కుర్రవాడెవరో అసహనంగా అన్నాడు.

"తొందరగా కానివ్వండి. వీళ్ళ ఏడ్పులకు పిల్లలు జడుసుకుంటారు."

'ఇంక ఆడవాళ్ళ పని మొదలుపెట్టండ్రా' అని చెప్పిపోయిన పెద్దాయన హెచ్చరిక చేశాడు.

"సరేలే. మేము ముందు చస్తే బాగుండు. అన్నీ పడేది మేము" అంది పిచ్చమ్మవ్వ.

ఆ పడేదేమిటో భార్గవికి ఏ మూలో తెలిసివస్తోంది.

"సావిత్రమ్మ పెద్దకొడుకెక్కడ?"

"స్నానం చేసినాడా?"

"చాకల్ని తీసుకొని ముందుగా రేవుకు వెళ్ళమనండి."

"ఆ జమ్మిచెట్టు కింద పూజా అదీ చేసి విస్తర పెట్టించండి."

"చేయించినవన్నీ విస్తర్లో పెట్టించండి. అన్నం, పరమాన్నం, పప్పు, కూరలూ, కోడికూర, కోడిగుడ్డు.... ఏదీ మరచిపోవద్దు. అన్నీ రామిరెడ్డికిష్టమైనవి. ఆత్మ తృప్తిపడుతుంది.

"అన్నీ చూసుకున్నాంలే."

"అక్కడ సావిత్రమ్మ స్నానం చేయడానికి నీళ్ళు పెట్టినారా?"

"ఆఁ"

"చీర మార్చుకోవాల గదా? పుట్టింటివాళ్ళు తెచ్చిన తెల్లచీరనూ, తెల్ల రవికనూ చాకలితో పంపినారా?"

"ఆఁ"

"టెంకాయ."

"అన్నీ."

రకరకాల గొంతులు, ఆదేశాలు, సమాధానాలు.

సావిత్రమ్మ రేవు ప్రయాణం మొదలైంది. ఊళ్ళోని మూడు వీధుల ద్వారా ఆమె ప్రయాణం సాగింది. సావిత్రమ్మ వెంట, చూడవచ్చిన ఇల్లాళ్ళూ, సాంగెం నడిపించే వితంతువులందరూ ఉన్నారు. వెంట వచ్చిన పిల్లల్ని వారించలేకపోయారు. సావిత్రమ్మ నిండు ముత్తయిదువ రూపాన్ని, చూడవలిసిన బంధువులింకా ఉన్నారేమోనని ప్రతి ఇంటిముందూ సావిత్రమ్మను కొద్ది క్షణాలు నిలబెట్టారు. వాళ్ళ చేతుల్లో సావిత్రమ్మ ఒక తోలుబొమ్మగా మారింది.

రేవు దగ్గర నట్టనడివీధిలో లాగానే చుట్టూ చుట్టుకున్న స్త్రీలమధ్య స్నానమైంది. కట్టుమారింది. సావిత్రమ్మకు ఇష్టమైన కాఫీరంగంచు కనకాంబరం రంగు చీర–పుట్టింటివాళ్ళు తెచ్చిన చీర–మారింది. వాళ్ళే తెచ్చిన తెల్లచీర వచ్చింది. చేతులు వెనుకకు పెట్టుకోమని వాటిని పట్టుకొని, వెనక్కు చూడవద్దంటూ, పిచ్చమ్మవ్వ సావిత్రమ్మ గాజులు పగలగొట్టింది. మరొక వితంతువు సిగపూలు తీసిపారేసి, కుంకుమ చెరిపింది, పుస్తె తెంచింది.

సావిత్రమ్మ గింజుకొని, వెర్రి ఆవేశంలో పందు వితంతువులను తప్పించుకొని పిండదానం చెయ్యడానికి వచ్చిన పెద్ద కొడుకుని కావలించుకొని బోరుబోరున విలపించింది.

ఏడ్చి ఏడ్చి సొమ్మసిలిపోయిన సావిత్రమ్మ జేజిని చూసి భయంతో భార్గవి వెక్కిళ్ళు పెట్టి ఏడ్వసాగింది.

"పిల్లలు ఇట్లాంటిచోటికి రాకుంటే బాగుండు... చూడండి ఆ పాప!"

"సావిత్రమ్మ మనుమరాలు."

"బెదిరిపోయింది."

"నేనూ ఆ వయసులో అంతే. ఆడపుట్టుక. చూస్తేనే మంచిది. ఎవరి రాత ఎట్లాగుంటుందో?"

ఏం దిష్టి తగులుతుందోనని తల్లి భార్గవిని గట్టిగా పొదివి పట్టుకుంది.

ఓదార్చటానికి భార్గవి చిన్నమ్మా, పెద్దమ్మా, అవ్వా ప్రయత్నించారు. ఇంటికి చేరే దాకా భార్గవి మౌనంగా దుఃఖిస్తూనే ఉంది.

బ్రాహ్మణోక్తంగా రామిరెడ్డి పెద్దదినం పూర్తి అయింది. ఇంట్లో అవతలి భాగంలోనూ, అవతలి మరొక భాగంలోనూ, వసారాలో, ఇవతలా అందరి మీదా బ్రామ్మణయ్య పూజ చేసిన నీళ్ళు చిలకరించాడు. శుద్ధి పూర్తి అయిందనిపించాడు.

ఇంట్లో ఇవతలి భాగంలో నేల మీద బంధు స్త్రీజనం మధ్య సావిత్రమ్మ కూర్చుంది. ఆమెకు రోదించే శక్తి పోయింది. ఆకలవుతోంది.

అవతల భాగంలో దివ్వె ముట్టించారు.

"దివ్వె చూసి పోండ్రా."

"సావిత్రమ్మ మొగం చూసి వెళ్ళండ్రా."

"మన దాయాదులకు ఇక్కడే భోజనం."

"మనకు వరసైన వాళ్ళకు చెప్పండి. వాళ్ళకు వేరేచోట భోజనాలు ఏర్పాటయ్యాయి. అన్నం తిని వెళ్ళమనండి. ఈ కాలంలో పట్టింపులెందుకు? సాయంత్రం రెండు గంటలు దాటింది."

భార్గవికి అప్పుడే ఒళ్ళు వెచ్చబడింది. ఎవరూ సరిగా గమనించలేదు. చీకటి పడేవేళకు భార్గవికి జ్వరం ముంచుకొచ్చింది. సలసలా ఒళ్ళు కాలుతోంది. 'భయపడింది. అంతగా అయితే పొద్దున్నే డాక్టరు దగ్గరకు తీసుకపోవచ్చు' అనుకున్నారు.

భార్గవికి రాత్రి అంతా ఒకటే పలవరింతలు.

"నన్ను జేజి మాదిరి చేయొద్దు... చేయొద్దు... జేజీ! నాయనా! పిచ్చమ్మవ్వా! సుబ్బమ్మ జేజీ! నన్నట్లా చేయొద్దు. మొగునికంటే నేనే ముందు చచ్చిపోతా. అందరూ చచ్చిపోండి. బొట్టు తియ్యకండి. గాజులు పగలగొట్టకండి. పూలు తియ్యకండి. నాకు ముందరి జేజే కావాల. ఈ జేజి వద్దు. వద్దు."

రామిరెడ్డి పెద్ద దివసంనాటి దివ్వె వెలుగుతూనే ఉంది.

తల్లడిల్లిపోతున్న గాయత్రి పెద్దమ్మ, పార్వతమ్మ చిన్నమ్మ, రాజేశ్వరత్త, సరస్వతత్త, లక్ష్మి అత్త, వెంకటమ్మవ్వ, సుబ్బమ్మ జేజి – వీళ్ళందరి భయాందోళనల మధ్య భార్గవి మంచంలో పలవరిస్తూనే ఉంది. భార్గవి నుదుటి మీద తడిగుడ్డను ఆరిపోకుండా చన్నీళ్ళతో తడుపుతూ, భార్గవి ముఖంలోకే చూస్తూ సావిత్రమ్మ...

*ఇండియాటుడే, 6 అక్టోబరు 1998.*

# స్వస్తి

ఎటువైపు వీస్తుందో దిక్కుతెలియని విసురుగాలిలో, ఎగిసిపడే కొలిమి సెగల్లాగా ఎండ.

ఎమ్మెల్యే ఇంట్లోలేడు. ఆ పనులకూ, ఈ పనులకూ, మర్యాదలకూ, మంతనాలకూ వచ్చీపోయేవాళ్ల రద్దీ లేదు; సందడీ లేదు. గన్‌మెన్ ఇద్దరికీ తెరపి దొరికింది. కాంపౌండ్ బయట గేటుకు కొంచెం అటుగా నిలబడ్డారు ఇద్దరూ; గుండెలనిండా సిగరెట్ల పొగను పీల్చుకున్నారు. మాటల్లో పడ్డారు.

"మన సార్‌కు ఏడుగురు గన్‌మెన్‌లు ఎందుకు? నేనూ, నువ్వు – మనం ఇద్దఒ.మే – పోనీలే రజాక్‌తో కూడా కలుపుకొని మనం ముగ్గురమూ చాల్దా? సార్ మనకు ఉద్యోగాలు ఇప్పించినాడు. ఎప్పటినుంచో చూపెట్టుకొని ఉంటున్నాం. సార్ మన మేలు కోరతాడు. సార్ మేలు మనం కోరతాం. సార్ అంటే మనకు ప్రాణం లేదా?" మరో గన్‌మెన్ వీరన్నను, నాగిరెడ్డి అడిగాడు.

"ఇదిగో రెడ్డీ!" నాగిరెడ్డి ముఖంలోకి చూస్తూ, వీరన్న పలకరింపుతో మొదలుపెట్టి, చెప్పబోయాడు.

"అట్లా పిలవద్దు. మనిద్దరం పిల్లప్పటినుంచి కలిసి చదువుకున్నాం. ఇద్దరం చేసేది ఒక ఉద్యోగమే. ఆ మాట కొస్తే నువ్వు నాకు మూడేండ్లు సీనియర్. నాగూ! అను చాలు" అన్నాడు నాగు.

"అలవాటులే అబ్బా! మా నాయన అలవాటు. మన పల్లెల అలవాటు. నా కులం నాకు గుర్తుకొచ్చిందిలే. ఏదో మాదిగ రిజర్వేషన్ల పోరాటం వార్తలు ఇంతకుముందే చదివినాలే. పేర్ల వెనుక ఏ తోకలుంటే ఏముంది? కూడు ముఖ్యం

గానీ! నువ్వు అడిగింది బాగుంది. సరే గానీ నువ్వెప్పుడన్నా గాంధీ మూడు కోతుల్ని గురించి వినలేదా?" వీరన్న అటూ ఇటూ చూస్తూ అన్నాడు.

"సరిగ్గా గుర్తులేదు. చదివిన చదువు ఎప్పుడో మర్చిపోతి. అయినా, మధ్యలో అసలు ఈ కోతులెందుకు వచ్చినాయి? నేనడిగింది చెప్పు మన సార్‌కు ఏడుగురు గన్‌మెన్‌లు ఎందుకు, మనం ఉన్నప్పుడు?" నాగు కాస్తా మొండిగా అడిగాడు.

"చెడ్డ చూడకు, చెడ్డ వినకు, చెడ్డ మాట్లాడకు", వీరన్న కొంటెగా నవ్వాడు.

"ఇదో వీరన్నా! మనం చూసేదేంది? వినేదేంది? మాట్లాడేదేంది? మన సార్‌ను చూసుకుంటున్నాం. మన సార్ చెప్పినట్లు వినుకుంటున్నాం. మన సార్ బాగోగులు మాట్లాడుకుంటున్నాం. ఇందులో చెడ్డ ఏముంది? నీ తలతిక్క మాటలుగానీ!" నాగు అసహనంతో సిగరెట్ ముట్టించాడు.

"మరి, నువ్వెందుకు ప్రత్యేకంగా ఇది అడిగినట్లు?" వీరన్న 'ఇది' అనే మాటను నొక్కి అడిగాడు.

"నేనా? నేనా?" నాగు బయటపడటానికి సందేహించాడు.

"నాకు తెలుసు, నువ్వు ఈ పొద్దు పేపర్లో చదివినావు - అవతల పార్టీ నాయకుడు పత్రికకు స్టేట్‌మెంట్ ఇచ్చి నాడని - బొజ్జారెడ్డికి ఇందరెందుకని? నిజమా కాదా?"

అంగీకరిస్తున్నట్లు నాగు తల ఆడించాడు. "అదిసరే..." అని కొన్నిక్షణాలు ఆగాడు.

వీరన్న మాటలమధ్యలో అడ్డుతగులుతూ సర్దుబాటుగా అన్నాడు:

"మనకు ఈ ఇంటిదగ్గిర డ్యూటీ ఉండవచ్చు. సార్ వెంబడి డ్యూటీ ఉండవచ్చు. మనమే 24 గంటలూ సార్ వెంబడే ఎట్లా ఉండగలుగుతాం చెప్పు? ఇదంతా ఎందుకు తంటా, మనకు?"

"నువ్వనేది నిజమే..." నాగు నసిగాడు.

"సార్ వెంబడి ఆ లక్ష్మిరెడ్డే ఎందుకుండాలె? ఆ కృష్ణయ్యే ఎందుకుండాల? ఇదేనా నీ మనసులో ఉండేది?" వీరన్న సూటిగా అడిగాడు.

నాగు బదులు పలకలేదు.

"చూడూ! లక్ష్మిరెడ్డి మన సార్ భార్యతరఫున చాలా దగ్గిర చుట్టం. కృష్ణయ్య మూడుతరాలుగా సార్ కుటుంబాన్నే నమ్ముకుంటూ వస్తున్న కుటుంబం. ఆ బోయవాళ్ళందరూ సార్ కుటుంబం ఎటువైపుంటే, అటువైపుంటూ వచ్చినారు. ఎక్కడ దూకమంటే అక్కడ దూకినారు. ఏం చేయమంటే అది చేసినారు. ఖూనీలు చేసినారు. ఖూనీ లయిపోయినారు. కోర్టుల చుట్టూ తిరిగినారు. ఇప్పుడూ చూపెట్టుకొని ఉన్నారు. ఇవన్నీ నువ్వు వినలేదంటావా? మిగతా ఇద్దరి సంగతి - వెంకటయ్య, జోసఫ్ - వాళ్ళూ మన మాదిరిగానే... ఏమీ మనసులో పెట్టుకోకు.

మనకెందుకొచ్చిన తంటా? ఈయన అడిగినాడు. ప్రభుత్వం మనల్ని పంపింది. ఏ డ్యూటీ చెయ్యమంటే, ఆ డ్యూటీ చెయ్యడమే మన పని..." వీరన్న మరేదో చెప్పబోయాడు. ఇద్దరు యువకులు కాంపౌండ్ లోపలినుంచి, బయటకు రావడంతో వాళ్ళ మాటలు ఆగిపోయాయి.

"వదిన ఇంట్లోకి రమ్మని పిలిచింది", ఒక యువకుడు వీరన్నకు చెప్పాడు. ఏం డ్యూటీనో అనుకుంటూ వీరన్న త్వరత్వరగా లంకంత ఇంట్లోకి వెళ్ళాడు.

నాగు స్వగతంలోకి జారుకున్నాడు:

'91లో బి.ఏ. పరీక్షకు కూర్చుంటే, మూడేళ్ళకు పాసయింది తెలుగు ఒక్కటే. అన్నీ పోయినాయి. మళ్ళా ఒక్క సంవత్సరానికి పైగా చదివి చస్తే...

సప్లిమెంటరీ పరీక్షలు కూడా ముంచినాయి. ఇంకేం పాసు? ఇంకేం బి.ఎ. డిగ్రీ? ఉద్యోగం లేదు, సద్యోగం లేదు. ఊళ్లో తన మాదిరి వాళ్లందరి మాటలు, చేతలు, తెలుగుదేశం, కాంగ్రెస్ రాజకీయాలు. చిన్నా చితకా గలాటాలు. ఏ గాలి ఎటువైపు వస్తాదో తెలియదు. ఏ మంట ఎప్పుడు రగులుతుందో అర్థంకాదు. ఏ కొంపకు ఎప్పుడు ఏది చుట్టుకుంటుందో తెలియదు. ఏ కుటుంబం ఎప్పుడారిపోతుందో అసలు తెలియదు. ఏది ఎందుకు ముంచుకొస్తుందో నెత్తిగొట్టుకున్నా ఏమీ అర్థంకాదు. అయోమయం అంకాళమ్మ తిర్నాల.

ఎవరి సంగతో ఎందుకు? స్వంత ఇంటి సంగతి...

ఒక ఊరి రెడ్డి మరొక ఊరికి పసల పోలిగాడు. నాయన ఊళ్ళోనే పసల పోలిగాడు. పేరుకే కాపోడు. పేరు వెనక తోక ఒకటి మాత్రం – రెడ్డి! పాతకాలం గొల్లోళ్ళకూ, మాలా మాదిగిండ్ల పిలుపులకూ మాత్రం రెడ్డి! అయితే మాత్రం?

నాయన అన్నదమ్ములు ముగ్గురు. చిన్నాయనలతో కలిపి నలుగురు. పంపకాలుబోతే పెద్ద దుప్పటి అంత భూమి పుట్టుగోచీ అంత అయింది. పది అంకణాల అబ్బల కాలంనాటి ఇల్లు పంచుకుంటే, జ్యేష్ఠ భాగం కింద నాయనకు నాలుగు అంకణాలు వచ్చింది. నాయన కనింది అయిదుగుర్ని. అక్కను ఒక తలమాసినోడికి కట్టబెట్టినారు. నలుగురన్నదమ్ములు పంచుకోవాలేగానీ ఒక్కొక్కరికి మూడెకరాల చిరిగిన గోచీముక్కలు దొరుకుతాయి. అందుకే భాగాలు పోడానికే భయపడినారు. ఇప్పుడున్న పరపతి కూడా పోతుందని అందరికీ తెలుసు. పరపతి అంటే అప్పులు తెచ్చుకోగలిగిన శక్తి! ఇల్లు పంచుకుంటే తలా ఒక్క అంకణం – గొడ్ల గాటిపాటంత కూడా రాదు. చదువెవరికీ అబ్బలేదు, తనకు తప్ప. అందరూ ఎప్పుడు పండుతుందో, ఎప్పుడు ఎండుతుందో తెలియని భూమి మీద, చేస్తూ పోతున్న అప్పుల మీద బతుకుతున్నారు. అది గండమో తెలియదు, పీర్ల గుండమో తెలియదు. అన్నలకు గంతకుదగిన బొంతలు దొరికినారు, చాకిరి బతుకులు!

ఏ దారీ ఏ దిక్కూ తెలియక ఉక్కిరి బిక్కిరవుతున్న ఆ రోజుల్లో, ఒకరోజు...

విధురా అశ్వత్థం వైపునుంచీ అమ్మవైపు బంధువు - తమ్ముడి వరస - ఉన్నట్టుండి దిగినాడు. తనకు మామ వరస. నాయనతో అదీ ఇదీ మాట్లాడినాడు. "నాగిరెడ్డిని నాతో పంపండి. ఇటు మీ పక్క ఒక మండలం అధ్యక్షుడు బొజ్జారెడ్డి మన బంధువే. మాకు దగ్గిరలే. బొజ్జారెడ్డిది అట్లాంటి ఇట్లాంటి పలుకుబడి గాదు. భూములున్నాయి. కంట్రాక్టులున్నాయి. ఇండ్ల స్థలాలున్నాయి. ఏవేవో ఉన్నాయిలే. వచ్చే ఎన్నికల్లో తప్పక ఎమ్మెల్యే అవుతాడు. నాగిరెడ్డి ఉద్యోగం పూచీ నాది" అన్నాడు. కరువు రోజుల్లో ఇంట్లో తిండికి ఒకడు తగ్గినా తగ్గినట్లే. నాయన కష్టాలు నాయనవి. ఒప్పుకున్నాడు. తానూ 'సరే' నన్నాడు.

'సార్' పరిచయం అట్లా మామ వల్ల దొరికింది. 'సార్'తో, 'సార్' బంధువుల కుటుంబాలతో రెండేళ్ళకు పైగా మొదట్లో బెరుకుగా ఉండేది. ఇబ్బంది అనిపించేది. భయం వెంటపడేది. ఇంటిదగ్గరకంటే మంచి భోజనం - హాస్టల్లో కంటే కూడా. ఖర్చులకు అంతో ఇంతో, జీతం లాగా డబ్బు చేతికిచ్చేవాళ్ళు. బయట ఇంతకంటే బాగా బతికే యోగం లేదు. ఈ జీవితం నెమ్మదిగా అలవాటయింది. ఏవో నాలుగైదు గలాటాల్లో మూడు నాలుగు సార్లు తాను బాంబులు వేసినాడు. సార్ వాళ్ళ బంధువులు ఎక్కడికి రమ్మంటే, ఎక్కడ ఏ ఊళ్ళో, ఏ టౌన్లో విసరమంటే అక్కడ... పేలినాయో లేదో చూడలేదు. నలుగురితోపాటు నారాయణ. నిండా మునిగినాక చలి ఏముంది? కేసుల్లో దొరకలేదు. నయం. తను పండ్లచెట్లను నరకలేదు. వాములు కాల్చేవాళ్ళూ, పంటను నాశనం చేసేవాళ్ళూ తన దృష్టిలో ఒకటే.

'బొజ్జారెడ్డి సార్' అట్లా ఎమ్మెల్యే అయినాడో లేదో, సంవత్సరం తిరగకుండానే కానిస్టేబుల్ సెలక్షన్ వచ్చింది. ట్రెయినింగ్ అయింది. అట్లా పూర్తి అయిందో లేదో తాను ఊళ్లో ఉన్నప్పుడు మామ వచ్చినాడు. నాయన గొంతు మీద కూర్చున్నాడు. "మా నాలుగో పిల్లను చేసుకోండి" అన్నాడు. "ఇద్దరు కొడుకులు, ఆరుమంది కూతుర్లున్నారు. పదైదు తులాల కంటే పెట్టలేను. పెళ్ళి చెయ్యిస్తాను" అని మామ అన్నాడు. "నాకు ముందే అనుమానం, నువ్వు మావాణ్ణి తీసుకపోయినప్పుడే" అన్నాడు నాయన. "చదువుకు పెట్టిన ఖర్చులన్నా రావద్దా?" అని అన్నల గొడవ. చిన్నన్న అననే అన్నాడు. "సన్నాసీ సన్నాసీ రాసుకుంటే బూడిద రాల్తుంది" అని. 'మన శివుడికి బూడిదే ఆస్తి' అని తెలుగు లెక్చరర్ చెప్పినాడు.

"మామ మనకింత సాయం చేసినాడు. మీరు నాకు భాగం పంచివ్వద్దులే!" అన్నాడు తాను. ఆ మామ నాలుగో పిల్లను తాను ముందు చూసినాడు. బాగుంటుంది. బాగా. అది నాయన, అన్నలకు తెలియదు. మొండికిబడి, భాగం తీసుకున్నా చెడ్డపేరు తప్ప మిగిలేదేముంది? పదైదు తులాలు మిగులుతాయి. కనీసం పెళ్ళాం మీద ఉండేవి. ఇచ్చేవాడుంటే చచ్చేవాడు లేచి వస్తాడు. దరిద్రుడికి దక్కిందే బొక్కుడు.

పెళ్ళి అయింది. పెళ్ళికి సార్ వచ్చినాడు.

తన గౌరవమూ, కుటుంబం పరపతీ పెరిగినాయి. అయిదారు నెలలు గడిచినాయో లేదో సార్ దగ్గర గన్‌మాన్‌గా పోస్టింగు. నమ్మకమైన గన్‌మాన్‌గా అభిమానం సంపాదించుకున్నాడు. చేతులు చాచకుండానే సార్ కోసం వచ్చిన వాళ్లు కాసులిస్తే, నాలుగు డబ్బులు కళ్ళ చూసినాడు. తన తిండి ఖర్చులు మామూలుగా బయటే. వీరన్న, రజాక్ కొద్దిరోజుల తర్వాత గన్‌మెన్‌లుగా చేరినారు. స్నేహితులు చేరడంతో సంతోషమైంది. ఎవరి కొంపల మీదికి ఏది రాలేదు - ఇంతవరకూ అదృష్టం!

ఈ లక్ష్మిరెడ్డి, క్రిష్టయ్య అదొక రకం. తామే 'సార్' కుటుంబానికీ, వాళ్ళ బంధువులకూ చాల దగ్గరైనట్టు మాటలూ, చేతలూ. వీరన్న చెప్పింది నిజం. వీరన్న తెలివిగలవాడు. ఎప్పుడన్నా కొంచెం తాగినా, అన్ని రాజకీయాల్నీ కలేసి తిడతాడు. ఎవర్ని ఎందుకు తిడుతున్నాడో తెలియకుండా తిడతాడు. ఏం బాధలు పడినాడో? తనకంటే ఎక్కువ పడినాడేమో - కులం తక్కువవల్ల? తనకు తెలియనివి వీరన్నకు చాలా తెలుసు. పూర్తిగా తెలుసు... తనకెందుకు తెలియదు? వీరన్నకంటే తనవి తక్కువబాధలు!

ఆ మధ్య ఒక రోజు రాత్రి సార్ చీనీ తోటలోని ఇంట్లో-ఫార్మ్ హవుస్ అంట! దాంట్లో విందు భోజనాలు. ఇప్పుడున్నన్ని గొడవలు లేవు. పెద్ద పెద్ద కంట్రాక్టుల్తో గొడవలు వచ్చినాయి. ఆ విందుకు ఎవరెవరో మండలాధ్యక్షులు, జడ్‌పి ఛైర్మన్, ఎమ్మెల్యేలు, బంధువులు - ఆరుగురో ఏడుగురో వచ్చినవాళ్ళు పీకలదాకా తాగినారు. కుతికలదాకా తిన్నారు. వాళ్ళను ఏగడం కూడా తమ పనే! సార్ తాగడు. స్నేహితులు తాగుతూంటే చూసి ఆనందపడతాడు. "సార్, మీరు తినండి" అన్నాడు తాను. "మీది కానివ్వండి. అందరిదీ అయిపోయింది. భోజనాలయ్యాక బయట జాగ్రత్త" అన్నాడు సార్. నలుగురి గన్‌మెన్‌ల భోజనాలయినాయి. ఇద్దరు బయట, ఇద్దరు లోపల కాపలా. లోపల ఇంకా కొంతమంది వేరే జనం. చీనీ చెట్ల ఆకుల సవ్వడి తప్ప, ఏ అలికిడీ లేదు.

తానూ, వీరన్న బయట కూర్చున్నారు. గన్నుల మీద చూపు తప్పదు. డ్యూటీ!

"ఏం డిన్నర్? వీరన్నా! అదిరిపోయింది" అన్నాడు తాను. వీరన్నకు మనసులో ఏముందో తెలియదు. కొంచెం మైకంలోని ఉల్లాసం ఉందేమో? ఎప్పుడూ ఏదీ నేరుగా బయటపడని మనిషి తటాలున అన్నాడు:

"అందరికీ అదిరిపోయింది. ఏం లాభం? మనం తిన్నాకనే మిగిలింది ఈ సార్ ఎంగిలి పడడం, ఎవరూ చూడకుండా. ఎంతుంటే ఏం సుఖం? ఇంకా ఇంకా కావాలని ఎంత వెంపర్లాడితే ఏం మిగులుతుంది? బూడిద! చుట్టూ కాపలాగా ఎందరుంటే ఏం లాభం? నేను నిన్ను చంపితే ఊరుకుంటారా నీవాళ్ళు? ఈ మధ్య వసంతసేన అని ఒక నాటకం చదివినాలే. నా పని ఆ నాటకంలోని విటుడులాగా వుంది."

"మన బాంబులు విసరండ్రా!"

"దొంగవేటు వేసినార్రా!"

"చంపినార్రా నా కొడుకులు!"

"అయ్యో... అమ్మో... నాయనా... నా పెండ్లాం, పిల్లలు.... అమ్మో... అబ్బో..."

కేకలు, అరపులు, పెడబొబ్బలు, ఉరుకులు, పరుగులు, గన్‌మెన్ కాల్పులు, బాంబుల దబ్బటవాన, కాల్పుల జడివాన. ఏం జరుగుతుందో తెలియని అయోమయం. అక్కడ తెగింపు ఒక్కటే నిజం. కోపం, భయం, పగ శత్రువుల్ని ఎదుర్కోవడం అంతే...

పదిహేను నిముషాల యుద్ధం. దెబ్బతీసినవాళ్లు అయిపులేరు.

శ్మశాన ప్రశాంతత.

దెబ్బతిన్నవాళ్ళపక్షం గజగజ వణికిపోతూంది.

బొజ్జారెడ్డి సెల్‌ఫోన్ నిమిషాల్లో సహాయం అందించలేని చోట బీభత్సం.

ఇది జరిగి పదిరోజులైనాగానీ, నాగు భీతి తగ్గిపోలేదు. నిద్రలో ఉన్నట్టుండి ఉలికిపడిపోతాడు. కేకలు వేస్తాడు. గజగజ వణికిపోతాడు. పలకరిస్తే మాట్లాడడు. వెర్రిచూపులు చూస్తాడు. భార్యది చెప్పుకోలేని దుఃఖం. రోజూ బంధువులు పలకరించిపోతున్నారు. నాగు మామ, కూతురుకూ, కూతురు పిల్లలకూ తోడుగా ఉన్నాడు.

ఊరి నుంచి వచ్చిన వీరన్నకు విషయాలన్నీ తెలిశాయి. నాగు ఇంటికి వచ్చాడు. రజాక్‌ను వెంటబెట్టుకొని, నాగు పక్కన కూర్చున్నారు.

"ఏమైంది నీకు, అంత ధైర్యంగా ఉండేవాడివి?" అని వీరన్న అడిగాడు.

నాగు నోరు విప్పలేదు.

"పాపం! లక్ష్మిరెడ్డి, కృష్ణయ్య చచ్చిపోయినారు. మన గన్‌మెన్, అన్యాయంగా... ఆ ఎం.ఏ.పిల్లోండ్లల్లో ఒకతనికి కాలుపోయింది. మరొకతనికి కళ్ళు పోయినాయి. ఇంకెంత దూరం పోతాయో ఇవి? ఎందరు చావాలో? ఎందుకు చావాలో? నువ్వూ, రజాక్, సార్‌ను ప్రాణాలకు తెగించి బతికించినారు కదా! హైదరాబాద్ చేరుకున్నాడు". వీరన్న మాటల్లో నాగుకు ఏవి తలకెక్కాయో, ఏవి తలకెక్కలేదో తెలియలేదు.

లక్ష్మిరెడ్డి, కృష్ణయ్య, ఆ ఎం.ఏ. పిల్లల చెల్లాచెదరైన మొండేలు, తలలు, కాళ్ళు, రక్తం, వాళ్ల వికృత రోదన, ఏవేవో ధ్వనులు నాగు కళ్లకు కనబడుతున్నాయి, చెవులకు వినబడుతున్నాయి. అవిగో ఎవరెవరివో మాటలు... మూడు కోతులు.

"నాకు ఈ ఉద్యోగం వద్దు. ఈ కొలువు వద్దు. ఈ దుంపనాశనం వద్దు." నాగు గొణుక్కుంటున్నాడు.

నాగు భార్య ఒక వైపు దిగాలుగా కూర్చొని వుంది. పాపం పుణ్యం తెలియని ఆడపిల్లలిద్దరూ అమ్మ దగ్గర కూర్చొని ఏమీ అర్థంకాక, కనుగుడ్లు అటూ ఇటూ తిప్పుతున్నారు, ఏదో తింటూ.

"ఒకమారు పెండ్లాం పిల్లల దిక్కుచూడు. వాళ్ల కర్మకాలి వాళ్లు చచ్చినారు. నువ్వు బతికినావు, నీ అదృష్టం బాగుండి. నువ్వెందుకు ఉద్యోగం మానాల? ఇంత జరిగి బొజ్జారెడ్డి తన పదవి మానుకుంటాడా, భయపడిపోయి?" నాగు మామ లోకరీతి ఓదార్పు మాటలు మాట్లాడాడు. వీరన్న తన లోలోపల రగులుతున్న మంటను నిగ్రహించుకోలేకపోయాడు:

"మమ్మల్ని వీళ్లకు అడ్డంపెట్టే వాళ్ళున్నంత వరకూ ఏ భయం?" అన్నాడు.

నాగు తన లోకంలోనే తానుంటూ, అదో రకం నవ్వు నవ్వాడు.

● *ఆంధ్రజ్యోతి, ఆదివారం 11-10-98.* ●

# మాయపొరలు

"అమ్మేయ్! ఎన్ని రోజులకే బట్టలెత్తేచ్చేది? రోజూ చలవ బట్టలు తెచ్చే కాలం పాయె. సరే, వారానికి మూడు సార్లు తెచ్చేది పాయె. పోనీ, వారం వారం అంటూ వచ్చేదీ పాయె. పదైదు రోజుల కాలం పాయె. ఇప్పుడు నెలనా?"

"ఏం చేస్తుము తల్లీ? నీకు తెల్దా? వంకలు ఎండిపాయె. కవిల బావులు మట్టిగొట్టుకొని పాయె. ఇంజన్లు పాయె. కాలవలోనన్నా ఉతుకుదామంటే, బోరింగులొచ్చె గదమ్మా! యాడ చస్తాం? ఎన్నిండ్ల మోదలో నీకు తెల్దా తల్లీ? రైతులిచ్చే మేరలూ పాయె. ఇనాములూ పాయె గదమ్మా."

"పోతే ఏం తెగులైంది? సెతుర్లు మాట్లాడతావు, ఏడో తరగతి చదివినానని. మీకు బడాశలే అమ్మేయ్?"

"ఏం బడాశ మాయమ్మా? నాలుగెకరాలేమన్నా కొన్నామా? ఆ ఆశే ఉంటే మా తమ్ముని మాదిరి టౌను చేరుకొని ఉండేవాళ్ళం. మా మరిది మాదిరిగా తాడిపర్తి సిమెంటు ఫ్యాక్టరీ పనికి పోయుండేవాళ్ళం. మా కులపోళ్ళలో కొంత మంది మాదిరి ఫ్యాక్టరీ ఆఫీసర్ల బట్టల్ని నమ్ముకునేవాళ్ళం. ముండమోసిన మా యత్తా, నేనూ రైతుల్ని విడిచి పెట్టలేదు గదమ్మా?"

"అది గాదే. మీరుండేదేమో ఇద్దరు. రెడ్డేరిండ్లూ కావాల, కమ్మోళ్ళ ఇండ్లూ కావాల."

"మాయ కాలమొచ్చి ఇట్లా మాట్లాడతా ఉండావు మల్లమ్మ తల్లీ! ఇప్పటికి మిగిలింది ఈ పల్లెలో అయిదిండ్లే. మన రెడ్డేరివి మూడు. కమ్మోళ్ళవి రెండూ. మూడు నాలుగు తరాల నుంచి చేస్తున్నవే. అయినా, ఒక్కమాట అడుగుతాను చెప్పు

తల్లీ? నువ్వు పెద్ద మనసున్నదానివి. రెడ్డోరి మైల గుడ్డలు వేరు. కమ్మోరి మైల గుడ్డలు వేరూనా? ఉతకడానికి మైలంతా ఒకటే గద తల్లీ మాకు. నిన్నమొన్న ఎన్టీరామారావు వచ్చేదాకా మీ రైతులందరూ ఒకటే గాదా? చంద్రబాబు నాయుడొచ్చినాక..."

"అమ్మేయ్! నీతో మాట్లాడడం నాదే తప్పు. నీ తెలివితో నేనెక్కడ ఏగుదు? మీ అత్త అందుకే నిన్ను పంపుతుంది. అవును, మైల గుడ్డలన్నీ ఒకటే అయితే మాదిగోళ్ళవి ఉతుకుతావా? చెప్పు?"

"మల్లమ్మ తల్లీ! ఏదో నీదగ్గర వాగుతుండా. ఆ గొడవల్లోకి దించొద్దు. నీకు పుణ్యముంటుంది. మనసులోది చెప్పాలంటే, బాపనోళ్ళ మడికి కులముంటుందేమోగానీ, ఎవరి మైల బట్టలకూ కులముండదు. మాపుడులో తేడా అంతే. కుళ్ళ మాపుడూ, మామూలు మాపుడూ. మైల పోగొట్టడానికి కొన్ని బట్టలకు సవుడు దండిగా పెట్టాలి. కొన్నిటికి తక్కువ పెట్టాలి. కొన్నిటిని బండ మీద ఇస్సో ఇస్సో మంటూ బాదాల. మాకు తెలిసిన చదువు అదే."

తల్లికీ, ఇంటి చాకలికీ మధ్య జరిగిన మాటలను బ్రహ్మం శ్రద్ధగా విన్నాడు. టెలివిజన్ కార్యక్రమాలను చూడడం ఆపివేశాడు. చాకలిని పేరుతో పిలవకపోవడం గమనించాడు. తాను చదవని విషయాలూ, స్కూల్లో చర్చించని సంగతులూ అవి అనుకున్నాడు. 'ఇస్సో ఇస్సో' నవ్వు తెప్పించింది.

మెచ్చుకోలుగా అన్నాడు: "రాములమ్మా! నువ్వు బాగా చెప్పినావు. మైలకు కులం లేదు. మనుషుల్ని ఉతికి మైల పోగొట్టి, చలవ చేసేట్లున్నావు!"

"అమ్మో మల్లమ్మ తల్లీ! చిన్రెడ్డి అంతా విన్నాడు. పెద్ద చదువు చదువుకున్నోడు. చిన్రెడ్డికి తెలిసినంత నాకేం తెలుస్తుందమ్మా?" రాములమ్మ నవ్వుతూ వినయంగా అంది.

తన కొడుకును మెచ్చుకున్నందుకు బ్రహ్మం తల్లి ఎంతో మురిసిపోయింది. "ఇంత సంగటి తినిపో" అంది. వంటింట్లోకి వెళ్ళి ఒక చిన్న సంగటి ముద్దనూ, ఇంత కూరనూ తెచ్చి తెళ్ళెలో పెట్టింది. మంచినీళ్ళ చెంబు తెచ్చి ఇచ్చింది. బ్రహ్మం తల్లి గుడ్డలు లెక్కపెట్టసాగింది. బ్రహ్మం పుస్తకం చదువుకుంటూ, మధ్య మధ్యలో గమనిస్తున్నాడు. రాములమ్మ తింటున్న ముద్దవైపు చూసి అనుకున్నాడు.

'ఇప్పుడు ఒకే ముద్ద. తిన్నంతా కాదు. ఇంటికి తీసుకుపోయ్యేదీ కాదు. అదీ ఈ ఇంట్లో. అబ్బ (నాన్న నాన్న) కట్టడి. ఒకప్పుడు తాను పసితనంలో రాములమ్మ అత్త తింటున్న అన్నం పెట్టమని గొడవ చేసేవాడు. తినేవాడు కూడా. తల్లి కసిరేది. నాయన తిట్టేవాడు. అబ్బ నవ్వుతూ సమర్థించేవాడు.'

"అమ్మేయ్! కోడలి చీరె ఒకటి తేలేదే – ఎర్ర గన్నేరు పువ్వు రంగుది" తల్లి అంది.

"రేపు మల్లా రావాలి. తెస్తాలేమ్మా. ఇన్ని మజ్జిగ పొయ్యి. ఎండలో నడిచి పోవాల" అంది రాములమ్మ మాట మార్చి. బ్రహ్మాం తల్లి గొణిగింది.

"ఆ ఒక్క ఎనుమూ ఇచ్చే పాలు మాకే చాలడంలేదు. మా మామ ఊళ్లో ఉంటే కాఫీలకూ, టీలకూ సరిపోతాయి, వచ్చే వాళ్ళకూ, పోయ్యేవాళ్ళకూ. సరేలే నీకు మజ్జిగ పోస్తానే మా ఆస్తులు తరిగిపోవు."

లోపలికి వెళ్ళి పల్చటి మజ్జిగ తెచ్చి రాములమ్మ తెళ్ళెలో పోసింది. రాములమ్మ తినడం పూర్తి చేసింది. తెళ్ళె కడిగి అరుగు మీద పెట్టి బ్రహ్మాన్ని అడిగింది:

"చిన్రెడ్డీ! మీ అబ్బ పెద్దరెడ్డి మా అసుమంటోళ్ళకు పక్క పల్లె కాడ కొండ కింద ఇండ్ల పట్టాలిప్పిస్తున్నాడంట! మా చిన్న చెల్లెలు ఆ పల్లెలోనే కదా ఉండేది. పట్టా ఇప్పించమని చెప్పు. నీ మాటంటే మీ అబ్బకు గురి. మీ అబ్బ మాదిరే నీది పెద్దమనసు."

ఖాళీ బిందెను చంకనేసుకొని, బోరు నీళ్ళకు వెళ్ళబోతున్న బ్రహ్మాం తల్లి ఇది వింది. పోతూపోతున్నది ఆగి అంది:

"ఓమ్మేయ్! చిన్రెడ్డి అబ్బ ఉండాడే, అదే మా మామ ఇండ్ల పట్టాలేంది, భూముల్ని కూడా ఇప్పిస్తాడు మీలాంటోళ్ళకు. పేరు రావాల. ఇంటి అతీ గతీ పట్టదు. ఇండ్లు దాటి మూడు రోజులైంది."

"మాటవరసకు అన్నాన్లే మల్లమ్మ తల్లీ. పెద్దరెడ్డి ధర్మాత్ముడు అమ్మా! ఇంటిపని చూసుకోడానికి మా రెడ్డి ఉండె. మీ పెద్ద కొడుకు చిన పెదరెడ్డి ఉండె," రాములమ్మ మాసిన బట్టల మోద తీసుకొని పోతూ పోతూ అంది.

బ్రహ్మాం తల్లి బిందెను ఒక కంబం వార ఉంచి దొడ్లోకి వెళ్ళింది, నడవలోకి వచ్చిన కోడిపిల్లల్ని తరుముతూ. బ్రహ్మాం మనసులో తన అబ్బ మెదిలాడు:

'ఆయన తీరే అంత. డెబ్బయ్ అయిదేళ్ళు కావస్తున్నా వాళ్ళపనీ, వీళ్ళపనీ అంటూ తిరుగుతూనే ఉంటాడు. స్వాతంత్ర్యం రాకముందు కొంతకాలం జాతీయవాది. కొంత కాలం కమ్యూనిస్టు. చీలికల రాద్ధాంతాల్లో, ఎన్నికల పొత్తుల వ్యూహాల్లో ఇమడలేక తనకు తోచింది తాను చేస్తూ పోతున్నాడు. పేదా సాదకు మంచి చేస్తున్నాడని పేరు పల్లెల్లో. ఇంట్లో ఖాళీగా ఉంటే తోటపనికి పోతాడు. తోట దగ్గరకు ఎవరో వెళ్ళడం, ఆయన అటునుంచే ఏ పల్లెకో, పేటకో పోవడం! జేజి (నానమ్మ) చనిపోయినాక ఆయన వ్యాపకం పూర్తిగా అదే అయింది. తన తండ్రికి అబ్బంటే గౌరవం. అన్నకు మాత్రం చులకన. కాంగ్రెసుకూ, తెలుగుదేశానికీ రెండింటికీ వ్యతిరేకమేనని, 'మనకంటే పేదోళ్ళు లేరా?' అంటూ ఏ గొడవల్ని తెచ్చి పెడతాడోనని. మనకు ఎవరు మేలు చేస్తే వాళ్ళవైపు ఉండాలనేది అన్న వాదం. ఆ మేలనేది ఎప్పుడైనా కావచ్చు. ఏదైనా కావచ్చు. ఎక్కడైనా కావచ్చు.'

తల్లి పిలుపుతో బ్రహ్మాం లోకంలోకి వచ్చాడు.

"అబ్బీ బ్రమ్మం! నీకు పని చెప్పాలంటే నోరు రాదు. నెలకొక్కసారి ఇంటికొస్తావు. ఊళ్ళో పలికే మనిషి లేదు. కానికాలం వచ్చింది. మీ నాయనకు తోట కాడ పని. మీ వదినకూ అక్కడ పని సరిపోతుంది. గడ్డో గాదమో, కలుపో గిలుపో, ఏదో ఒకటి. మీ నాయన బయటకి ఎక్కడన్నా పోతే మోటరు ఆడించి మడవగట్టేది కూడా-మీ వదినే. మీ అన్న ఏదో వ్యాపారం గీపారం అంటాడు. ఇంటిపట్టున ఉంటే ఒట్టు. ఈ పొద్దు మీ నాయన ఊళ్ళో లేడు. మీ వదిన తోట కాడుంది. మన ఇంటిని నమ్ముకున్న ఆ ముసలోడు ఉప్పరి కొండయ్య ఉండాడనుకో. నాలుగు బిందెలు కొట్టియ్యి అబీ!"

తల్లి ముఖంలోని అలసట, గుబులు చూసి బ్రహ్మానికి జాలివేసింది. ఎవరిమీదో తెలియని కోపం వచ్చింది. మౌనంగా, ఇంటికి నూరు గజాల దూరంలోని మంచినీళ్ళ బోరు వద్దకు తానూ ఒక బిందె తీసుకొని నడిచాడు.

ఆ ఇంట్లో మనుషులకూ, పశువులకూ, వచ్చీపోయే బంధువులకూ కనీసం యాభై బిందెలైనా నీళ్ళు కావాలి. ఒక్కొక్కప్పుడు అవి డెబ్బయ్యో, ఎనభైయ్యో, నూరో. జలశ్రమ! ఇరవై బిందెలు నీళ్ళు కొట్టి, తల్లితో పాటు తానూ తెచ్చిపోశాడు.

తల్లి అలసట తీర్చుకోడానికి, కాళ్ళు, ముఖం కడుక్కొని, చీర చెరుగుతో ముఖం తుడుచుకుంటూ ఒక కంబం దగ్గర కూచుంది. బ్రహ్మం టీవీ దగ్గర కూర్చున్నాడు. సందేహిస్తూనే బ్రహ్మంతో తల్లి అంది:

"అబ్బీ బ్రహ్మం! మీ వదినకూ, కొండయ్యకూ అన్నం ఇచ్చిరా. ఆ ఆడపిల్లలిద్దరున్నా ఇట్లాంటి సాయం చేసేవాళ్ళు. పాత పల్లెకు వెళ్ళి ఇంకా తిరిగి రాలేదు. వాళ్ళ అవ్వా, తాత ఎప్పుడు పంపుతారో? ఇప్పటికే చానా అలస్సెమయింది. నాకింకా ఇంట్లో తెమలనంత పని ఉంది. ఆఁ... కొండయ్యకు చెప్పు. సందేల తోటకాడున్న కట్టెపుల్లల్ని ఇంటికి పంపమను. మీ అన్న ఎక్కడుండేదీ ఆ ముసలోడికి తెలుసులే. ఎట్లాగో చెప్పి పంపుతాడు. మీ అన్న ఎవరితోనో ఒకరితో కట్టెలు పంపుతాడు. మనకా బండీలేదు. కాడెద్దులూ లేవు. ఏం చేస్తాం?"

తమ ఆరేడెకరాల తోట వ్యవసాయమూ బాడుగల మీద ఆధారపడి ఉందని బ్రహ్మానికి తెలియంది కాదు. మెట్ట పొలమూ, బండ్లూ బరకట్లూ, ఎద్దులూ, ఆఖరుకు మడకలూ, గొర్రులూ అమ్మి నాలుగైదేండ్లు అయిందని తెలుసు.

తల్లి ఇచ్చిన అన్నం గంపను ఎడమ అరచేతి మీద పెట్టుకొని భుజానికి మోపుగా, తోటకు బయలు దేరాడు. ఊరికి దూరంగా కిలోమీటరుకు పైగా నడిచి చేరుకోవలసిన తోట. బండ్ల బాటలో వెళ్తే రెండు కిలోమీటర్లు పైగా నడవాలి. బ్రహ్మం కాలిబాటలోనే బయలుదేరాడు. గుట్టకింద రాళ్ళూ రప్పల కాలిబాట. కాలిబాటకు అటూ ఇటూ ఎర్రనేలలు. కొన్ని తువ్వ నేలలు. ఒకటి రెండు తోటకట్టు పొలాలు తప్ప అన్నీ మెట్ట చేలు. పేరుకు మాత్రం పండీపండని ఎకరాలు ఎకరాల భూములు. ఒక దగ్గర కాలి బాట పక్క ఒక చేనిగట్టు వార కొందరు పిల్లలు ఎదురయ్యారు.

చంపిన ఒక తొండను తోక పట్టుకొని ఊపుతూ, సన్నగా చిన్న పీరు కఱ్ఱలాగా ఉండే ఏడెనిమిదేళ్ళ పిల్లవాడు పళ్ళు ఇకిలిస్తున్నాడు, మరో ఇద్దరు పిల్లవాళ్ళ మీదికి విసురుతున్నట్లు నటిస్తూ, ఆ ముగ్గురికి ఎదంగా ఉండే కాస్త నదురైన పదిపదకొండేళ్ళ వాడు తొండ విజయుడితో ఎకసక్కెంగా అన్నాడు:

"అబ్బబ్బ! చూడండ్రా వీణ్ణి! పెద్ద పోజు సినిమా హీరో మాదిరి. చంపి చంపి కుంటి తొండ బీకెను చంపినాడు, పెద్ద మొగోని మాదిరి. ఆ చంపిందీ ముసలి తొండబీకెను. అదిగదిగో! ఆ పారిపోతాందే ఆ వగిసి దాన్ని వెంటబడమను. ఒకే ఒక్క రాయి తీసుకొని, ఒకే ఒక్క ఏటుకు చంపమను తెలుస్తుంది వీని పస, దయిర్యం!"

పిల్లలకు బ్రహ్మం దగ్గరగా వచ్చి నిలిచాడు. చచ్చిన తొండను పట్టుకున్న పిల్లవాడు భయంతో దాన్ని కిందికి జారవిడిచాడు. తొండను బ్రహ్మం చూశాడు. తొండ మూతి నుజ్జునుజ్జు అయింది. ఎర్రటి రక్తం చారికలు తప్ప, మూతి ఆకారం స్పష్టంగా కనిపించలేదు. పొట్ట పగిలి ఉంది. బ్రహ్మానికి వెలపరం పుట్టింది. ఎక్కడో ఏ మూలో భయం కూడా వేసింది. తొండ విరూపం చూసి.

"ఇంతకంటే వేరే ఆటల్లేవేమర్రా?" అన్నాడు.

పిల్లలు మారు మాట్లాడలేదు. వెనక్కి పరుగెత్తారు. పిల్లలకు తన ముఖంలో తమ అయ్యవారు కనిపించి ఉండాలి. ఇంకా పెద్దల పట్ల అంతో ఇంతో గౌరవంతో కూడిన భయమైనా ఉండాలి అనుకున్నాడు బ్రహ్మం.

పిల్లల తొండల వేటలో బ్రహ్మం తన బాల్యాన్ని వెతుక్కున్నాడు.

'గుట్టకింది తుమ్మకుంటలో ఊపగడ్డి రిక్కల సాయంతో తాను చిన్న చిన్న ఎండ్రకాయల్ని పట్టేవాడు. పట్టి అటూ ఇటూ ఆడించి తిరిగి కుంట నీళ్ళలోకి వదిలివేసేవాడు. ఆ ఎండ్రకాయలు ముందరి కొండ్లూ, వెనక కాళ్ళూ నీళ్ళల్లో ఆడించి, ఆడిస్తూ నీళ్ళల్లోకి పోతోంటే అదొక ఆనందం. ముందుకూ, పక్కలకూ నడిచే వాటి నడక విచిత్రంగా ఉంటుంది. తన సావాసగాళ్ళు మాత్రం చిన్నచిన్న తొండల్ని తరిమి తరిమి చంపేవాళ్ళు. వాటిని తాడుకు గట్టి, కుంట రాతి గట్టుమీద కూర్చొని నీళ్ళలోకి వదిలేవాళ్ళు. ఎండ్రకాయలు ఆ ఎర – ఆ తొండల మాంసం – కోసం వచ్చేవి. కొండ్లతో పట్టేవి. వీళ్ళు నెమ్మదిగా తాడు లాగి గబుక్కున పట్టుకునేవాళ్ళు. పెద్ద వాటి కొండ్లను విరిచే వాళ్ళు. పొట్ట తీసి గుడ్లున్నాయో లేదో, పిల్లలున్నాయో లేదో చూసేవాళ్ళు. ఒకరిద్దరు పట్టిన వాటిని కాల్చి కరకరా నమిలి తినేవాళ్ళు. తనకు అది ఏదో బాగుండేది కాదు. ఈ పిల్లలు ఎండ్రకాయల కోసం తొండల్ని చంపడం లేదు. తుమ్మకుంటలో నీళ్ళు లేవు. మరెందుకు చంపుతున్నట్లు? మనిషి స్వతసిద్ధంగా హింసాజీవి ఏమో! అదేమిటి? భారతంలో పద్యం "హింస చేయనివాడు లేడిజ్జగంబున..." రాములమ్మది కుల హింస, అమ్మది ఇంటి హింస.

గోడ కంతలోంచి తోటలోకి వెళ్తూ, బ్రహ్మం తమ తోటనంతా కలయ చూశాడు. ఒక ఎకరాలో ఉల్లి, మరొక ఎకరాలో మిరప, మరో మూడు ఎకరాల్లో

పత్తి వేసి ఉన్నది చూశాడు. కయ్యలో ఉల్లిగడ్డలు బాగా ఊరలేదు. దాదాపు అన్నీ అక్కడో ఇక్కడో పదో పరక తప్ప. పత్రికల ఫోటోల్లో చూసిన ఇథియోపియాలో కరువు వాత పడిన పిల్లలున్నట్లు అనుకున్నాడు. మిరప ఏపుగా పెరిగింది. కాయ పట్టింది. పత్తి మొలకలు బెత్తెడెత్తున్నాయి. గాలికి ఊగుతూ, ఊరిస్తూ. వార్తల్లో చదివిన నిన్న మొన్న జరిగిన తెలంగాణ పత్తి రైతుల ఆత్మహత్యలు గుర్తుకొచ్చాయి. వికలపరిచే ఆ ఆలోచనల నుంచి తప్పించుకోడానికి బ్రహ్మం వదిన కోసం, కొండయ్య కోసం అటూ ఇటూ చూశాడు.

దోకి తెచ్చిన గడ్డిని బోరు బావి గట్టున ఖాళీ స్థలంలో వదిన కుప్పగా వేస్తోంది. కొండయ్య మిరప పాదులకు నీళ్ళు గడుతున్నాడు. దగ్గరకు వెళుతూనే వదిన నవ్వుతూ పలకరించింది, "నువ్వే అన్నం తెచ్చావా?" అంటూ. ముప్ఫయ్యేళ్ళ వదిన ముఖంలో అలసట, శ్రమ మూలంగా పైబడిన వయసూ స్పష్టంగా కనిపిస్తున్నాయి. 'అమాయక కష్టజీవి నవ్వు అది' అని బ్రహ్మం అనుకున్నాడు. అన్నం గంప కింద బెట్టి, "నువ్వు ముందు తిను వదినా, ఈలోగా కొండయ్య తాతను పిల్చుకొని వస్తా" అంటూ బ్రహ్మం మిరప తోట వైపు నడిచాడు.

మడవ తిప్పి కొండయ్య, బ్రహ్మాన్ని పలకరించాడు: "సెలవు కొచ్చినావా, చూసిపోదామని?"

"అవును తాతా. రేపు మల్లా పోవాల. నువ్వు అన్నం తినిరా. అంతలో నేను మడవ గడతా," అన్నాడు బ్రహ్మం నిండు మనసుతోనే.

"రెండు కయ్యలే ఉన్నాయి. నువ్వు పోయి మోటరు ఆపిరా. నీతో చెప్పాల్సింది ఉంది. తర్వాత తింటా" అన్నాడు కొండయ్య.

బ్రహ్మం మోటరు ఆపటానికి తిరిగి వచ్చాడు. వదిన అన్నం తింటోంది. బ్రహ్మం మోటరు ఆపాడు. వదిన చనువుగా నవ్వులాటగా అడిగింది:

"నీ పెళ్ళప్పుడప్పా?"

"కష్టపడడానికా వదినా? నిన్నులాగా కష్టపెట్టడానికా వదినా?" అని బ్రహ్మం అందామనుకున్నాడు. అనలేకపోయాడు.

"ఉద్యోగం దొరికింది గదప్పా!"

"విద్యావాలంటీరు ఉద్యోగం వదినా!"

"పద్దైదు నూర్లు వస్తుందటనే?"

"అది మాట వరసకేలే వదినా. చేతికొచ్చేది ఏడు నూర్లేలే."

"ఏందోనప్పా ఇదంతా. మా చిన్నాయన కూతురు టీచరుంది. కట్నం ఇచ్చుకోలేరు. చేసుకో. అప్పుడు ఇద్దరి సంపాదనలు. నా బిడ్డల్నిద్దర్నీ నీ దగ్గర విడుస్తాలే. ఆడపిల్లలు. బరువు కాదులే. ఇంటిపని అదీ చేసి చదువుకుంటారు. మీ చిన్నన్న పిల్లలు విజయవాడలో బాగా చదువుకుంటున్నారు. పెళ్ళి చేసుకో తొందరగా."

"చేసుకోవాలనుకుంటే నీ మాటే వింటాన్లే వదినా. కొండయ్య తాతను పిలుచుకొని వస్తా ఉండు" అంటూ బ్రహ్మం కదిలాడు. వదిన మనసులోని వ్యథ అర్థమైంది.

కొండయ్య చివరి కయ్యకు నీళ్ళు మళ్ళించి, కాలవలో చేతులు కడుక్కుంటున్నాడు. బ్రహ్మానికి దక్షిణం వైపు గట్టుమీదున్న నాలుగు పెద్ద తుమ్మచెట్లు ఎండిపోయి కనిపించాయి. వాటి మీద తాట పూర్తిగా ఒలిచేసినట్లుంది. తెల్లగా కనిపిస్తున్నాయి.

"అదేమిటి కొండయ్య తాతా! ఆ చెట్లు అట్లా ఉన్నాయి?" అని బ్రహ్మం అడిగాడు:

"అదా? బోరు పక్కన ఖాళీ జాగాలో తుమ్మకంప కట్టెలు చూల్లేదా?" కొండయ్య అడిగాడు.

"సరిగ్గా చూల్లేదులే, వదినతో ఏదో మాట్లాడతా. ఇంతకూ ఆ చెట్లకేమైంది.?"

"తోలు ఒలిసినారు అంటారే అది." కొండయ్య పరిహాసంగా అన్నాడు.

"ఎందుకు? ఎవరు?

"నీతో మాట్లాడాలన్నానే. ఇదీ ఒకటి. ఇది చెప్పేముందు ఇంకొకటి చెప్పాలి. ఈ పత్తి వెయ్యొద్దు నాయనా అంటి, మీ అన్నతో. పోయిన ఏడు పెద్ద కుసుమలు (పొద్దుతిరుగుడు విత్తనాలు) వెయ్యొద్దు అంటి. ఇప్పుడూ వినలేదు, అప్పుడూ వినలేదు. విత్తనాలు కల్తీ. మందులు కల్తీ. నీళ్ళ పారకం ఇబ్బంది. వద్దు నాయనా అంటి. ఆశ! లప్పలప్ప ఏదో ఒకేసారి వస్తుందని ఆశ. కూరగాయలూ అవీ వేసుకోమంటే ఆ చిల్లర పంటలు వద్దంటాడు. అది కమ్మోళ్ళ సేద్యమంటాడు. అందుకేలే ఏకంగా దొంగ సారాయి కూడా వండిస్తున్నాడు, మీ అబ్బకు తెలియకుండా. మీ నాయన ఎవర్నీ ఏమీ అనలేనోడు."

బ్రహ్మం ఆశ్చర్యపోయాడు, నమ్మలేనట్లు.

కొండయ్య మళ్ళీ ఎత్తుకున్నాడు: "నువ్వడిగినావే, ఆ చెట్లకేమైంది అని. నేను తోలు ఒలిసినారని తమాసకు అన్నానా? మన తోటలో తుమ్మ తాటంతా సారాయికి పనికొచ్చింది. రైతులు కష్టపడి పనిచేసి, తాము తిని ఒకరికింత పెట్టే కాలం పోయింది బ్రహ్మం! కొంపలు కూల్చి అయినా సరే, అడ్డదిడ్డంగానైనా సంపాయిస్తేనే మొగోడు, లేకుంటే సేతగానోడు."

కొండయ్య లోలోపలి బాధను బ్రహ్మం అర్థం చేసుకోడానికి ప్రయత్నించాడు. తానేమీ బదులు చెప్పలేడు. చెప్పలేకపోయాడు. అరకొర చదువు అనుభవానికి దూరం!

"మీ అబ్బను చూసినా, నిన్ను చూసినా కడుపు నిండుతుంది. మీ అబ్బతో ఈ సంగతి చెప్పలేను. నీతోనన్నా చెప్తామని చెప్పినా. మనసు కుదుటపడింది. పద!" కొండయ్య అన్నం గంప దగ్గరకు నడిచాడు.

బోరు బావిగట్టున ఒక మూలలో పేర్చిన తుమ్మ కట్టెల్ని బ్రహ్మం చూశాడు. ఒక్క కట్టెకు కూడా తాట లేదు. తెల్లతుమ్మ చెక్క సారాయి అని చెప్పుకునేవాళ్ళు. ఇప్పుడు చీకుతుమ్మ చెక్క సారాయి అన్నమాట. అమ్మ పొయ్యిలోకి కట్టెలు కావాలన్న సంగతిని కొండయ్యకు చెప్పి ఇంటి దారి పట్టాడు.

రెండు వారాలకో, నెలకో ఏ ఆదివారమో ఒకటి రెండు సెలవు లొస్తే స్వగ్రామానికి వచ్చే బ్రహ్మానికి ఈ ఆదివారం అనుభవాలు కొంత కుదుపు నిచ్చాయి. ఆలోచించడం కంటే జీవించడం నేర్చుకోవాలేమో అనుకున్నాడు. సోమవారం ఉదయానికి విద్యా స్వచ్ఛంద సేవక పదవీ నిర్వహణ బాధ్యతలు నిర్వర్తించడానికి యాభై మైళ్ళ దూరంలోని గ్రామం చేరుకున్నాడు. కొండలూ గుట్టలలోని ఊరు అది.

మరుసటి ఆదివారం. మండల కేంద్రంలోని ఉద్యోగ నిరుద్యోగ మిత్రులతో బ్రహ్మం ఆ ఆదివారం గడపాలనుకున్నాడు. ఆరో తరగతి నుంచి డిగ్రీ దాకా మంచి నేస్తుడు రాజు. అక్కడ రిపోర్టరు. బ్రహ్మాచారి గదిలోనే ఉన్నాడు. మరో ఇద్దరు రిపోర్టర్లు అక్కడున్నారు. వార్తలు రాయవలసిన కార్యక్రమాల హడావిడులు లేనట్లున్నాయి. కబుర్లలో పడ్డారు. పత్రికల కబుర్లు, అధికార్ల కబుర్లు, రాజకీయుల కబుర్లు, గ్రామ స్థాయి నుంచీ అంతర్జాతీయ స్థాయి దాకా మాటల్లో దొర్లిపోతున్నాయి. తాము పత్రికల్లో రాసిన వార్తలనూ, వార్తా కథనాలనూ ఒకరివి మరొకరు మెచ్చుకోవాలని తాపత్రయపడుతున్నారు. ఒక క్రమమంటూ లేని ఆ చర్చల మధ్యకు, ఇటీవల రాజు రాసిన సీమ ఫాక్షన్ రాజకీయాలు అనే వార్తాకథనం వచ్చి కూర్చుంది.

"మనిషి సాంఘిక జంతువు, రాజకీయ జంతువులనేవి కొంతే నిజం. అసలు నిజం! మనిషి క్రూరజంతువు. పరస్పర హరణోద్యోగం మనిషి సహజాతం. జనం హింస, జనం పేరుతో హింస రకరకాల పేర్లు మాత్రమే," ఒక రిపోర్టరు మిత్రుడు అనడంతో చర్చమంట రాజుకుంది.

"రాయలసీమ గ్రామాల్లోని ముఠాల కక్షల గురించి మాట్లాడుతున్నాం," అన్నాడు రాజు.

"ముఠాలు, ఫాక్షన్లు, ఫాక్షనిస్టులు, పాలెగాండ్లు అనే మాటలు కోస్తా జిల్లాల వాళ్ళు కల్పించిన మాటలు. గురజాలలో, నరసరావుపేటలో, విజయవాడ నడిబొడ్డులో, రామచంద్రపురంలో జరిగిన హింసల మాటేమిటి? సోడా బాటల్లు, సైకిల్ చైన్లు, బిచువాలకంటే, వేట కొడవళ్ళూ, ఈటెలు, బాంబులూ ఎక్కువేమిటి, తక్కువేమిటి? ఇప్పుడన్నీ ఒకటే. ఇప్పుడంతా ఒకటే. సర్వం హింసమయం," అన్నాడు మరో రిపోర్టరు మిత్రుడు.

"అది కాదు మిత్రమా! ఒకప్పుడు అనంతపురం ప్రశాంతంగా ఉండేది కదా? ఇప్పుడు కడప హింసా సంస్కృతి ప్రభావమేనంటున్నారు. మిగతా చోట్లకు పాకింది అంటున్నారు," అన్నాడు రాజు రెచ్చగొడుతూ.

మరో రిపోర్టరు మిత్రుడిది కడప జిల్లా.

మొదటి రిపోర్టరు మిత్రుడు రాజుతో అన్నాడు:

"మనది వట్టి పోలీసు లెక్కల తర్కం. నేననేది ప్రతి హింస, రాజ్యహింస, విప్లవ హింస, మానవ హక్కుల హింస అన్నీ మనిషి హింసకు సంకేతాలేనని. ఒకటి గంగా నదిలా పవిత్రమైంది కాదు. మరొకటి మురికి కాలువలా ఛండాలమైందీ కాదు, ఆఖరుకు నక్సలైట్ల హింస కూడా అంతే!"

"ఏందిరా నీ కాలజ్ఞానం", అన్నాడు రాజు.

"మారిన సంస్కారంతో పాటు హింస తగ్గుముఖం పట్టాల కదా? ఆటవిక ఉద్వేగాలు హింసకు మూలం అనుకుంటాను. అవి పరిణామంలో తగ్గుతూ పోవాలకదా?" బ్రహ్మం మిత్రుల చర్చలో తలదూర్చాడు.

"అంటే?" అన్నారు ముక్తకంఠంతో ముగ్గురు రిపోర్టర్లూ.

"నాకు సమాధానమేదో తెలుసునని కాదు. మనిషి మనిషిగా ఎదిగే కొద్దీ హింస తగ్గాల కదా?" బ్రహ్మం మిత్రుల ప్రతిస్పందన కోసం ఆగాడు.

మొదటి రిపోర్టరు ఇల్లు అదిరేలా నవ్వి నవ్వి, నవ్వును ఆపుకుంటూ అన్నాడు:

"మనిషి ఎదగడమా? ఆఫ్ఘనిస్తాన్ – తాలిబాన్లో ఎదిగాడు. కొసావోలో ఎదిగాడు! చైనాలో తియాన్మెన్ స్క్వేయిర్‌లో ఎదిగాడు! పాకిస్తాన్‌లో ఇంతెత్తున ఎదిగాడు! ఇండియాలో ఎక్కడ బడితే అక్కడ – ఢిల్లీలో, బీహార్‌లో, తమిళనాడులో, ఆంధ్రలో ఏమిటి? అన్నిచోట్లా ఎదిగి ఎదిగి కూలబడ్డాడు. అంతర్జాతీయ ఏకైక పోలీసు అమెరికా, ప్రజాస్వామ్య పరిరక్షణలో, విశ్వశాంతి పరిరక్షణలో మరీ ఎదిగిపోతున్నాడు. ఆత్మ సమర్థన చేసుకునే ఏ జాతి అయినా తనను తాను వంచించుకుంటుంది. ఇతరుల్ని వంచిస్తుంది. దానికి వర్తమానం ఉంటుంది. భవిష్యత్తు ఉండదు."

"ఒరేయ్, ఒరేయ్! వేమన్న లాగా శాశ్వత సత్యాలు చెప్పకురా. పోతులూరి వీరబ్రహ్మంలాగా భవిష్యత్తు పలకకురా", అన్నాడు రాజు నవ్వుతూ.

"శ్రీశ్రీ హింస, రిరింస అనే రెండు మాటలు వాడినాడు. మీకు గుర్తుందర్రా?" మొదటి రిపోర్టరు అడిగిన ప్రశ్నకు జవాబు రాజుకూ, రెండో రిపోర్టరుకూ తోచలేదు.

బ్రహ్మం అన్నాడు: "గుర్తుంది. రిరింస అనే మాటకే అర్థం స్ఫురించలేదు."

మొదటి రిపోర్టరు మళ్ళీ పసిపిల్లలు జడుసుకునే నవ్వు నవ్వాడు. నవ్వు ఆపకుండా "రి... రి... రిరిం... రిరింస... రిరింస ఒక హింస" అన్నాడు.

"వీడు చెయ్యబోయే కవిత్వ హింస ఎందుకుగానీ, మనం లైన్ అకౌంటు హింసను గురించి మాట్లాడుకుందాం." రాజు వాతావరణాన్ని తేలికపరిచే ఉద్దేశంలో అన్నాడు.

"ఇదేమిటి?" బ్రహ్మం ఆశ్చర్యంతో అడిగాడు.

వార్తల కొలతలను బట్టి పత్రికలిచ్చే ప్రతిఫలాన్ని గురించీ, ప్రతిఫలం కోసం సాగతీసి సాగతీసి రాసే వార్తల గురించీ రాజు చెప్పసాగాడు - నవ్వుల మధ్య, కథలు కథలుగా. ఇద్దరు రిపోర్టరు మిత్రులు పని ఉందంటూ వెళ్ళిపోయారు. రాజుతో కలిసి మధ్యాహ్నం వంట కబుర్లు, భోజనం, కబుర్లు, నిద్ర, టీ, కబుర్లు...

సాయంత్రం నాలుగు గంటల ప్రాంతంలో సొంత ఊరి నుంచి సుడిగాలిలా వచ్చిన దాయాదిని చూసి బ్రహ్మం ఆశ్చర్యపడిపోయాడు. ఆ కుర్రాడు వణికిపోతూ, ఏడుపు గొంతుతో, పొందికంటూ లేకుండా చెప్పాడు: "మన సిద్ధారెడ్డి అబ్బను పొద్దున తాడిపర్తి బస్టాండులో వేట కొడవళ్ళతో నరికి, బాంబులు వేసి ఘోరంగా చంపి పారిపోయినా"రని "తన కోసం తానుండే పల్లెకుపోయి ఇక్కడున్నాడని తెలుసుకొని వచ్చేసరికి ఇంతటయం అయిం"దని.

బ్రహ్మం నిశ్చేష్టుడయ్యాడు. రాజుకు బ్రహ్మన్ని ఎట్లా ఓదార్చాలో దిక్కు తెలియలేదు. వెంటనే చెయ్యవలసింది గుర్తుకొచ్చింది.

"నువ్వు రూమ్‌లోనే ఉండు. కమాలుద్దీన్ అని ఒక మిత్రుడున్నాడు. అతనికి మోటార్ సైకిలుంది. అడిగి తెస్తాను. మీ ఊరికి ముగ్గురం కలిసి వెళ్ళవచ్చు" అన్నాడు - హత్య జరిగినప్పుడు జరిగే గుర్తింపులూ, విచారణలూ, పంచనామాలూ, పోస్టుమార్టమ్‌లూ, పోలీసుల కేసు నమోదు తతంగాలూ - వీటికయ్యే వ్యవధిని గురించి ఆలోచిస్తూ. "ఊరికి పోవడమే మంచిది. అయినా, తాడిపర్తిలో మా పత్రిక రిపోర్టరుకు ఫోన్ చేసి ఎక్కడికి వెళ్ళాల్సిందీ నిర్ణయించుకుందాం" అంటూ రాజు బయటికి వెళ్ళాడు.

బ్రహ్మనికి ప్రతి క్షణానికీ ఆందోళన పెరుగుతూనే ఉంది. అది ఆందోళనో, దుఃఖంతో బరువెక్కిన మనసో, హత్యకు కారణాలను వెతికే ఉద్వేగమో, కుటుంబం ఏ కల్లోలంలో చిక్కుకుంటుందో అనే భయమో, ఏది ఏమో తెలియని స్థితో.

బ్రహ్మం, బ్రహ్మం కోసం వచ్చిన కుర్రాడూ మాటిమాటికీ తలుపు వైపు చూస్తూన్నారు. ఉలికి ఉలికిపడుతూ బయట శబ్దాలను వింటున్నారు. గంట గడిచింది. మోటార్ సైకిల్ శబ్దం తలుపుకు దగ్గరగా ఆగింది. ఆగడంతో బ్రహ్మం చివాలున లేచి నిలబడ్డాడు. "పోదామా?" అక్కడికి, ఎక్కడికి అనే ఆలోచన లేకుండా.

"మనం మీ ఊరు చేరుకునేసరికి, శవం మీ ఊరికి వస్తుంది. మా రిపోర్టరుతో మాట్లాడినా, పదపోదాం." రాజు వివరాలు చెప్పలేదు. బ్రహ్మం అడిగే స్థిమితంలో లేడు.

ఊరు లోపలికి ప్రవేశిస్తూనే బ్రహ్మం గుండె దడ హెచ్చింది. ఇంటి దగ్గర జనం గుంపులు గుంపులుగా. పల్లెల జనం. కొందరాడవాళ్ళు చంపినవాళ్ళ మీద శాపనార్థాలు పెడుతున్నారు. కొందరు మగవాళ్ళు చనిపోయిన సిద్ధారెడ్డి గుణగణాలను కీర్తిస్తున్నారు. బ్రహ్మం బంధువులైన యువకులు చంపింది ఎవరెవరో తెలిస్తే నరికి పోగులు పెట్టాలని బీరాలు పలుకుతున్నారు.

వీళ్ళందరి మధ్యా ఏ సిద్ధుడి ముఖంలాగానో కనిపించే సిద్ధారెడ్డి ముఖం. సైను గుడ్డతో కుట్టివేసి దుప్పటి కప్పిన్న శవం.

అబ్బ శవాన్ని చూసి బ్రహ్మం దుఃఖం పెల్లుబికింది. బోరుబోరున విలపించాడు. రాజు పొదివి పట్టుకున్నాడు. ఓదార్చలేని అశక్తత.

గుంపులోని ఒక పేదరాలు అంది: "ఒకర్ని అని ఎరగడు. యాభై యేండ్లలో ఒకరి మీద చెయ్యెత్తగా వినలేదు, ఇంట్లోవాళ్ళ మీద కూడా. నేను చూడలేదు. పేదాసాదాను అట్లా చూసినోడు లేడు. రాకాసోళ్ళు, ముసలాయన్ని పొట్టనబెట్టుకున్నారు."

మరెవరో అన్నారు: "ఈ పెద్దాయన పెదపెద్దోళ్లతో పెట్టుకున్నట్లుంది. లేకపోతే ఈయన జోలికి పొయ్యేవాండ్లెవరు? ఎప్పుడూ ఏ పార్టీల్లోనూ తలపెట్టినోడు కూడా కాదు."

"ఖర్మ! ఖర్మ!" అని ఎవరో గొణిగారు.

బ్రహ్మం తల్లి, వదిన తలలు చేతులతో కొట్టుకుంటూ ఏడుస్తున్నారు. చుట్టాల ఆడవాళ్ళు, బీదా బిక్కీ స్త్రీలూ వాళ్ళను ఓదార్చడానికి చేసే ప్రయత్నంలో తామూ ఏడుస్తున్నారు. అక్కడ సామూహిక వేదనా, సంఘ దుఃఖమూ కన్పిస్తున్నాయి.

సిద్ధారెడ్డి శవ ఖననం అయ్యిందాకా, ఊరు ఊరంతా పురుగుల వాతబడిన పత్తిపంట లాగుంది.

హంతకుల ఆచూకీ మాత్రం తెలియలేదు. పోలీసులు గాలిస్తూనే ఉన్నారు. దివసం మాత్రం జరిగిపోయింది. దివసం జరిగిపోయిన రాత్రీ, ఆ మరుసటి రోజూ చూడలేక విన్నవాటితో బ్రహ్మం మానసికంగా తలకిందులయ్యాడు.

దివసం జరిగిపోయిన రాత్రి ఇంటిబయట జాగా లేక, ఇంట్లో కరెంటు పోయి తాను దొడ్లో పడుకున్నాడు. అటుపక్కగా విజయవాడ నుంచి వచ్చిన రెండో అన్న, ఆయన భార్య ఒకే మంచంలో పడుకున్నారు, దోమతెర కట్టుకొని. తన పక్క మంచంలో పెద్దన్న బిడ్డలు ఆడపిల్లలిద్దరూ గాఢ నిద్రలో ఉన్నారు. కటిక చీకటి. ఏ అర్ధరాత్రో అపరాత్రో గుసగుసలు వినిపించాయి. నిద్ర రాక ఆలోచనలతో సతమతమవుతున్న బ్రాహ్మానికి వినిపించాయి.

"రాజీ కమ్మనే చెప్పాను. నువ్వు చెప్పినట్లు చెప్పాలే. ముసలాయన మహా బతికితే మరో నాలుగైదేండ్లు బతికేవాడు. మా నాన్న వెర్రిమాలోకం. మా అన్న ఇప్పుడిప్పుడే బతక నేర్చుకుంటున్నాడు. మా తమ్ముడికి మీ ప్రాంతంలోనే సంబంధాలు చూద్దాం. వీళ్ళు కుదుటపడితే మన మీద పడరు, ఇద్దరం ఉద్యోగులమని. ముందుముందు మనకే లాభం ఉండొచ్చు. చూద్దాం..." చిన్నన్న స్వరం పెద్దది. గుసగుసలైనా వినిపిస్తాయి.

చిన్నన్న మాటలకు బ్రహ్మానికి మతిపోయింది. చిన్న వదిన – విజయవాడ వదిన – మాటలు వినిపించలేదు. ఊఁ ఊఁలు తప్ప. ఒకే ఒక్క మాట – 'పాడు!' వినిపించింది.

"ఈ రోజన్నా వదిలేదు లేదా? కానీ, నువ్వు వినవు గదా?" అని.

బ్రహ్మం సిగ్గుతో, అవమానంతో చచ్చిపోయాడు. 'చావు వేరు. దుఃఖం వేరు. శరీరం ఆరాటపడే సుఖం వేరు. ఇదేమిటి' అని అనుకున్నాడు.

మరుసటి రోజు చాకలి రాములమ్మ దొడ్లో ఒంటరిగా కూర్చున్న తనతో ఎవరికీ వినబడకుండా చెప్పింది:

"చిన్రెడ్డి! మూడు లక్షలిచ్చి చంపించినారంట. మా చెల్లెలి ఊర్లో వాడొకడు, మా కులపోడు కూడా చంపినోళ్ళలో ఉన్నాడంట. పాపిష్టోళ్ళు..." ఆ తర్వాత వివరాలు ఎవరో రావడం వల్ల బ్రహ్మానికి రాములమ్మ ద్వారా అందలేదు.

ఏ నిజాలూ తెలియని స్థితిలో ఆ ఆదివారం ఆప్తమిత్రుడు రిపోర్టరు రాజు దగ్గరకు వెళ్ళి, నిస్సిగ్గుగా తాను విన్నవి చెప్పాడు.

"మా పత్రిక రిపోర్టరు కూడా చెప్పినాడు మొన్న కలిసి. అన్నీ నిజమే. మీ అబ్బ సిద్ధారెడ్డి పేదలకు ఇండ్ల పట్టాలకోసం పట్టుబట్టి క్వారీకీ, కంకరు మిషన్లు పెట్టడానికీ అడ్డం తగిలాడట. పెట్టాలనుకున్న వాళ్ళకు అది ఇరవై లక్షలకు పైగా నష్టం. సిమెంటు ఫ్యాక్టరీ కోసం కొంటున్న, చిన్న రైతుల, పేదల భూముల కొనుగోళ్ళ విషయంలో, వాళ్ళ దగ్గర చౌకగా బెదిరించి కొని, తిరిగి ఫ్యాక్టరీ యాజమాన్యానికే అమ్మాలనుకున్న వాళ్ళకు అడ్డం పడ్డాడంట. ఇంకా..."

"ఆయన వెనుక మనుషులెవరున్నారు?" బ్రహ్మం పీల గొంతుతో ఆత్రం పట్టలేక అడిగాడు.

"అప్పటికప్పటికి ఉన్నారు. ఆయన మహజర్లు, మొండితనం, ప్రభుత్వ పథకాల అమలు పరిధిలోనే అందుకున్న సూత్రం..."

"పత్రికలేమీ చెయ్యలేవా?"

"అంతో ఇంతో చేశాయి కాబట్టే మీ అన్నతో రాజీకొచ్చారు; మరో రెండు లక్షలిచ్చి; మీ అన్న సారా వ్యాపారానికి తలుపులు కొంత తెరుస్తామని చెప్పి..."

"మరి ఇండ్ల పట్టాలు?"

రాజు బదులు పలకలేదు. దిగులుగా కూర్చున్నాడు.

"ఇంతకూ కాంగ్రెసు వాళ్ళా? తెలుగుదేశం వాళ్ళా? రెడ్లా? కమ్మవాళ్ళా? కిరాయి మనుషులా? అసలు దీని వెనకున్న మనిషి ఎవరు?" బ్రహ్మం ఆవేశంగా ప్రశ్నించాడు.

"ఎవరు, ఎప్పుడు, ఎక్కడ, దేని కోసం, ఏ పార్టీలో, ఏ కులంలో ఉంటారో వాళ్ళను నువ్వూ, నేనూ తెలుసుకుంటూనే సరిపోతుందా? తెలుసుకుంటే ఏం జరుగుతుంది? ఊఁ ఏం జరుగుతుంది చెప్పు?" నిరావేశంగా నొక్కి నొక్కి అడిగిన రాజు ప్రశ్నలతో గ్రామ విద్యా వాలంటీరు బ్రహ్మం తపస్సులోకి వెళ్ళిపోయాడు.

ఏ తపస్సుకైనా ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక ఫలితం ఉండకపోదు.

● ఇండియాటుడే వార్షిక సాహిత్య సంచిక, 2000. ●

# కాంక్ష

'స్స్'... అంటూ రయ్యన గాలి చెవుల గూబల్లో మార్మోగుతోంది.

నేలమట్టమయిన కోట ఆనవాళ్ళు...

విస్తారమైన చిన్నా పెద్దా గట్ల నడుమ మెట్ట చేలు... గట్ల మీద రాళ్ళూరప్పలు కలిసిన మట్టిలోంచి తలెత్తిన పిచ్చిమొక్కలూ, పచ్చటి, ఎండిన తీగలూ గాలికి ఊగిపోతున్నాయి. గురివింద చెట్ల నుంచి, గురివింద గింజలు రాలిపడుతున్నాయి. కలబంద... నాగమల్లె పండ్లు మాగి, ఎర్రగా... నల్లేరు తీగెలు... సజ్జ చేలల్లో అక్కడక్కడ రాలి, ఉండిపోయిన వగుడాకులు ఎగిరెగిరి పైకి లేస్తూ కిందికి వాలిపోతున్నాయి - మళ్ళీ ఎగురుతూ, పైకిలేస్తూ, గిరికీలు కొడుతూ. చెనక్కాయ చాళ్లల్లో పూడుకుపోయిన కాయల్ని, ముట్టెల్తో నల్లజీవాలు పెళ్లగించి తింటున్నాయి. దొమ్మరకొండ మీదుగా వస్తున్న పక్షులు ఆకాశమార్గంలో గాలిలో దూసుకపోతున్నాయి.

కోట చేను. చేలో మర్లించిన గొర్లు 'బ్యా బ్యా' అంటూ గుంపుగా కదులుతున్నాయి. ఒకదాన్నొకటి రాసుకుంటూ, తోసుకుంటూ మంద ముందుకు నెమ్మదిగా పోతోంది. గొర్లు పెంటికలు పెడుతున్నాయి, ఉచ్చలు పోస్తున్నాయి- వేయబోయే పంట సత్తువ కోసం.

"వస్తా", విన్పించీ, సరిగా విన్పించని ఏదో శ్రుతి.

"నేనొస్తా", ఒకటిన్నర శ్రుతి. వెనక్కి తిరిగి చూస్తున్నాడు. ఏమీ లేదు. గాలి మాట. నవ్వుకుంటున్నాడు.

"ఒచ్చేస్తున్నా", రెండున్నర శ్రుతి. మళ్లీ తల తిప్పి వెనక్కి చూస్తున్నాడు. ఎవరూ లేరు. కొంచెం భయం.

"ఒచ్చేసేదా? చూడు..." ఆరో శ్రుతి పిలుపు.

ఒళ్లు జలదరింపు... జడుపు. వెనక్కి చూసే ధైర్యం లేదు.

వడివడిగా పరుగు నడక... పిరికి నడక...

"ఓయ్ అల్లుడా!" గాలి కలిసిన పిలుపు.

గుండె కొట్టుకుంటోంది...

"ఓయ్ అల్లుడా! ఆగోయ్ వస్తున్నా"

గుండె చిక్కబట్టుకొని, పక్కలకు చూస్తున్నాడు.

పందుల గంగిరెడ్డి, తన నల్లజీవాల్ని తోలుకుంటూ వస్తున్నాడు - ఆ పందుల మాదిరే నల్లగా, బలిసి, ధృఢంగా గుర్‌గుర్ గొంతుతో. కోట చేనుగట్టును ఆనుకొని పెరిగిన ముచ్చుమర్రి వైపు నుంచి వస్తున్నాడు.

"అమ్మయ్య!"

తను ఒగరుస్తున్నాడు.

"పిలుపులన్నీ పందుల మామవా?"

"మామా! నువ్వా"

"ఏందోయ్! ఆ పరిగెత్తినట్లు నడవడం - కుక్కలు తరిమితే నా పందులు పరిగెత్తినట్టు. ఓరి నాయాలా!"

పందులతో పోల్చినందుకు తనకు కోపం వస్తోంది. నిక్కర్లు తొడుక్కుంటేనేం తను తొమ్మిదో క్లాసు.

గుర్ గుర్ గుర్ అంటూ పందులు మోరలెత్తి తన వైపు చూస్తున్నాయి. పరాచికంగా తనంటున్నాడు: "ఈ పందుల భాషను మానతావా మానవా మామా?"

పందుల గంగిరెడ్డి అంటున్నాడు - పందుల వైపు మురిపెంగా చూస్తూ:

"నా జీవనం ఇవేనోయ్ అల్లుడా. నా మాటా, పలుకూ నల్లజీవాల్తే. తప్పా? ఎంగిలిపీసు సదుగుతున్నావు, నీకేం తెలుసు పందులంటే? వాటి మాంసం మెక్కడం తెలుసు- నేను కోసినప్పుడు, మీ నాయన ఇంటికి తెచ్చినప్పుడు."

నల్లజీవాల్ని అదిలిస్తూ, తోలుకుంటూ పందుల గంగిరెడ్డి ఊరి బాట వైపు కదులుతున్నాడు.

తను అడుగుతున్నాడు:

"మామా, మామా! నువ్వేమన్నా ఇంతకు ముందు పిల్చినావా?"

"పిల్చినా, పలికినావు, ఏం?"

"అదికాదు, 'వస్తా, నేవస్తున్నా, ఒచ్చేస్తున్నా, ఒచ్చేసేదా' అనేమన్నా..."

పందుల గంగిరెడ్డి పగలబడి నవ్వుతున్నాడు. పందిలాగా గుర్‌గుర్ అని నవ్వుతూ అంటున్నాడు:

"ఈ కతలన్ని నాకు తెల్దు. నేను పిల్చింది పిల్చినా, ఈ గాలిలో నీకు ఏమని యిన్పించిందో! గొర్లమంద ఉందే చూడోయ్... అడ... గొర్ల బయన్న ఉండాడు. నేనిప్పుడే పలకరించి వచ్చినాలే. ఆ ముసలోణ్ణి అడుగు. గొల్ల సుద్దులు తెలుసు. మాల సుద్దులు తెలుసు. తురక సుద్దులు తెలుసు. ఉండు. ఇంటికి పోతానే ఈ సుక్కపందిని కొయ్యాలె.... ఇల్లిల్లూ ఆరడరిచ్చింది... వస్తా... వస్తా."

గాలిలో దూసుకుంటూ పోయి, తాను కోట చేలో ఉన్నాడు.

గొర్ల మందకు కొంత దూరంగా, గొర్ల గూడు దగ్గర బయన్న తాత మోకాళ్ల మీద గొంతు కూర్చొని ఉన్నాడు. ఒక గొర్రె పిల్లను నిమురుతున్నాడు. తలెత్తి తనను అడుగుతున్నాడు:

"ఏంది మనవడా! అట్లా వగరుస్తూ వస్తుండావు - తోడేలు వెంటబడితే గొర్రెపిల్ల వణికిపోతూ పరుగులు తీసినట్లు."

గొర్రెలు బ్యా బ్యా బ్యా... అరుస్తున్నాయి. కొన్ని చీదుతున్నాయి.

తను బయన్న పక్కన కూర్చున్నాడు.

"బయన్నా తాతా! ఒకటి అడుగుతా చెప్తావా?"

నిమురుతున్న గొర్రెపిల్లను బయన్న తాత ముందుకు తోస్తున్నాడు. అది నెమ్మదిగా మంద వైపు గెంతుకుంటూ పోతోంది.

బయన్న తాత "ఉ" అంటున్నాడు.

"నువ్వెప్పుడన్నా ఈ చేలల్లో వెనక నుంచి ఏమన్నా మాటలు విన్నావా?"

"ఏ మనిషిన్నా పిల్చినప్పుడు..."

"అది కాదు తాతా! మనిషి కనపడకుండా మాట విన్నావా?"

"ఏ మాట?"

"వస్తా, నేనొస్తా, ఒచ్చేస్తున్నా, ఒచ్చేసేదా?"

బయన్న తాత ముసి ముసి నవ్వులు నవ్వుతున్నాడు, బోసి నోటితో...

"ఓర్నీ పాసుగులా! నీకేదో సుడి ఉంది... ఈ మాటలు విన్నామని చెప్పినోళ్లు మనూళ్లో ముగ్గురుండే వాళ్లు. చచ్చిపోయినారనుకో. వాళ్లల్లో మా ముత్తాత ఒకడు. మీ ముత్తాత ఒకడు. దొమ్మర నారాయు డొకడు. ఆ పాత కతంటావా? పింగళనామ సంవత్సరంలో కోటను ఏలినాడే ఆ పాలెగాడు - కోట నవాబుగాడు - పూడ్చి పెట్టిపోయిన నిధి పిలుపంట అది! నేను విన్లేదు. చూల్లేదు. ఎన్ని పగళ్లో, ఎన్ని రాత్రుల్లో చేలల్లో గొర్లు మర్లించినాం. గొర్ల బాసలు విన్నా... ఆ ధన పిశాచం బాస నాకేం ఎరుక? మీ చినతాత చిన వేమారెడ్డి విన్నాడని ఎవరో అన్నారు. ఆయప్ప చూపంతా నిధులెక్కడ దొరుకుతాయో అనే కదా! అయినా మనుమడా! ఆ బాస మగ బాసా? ఆడ బాసా?"

"మొన్న మనూళ్లో వేసిన నాటకంలో ఒకటిన్నర, రెండున్నర, ఆరు అని హార్మోనియం లక్ష్మిరెడ్డి అంటా ఉంటే పాడినారే... అదేందీ ఆ శ్రుతిలో..."

"సూడు... అది ఏ బాస అన్నాగానీ... ఎవరితోనూ అవొద్దు. అన్నావా? పనులు చెడగొట్టుకొని మనూళ్లో తిరిగేవాళ్లున్నారు. వెంపర్లాడుతూ. ఏ అఘాయిత్యమైనా చేస్తారు. బలీ గిలీ అంటూ. మర్చిపో... మర్చిపో... ఇంటికి పా... మన వెర్రి వేమన్న పద్దెం గుర్తుంచుకో.

"ఇంటిలోని ధనము ఇది నాది అనుచును
మంటిలోన దాచు మంకు జీవి
కొండబోడు, వెంట గుల్ల కాసును రాదు
విశ్వదాభిరామ వినుర వేమ"

- బయన్న తాత రాగం తీస్తున్నాడు.

చేలో రూపాయలు, రూపాయలు ఎక్కడబడితే అక్కడ. తను జేబుల్లో నింపుకుంటున్నాడు. స్కూల్లో బ్యాగులోని పుస్తకాలు పారేసి, ఆశగా బ్యాగు నింపుకుంటున్నాడు. ఎన్నెన్ని రూపాయలు... ఎక్కడంటే అక్కడ!...

పాము... అమ్మో సరసరా పాకుతూ వస్తోంది... పడగెత్తింది.

❀ ❀ ❀

"నారపరెడ్డి సార్! రాష్ట్రంలో మీకెంత పేరొచ్చిందో!" ఉపాధ్యాయ ఉద్యమం మీలాంటి వాళ్లుండడం వల్లే ముందుకు పోతోంది. మీది ఉడుం పట్టు" - ఎవరో అంటున్నారు. అభినందిస్తున్నారు.

అరే పేపరులో తన పేరు ఆదర్శ ఉపాధ్యాయుడుగా, నిజాయితీ ఉద్యమ శీలిగా...

తన ఫోటో...

తన ఉపన్యాసం కూడా...

నిరసనలు, నినాదాలు, ధర్నాలు, నిరాహారదీక్షలు - అన్నిట్లోనూ తాను.

పంచెకట్టులో, చేతులు పైకి మడత పెట్టిన తెల్లటి చొక్కాలో... కళ్ళద్దాలతో...

ఖాళీ టీచరు పోస్టులు భర్తీ చేయాలి.

అక్రమ బదిలీలు ఆపాలి...

విద్యాకమిటీలు పెద్ద బూటకం.

విద్యావాలంటీర్ల వెట్టిచాకిరి - ఒక నాటకం.

ఉపాధ్యాయ ఐక్యపోరాటం - వర్ధిల్లాలి.'

❀ ❀ ❀

నారపరెడ్డి నిన్న మొన్నటి దాకా భావిసమాజాన్ని గురించి కలలు కన్నాడు. బంధువు లందరూ అప్రయోజకుడనీ, తిరుగుబోతనీ బిరుదులిచ్చారు. మంచి టీచరని పేరొస్తే మాత్రం ఏం మిగిలిచ్చిచచ్చాడని తిట్టారు. ఆ బాణీ ఇటీవల మారుతూ వచ్చింది. ఏ వెన్నుపూసా విరక్కుండా, నారపరెడ్డి ఇద్దరమ్మాయిలకు పెళ్ళి చేశాడు. ఇద్దరు కొడుకులు ప్రయోజకులయ్యారు. 'నారపరెడ్డి ఏమైనా అదృష్టవంతుడు' అని బంధువులు కొత్త బిరుదు తగిలించారు.

ఈ నాలుగు పనుల్నీ చక్కబెట్టడంలో నారపరెడ్డి నిర్వాకం చాలా తక్కువే. స్వగ్రామంలోని పిత్రార్జితం పదెకరాలు అమ్మాడు. వచ్చిన రెండు లక్షల్లో తన ఉద్యమజీవితానికెంత ఖర్చయిందో పిల్లల పెంపకానికీ, చదువులకూ ఎంత ఖర్చయిందో నారపరెడ్డి కంటే నారపరెడ్డి భార్యకే బాగా తెలుసు. తన చదువును తలిదండ్రులు పదో క్లాసులో ఆపినప్పుడు ఆమె ఆ వయసులో ఎంతో బాధ పడింది. చదువంటే ఉండే గౌరవం వల్ల, పట్టుదలగా, ఓర్పుగా, నేర్పుగా తన పిల్లలు ఆడా మగా తేడా లేకుండా చదువుల్లో రాణించేట్లు కృషి చేసింది.

పెద్దమ్మాయి ఎం.ఎస్‌సి., గణితం చేసింది. మరో గణితం, ఎం.ఎస్‌సి.ని పెళ్ళి చేసుకుంది. కట్నగణనాల్లేవు. రెండో అబ్బాయి బి.టెక్ మెకానికల్ చేశాడు. నానా తంటాలుపడి కంప్యూటరు కోర్సులు పూర్తి చేశాడు. అమెరికాలోని సమాచార సాంకేతిక పరిశ్రమ పిలుపుతో అమెరికా చేరుకున్నాడు - హెచ్1బి మీద, 60Kతో మూడో అమ్మాయి గ్రూప్ ఒక సర్వీసులో సిటిఓగా సెలక్ట్ అయింది. ట్రయినింగులో చేరిందో లేదో, మరో గ్రూప్ ఒన్ ఆర్‌డిఓ జాతివాదు పెట్టు పోతలు ఆశించకుండా పెళ్ళి చేసుకున్నాడు. నాలుగో అబ్బాయి ఎం.ఎస్‌సి., మైక్రోబయాలజీ చేసి ఒక పెద్ద ఫార్మాస్యూటికల్ కంపెనీలో ఇటీవల ఉద్యోగంలో చేరాడు. ఇందువల్లనే నారపరెడ్డిని బంధువులందరూ అదృష్టవంతుడని పొగడడం. ఆ పొగడ్డం కూడా నారపరెడ్డి భార్య ఎదురుగ్గా పొగిడేవాళ్లు-ఆమె పాతివ్రత్యం సంతోషిస్తుందని. ఆమె నవ్వి ఊరుకునేది.

మగపిల్లలిద్దరూ తమ పెళ్ళి సమస్యల్ని తామే పరిష్కరించుకున్నప్పుడు నారపరెడ్డి గంభీరంగా ఉన్నాడు. భార్య మాత్రం ముభావంగా ఉండిపోయింది. అమెరికా కొడుకుతో చిక్కులేకపోయింది. సహఉద్యోగి గుడివాడ అమ్మాయిని చేసుకున్నాడు - కుల తూకం సరిచూసుకొని. ఆ దంపతులెట్లాగూ తరచుగా రారు. ఇండియా కొడుకుతోనే నారపరెడ్డి చీకాకుపడ్డాడు. కొంత క్షోభకు గురి అయ్యాడు. ఇండియా కొడుకు పెళ్ళాడిన అమ్మాయి కులమింటి కోతే. అయినా పసిడిగల వాని కూతురు. చాలా సహజంగా రాకపోకలు రద్దయ్యాయి.

నారపరెడ్డి అహానికి తగలరాని దెబ్బే తగిలింది. ఉపాధ్యాయ ఉద్యమంలో తన పేరు, వియ్యంకుడి కలిమి ముందు కొరగాకుండా పోయింది. రాత్రి సమయాల్లో వచ్చే ఒకేరకం కలల కలత వల్ల నిద్ర కూడా సరిగా పోయేవాడు కాదు. నలుగురికీ పనికి వచ్చే ఏదో మంచి చేయాలనే ఉత్సాహం నీరుగారి పోయింది. సదసత్సంశయంలో కూరుకపోయాడు.

ఆ మధ్య ఒక రోజు యూనియన్ సహచరుడూ, చిరకాలమిత్రుడూ రామారావు ఇంటికి వచ్చాడు. ఆ రాత్రి పడుకునే ముందు ఆత్మవిచార ప్రసంగం చేశాడు:

"చూడోయ్ నారపా! నేనిటీవల ఒక నిర్ణయానికి వచ్చేశా. ఎన్నాళ్ళని ఈ కంచి గరుడసేవ? ఈ కప్పల తక్కెడ యూనియన్ రాజకీయాలు? మీ చెల్లెలు అదే నా భార్య వైపు బంధువు ఒకరు హైదరాబాద్‌లో పెద్ద రియల్ ఎస్టేట్ వ్యాపారి. కరోర్‌పతి. మామూలుగా కాదు కొన్ని కోట్లకు మగడు. మనం కూడా అలాంటి

వాళ్ళను పట్టుకొని ఏదో చేసుకోవాలి. ఈ రోజుల్లో మన పిల్లలు మన పిల్లలు కారు. మనమై మనం ఇంకాస్త సుఖంగా బతకడం కోసం న్యాయమైన పనులే చేద్దాం. ఇళ్ళ స్థలాల మీద మనం పెట్టుబడి పెడతాం. అది పెరుగుతుంది. మా బావమరిది హైటెక్ సిటీ చుట్టుపక్కల ఎక్కడో ఎప్పుడో రెండు లక్షలు పెట్టి స్థలం కొన్నాడు. ఇప్పుడది అరవై లక్షలు పైగా పలుకుతోంది. మా రేపల్లెలో మిగిలిన ఆ ఒక్క ఎకరా భూమీ అమ్ముతున్నాను - హైదరాబాద్‌లో స్థలం కొనాలని... వీలుంటే కలిసి చేద్దాం... ఏ పనైనా..."

నారపరెడ్డి సావధానంగా విన్నాడు. నారపరెడ్డి మీద రామారావు ఆత్మ విచార ప్రసంగ ప్రభావం మరుసటి నెలలో కనిపించింది. ఈ మధ్యకాలంలో నారపరెడ్డి కళ్ళ ముందు లక్షలు మయూర నృత్యం చేశాయి. ఊళ్లో మిగిలిన అరెకరాల భూమినీ అమ్మాలని తీర్మానించుకున్నాడు. మాటవరుసకన్నట్లు భార్యతో ప్రస్తావించాడు - "అమ్మమంటావా?" అనే ఒకే ఒక్క ప్రశ్నతో.

"మనకిప్పుడేం తక్కువ?" అంది ఆ ఇల్లాలు.

"మన చిన్నోడి అత్తామామలకు అంత పొగరుంది కదా - డబ్బూ దస్కం ఉందని, మోసేటంత బంగారముందని, పెద్ద ఇల్లుందని, కారుందని?..."

"ఉంటే?"

"చిన్నచూపు చూస్తున్నారు"

"ఎవర్ని గురించైనా, ఇన్నేళ్ళ కాపురంలో ఎప్పుడూ ఇట్లా అనలేదే!"

నారపరెడ్డి తడబడ్డాడు. తన సంస్కారానికి చిల్లి పడిందని మాత్రం గ్రహించాడు. అయినా నిశ్చయాన్ని మార్చుకోలేదు. ఊరికి వెళ్లాడు. చిన్నబ్బ చినవేమారెడ్డి చిన్న కొడుకు తనే కొంటానన్నాడు. నారపరెడ్డి తన దాయాదికి అమ్మి, పూర్వీకుల ఆస్తితో తెగతెంపులు చేసుకున్నాడు.

ఇళ్ళ స్థలాల మీద నారపరెడ్డి పెట్టుబడి పెట్టడం మొదలైంది. హైదరాబాదులో చౌకలో రెండు స్థలాలు. కదిరిలో ఒకటి, అనంతపురంలో ఒకటి... కొనుగోళ్ళు, అమ్మకాలు, కొనుగోళ్ళు, అమ్మకాలు మొదట్లో ఆత్మవిచార మిత్రుడి సలహాలూ, సంప్రదింపులతో జరిగాయి. కాసులు చేరాయి. ఫైనాన్స్ కంపెనీలో పెట్టుబడి మొదలైంది. అనుభవం పుట్టింది.

భూకబ్జాల, బినామీల, ఆకట్టుకొన్ని, పని జరుపుకోడాల, అధికారం బ్రోకర్ల ప్రపంచంతో సంబంధాలు గట్టిపడ్డాయి. మందు తాగిన మైకంలో నారపరెడ్డి అంతరాత్మ అప్పుడప్పుడూ బుడి బుడి ఏడ్పులు ఏడ్చింది. లోకన్యాయం అంటూ దాన్ని జోకొట్టాడు. కారు కొన్నాడు. జూనియర్ కాలేజికి పర్మిషన్ తెచ్చుకున్నాడు. చిన్న కొడుకు అత్తామామలూ, వాళ్ళ వైపు బంధువులూ ఎందుకైనా మంచిదని నారపరెడ్డిని పూసుకుని తిరగసాగారు. చిన్నల్లుడు 'సంపద ఇట్లా పెంచుకుంటే మంచిది'ని సలహాలిస్తూ, మామకు బాసటగా నిలిచాడు. బంధువుల రాకపోకలూ, పొగడ్తలూ సరే సరి.

ఒకప్పటి నిజసహచరులు మాత్రం దూరంగా ఉండిపోయారు. ఇంకా దూరంగా జరిగారు. భర్త ప్రపంచంలోకి ఏనాడూ కూడా పూర్తిగా మనసు పెట్టి తొంగిచూడని నారపరెడ్డి భార్య, కన్నపిల్లల మమకారాల్లో వచ్చిన మార్పుల్ని – కొత్త కొత్త రకాల వాటిని – చూసి భరించలేకపోయింది. అపేక్షలు లేని ఆస్తుల డొల్లతనం అనుకుంది.

ఊరి వార్త నారపరెడ్డిని ఉక్కిరిబిక్కిరి చేసింది. హైదరాబాద్‌లో లావాదేవీల్లో ఉన్నప్పుడు ప్రముఖ పత్రికలో వచ్చిన వార్త చూసి ముందు ఏదో చేజారిపోయినట్లు గింజుకున్నాడు.

మూడు కాలాల్లో ప్రముఖంగా బాక్సు కట్టి రెండో పేజీలో ప్రచురించిన ఆ వార్తను హెడింగ్, లీడ్, డేట్‌లైన్‌లతో సహా నారపరెడ్డి మళ్ళీ మళ్ళీ చదివాడు:

## నవాబు నిధి కోసం నరుకుడు
## పరారీలో పాలెగాడు

*నవాబుకోట, మే 7 : పవిత్ర బుద్ధ జయంతి. అహింసను హింస జయించింది. పట్టపగలు ఉదయం పొద ఎండ. దక్షిణానిలం మంద్రంగా వీస్తోంది. కోట చేనుగట్టు దగ్గరి ముచ్చుమర్రి. కింద గొర్ల బయన్న. మనుమడు మేకల గంగన్న చద్దిమూట విప్పుతున్నాడు.*

*స్థానిక వదంతుల ప్రకారం మేకల గంగన్న అశరీరవాణి వాక్కులు విన్నాడు 'వస్తా, నేనొస్తా, ఒచ్చేస్తున్నా, ఒచ్చేసేదా?' 'అని. ఆయన భయంతో వణికిపోయాడు. జిల్లా ఉపాధ్యాయ ఉద్యమనేత నారపరెడ్డి తన జ్ఞాతికి అమ్మిన పొలంలోకి పరుగులు తీశాడు. తన పొలంలోకి ఎరువు బండితో నారపరెడ్డి జ్ఞాతి బాలవేమారెడ్డి వచ్చాడు. నొగలు పైకెత్తి ఎరువంతా కుప్పపోశాడు. నొగలు దించి ఎద్దులకు పట్టెడలు బిగించాడు. బాలవేమారెడ్డికి మేకల గంగన్న జరిగింది చెప్పాడు. 'నాకింకా విన్పిస్తాంది. నీకు విన్పించలేదా?' అని గజగజలాడిపోతూ బాలవేమారెడ్డిని అడిగాడు. తనకేమీ విన్పించలేదని చెప్పాడు. బాలవేమారెడ్డికి వారసత్వంగా విన్నది స్ఫురణకి వచ్చింది. మేకల గంగన్న చెవిలో రహస్యంగా మంత్రం వేశాడు. మేకల గంగన్న "రావద్దు పో" అని అరిచాడు. అంతే... క్షణాల్లో భూమి చీల్చుకొని నిధి బయటకు వచ్చింది. మేకల బయన్నకు కళ్లు బైర్లుకమ్మాయి. బాలవేమారెడ్డికి కళ్ళు విచ్చుకున్నాయి. అంతే... బాలవేమారెడ్డి ఎరువు జల్లలో నుంచీ వేట కొడవలి తీశాడు. గంగన్నను ఒక్క వేటుతో నరికాడు. నిధిని బండిలో వేసుకున్నాడు. లక్షలకు లక్షలు వెండి, బంగారం ఉండవచ్చునని కథనం. ఒక ప్రత్యక్ష సాక్షి బాలవేమారెడ్డి బంధువు పందుల గంగిరెడ్డి దూరం నుంచీ చూసినట్లు చెబుతున్నారు. పందుల గంగిరెడ్డి చింతామణికి వెళ్ళిపోవడం వల్ల వివరాలు తెలియడం లేదు.*

*హత్య జరిగి, పంచనామా జరిగి, శవ ఖననం చేసిన తర్వాత కొన్ని గంటలకు పోలీసులకు సమాచారం అందింది. రంగంలో పోలీసులు ప్రవేశించారు. నిధి దొరకలేదు. అరెస్టు జరగలేదు. హత్య జరిగిన రోజు బాలవేమారెడ్డి అనంతపురంలో స్థానిక అధికారపక్ష నాయకుడి ఇంట్లో వున్నట్లు పోలీసుల కథనం.*

*ఇటువంటి ఉదంతాలు ఈ ప్రాంతంలో ఎన్నో వార్తలకు ఎక్కినా, పురాతత్త్వశాఖ ఇంతకాలం పట్టించుకోలేదు. నిధుల కొరత కారణంగా తవ్వకాలు చేపట్టలేమని పురాతత్త్వశాఖ అధికారి ఒకరు తమ అశక్తతను వెలిబుచ్చారు.*

- వార్తలో తన ప్రస్తావన వచ్చినందుకు సంతోషించాలో, బాధపడాలో నారపరెడ్డికి దిక్కుతోచలేదు. వార్త నిజమై ఉండవచ్చు. దాయాది బాలవేమారెడ్డి తన సాయం కోసం వెంపర్లాడకపోడు. హైదరాబాద్‌లో నలుగురైదుగురు ముఖ్యులు గుచ్చి గుచ్చి అడిగినప్పుడు నారపరెడ్డి మనసు చెదిరిపోయింది. ఆ రాత్రి మోతాదుకు మించి తాగి కలత నిద్రలోకి జారుకున్నాడు.

ఏ అపరాత్రో...

...

'ఒకటో అడుగు, రెండో అడుగు, మూడు అడుగు, నాలుగు... అయిదు...

తప్పెట్లు లయాత్మకంగా ధ్వనిస్తున్నాయి.

కొమ్ము ఊదుదు...

బలిసిన కురబ పొట్టేలు...

ఎవరో పట్టుకున్న నెమలి ఫించం కట్ట...

గుర్రం మీప ఎక్కి ఖడ్గం తిప్పుతూ, తప్పెట లయకు అనుగుణంగా కదనుదొక్కిస్తున్న బాల వేమారెడ్డి...

పసుపు తలపాగా చుట్టి, పసుపు బట్టల్లో...

కోట చేను...

ముచ్చుమర్రి...

వడిగాలి...

తన చిన్ననాటి సావాసగాడు, - తన కిష్టమైన కథల తాత గొర్ల బయన్న మనుమడు - మేకల గంగన్న గొంతు తెగి పడింది. తెగి పడిన గొంతు తలాడిస్తూ అరిచింది:

"వీణ్ణి ఏం చేయాలప్పా?"

"చట్టం, న్యాయం, సంస్కారం ఏమీ చెయ్యలేనప్పుడు నువ్వేం చేస్తావు?" అని తాను అంటున్నాడు.

"నరుకుతా"

"అందరూ నరికేవాళ్లే... వేమారెడ్లు... నక్సలైట్లు... పోలీసులు... ఒకర్నొకరు నరుక్కోండి, సరిపోతుంది" - తాను అరుస్తున్నాడు.

"నువ్వూ నరికేవాళ్ళవైపేలే," మేకల గంగన్న నోరు మూగపోయింది.

గొర్ల బయన్న కమ్మగా పద్యం పాడుతున్నాడు.

"ఆశ చేత మనుజు లాయువుగలనాళ్లు
తిరుగు చుంద్రు భ్రమలు తిప్పలేక
మురికి భాండమందు ముసరు ఈగల వలె
విశ్వదాభిరామ వినుర వేమ!"

శ్రుతి మారూతూ పోతోంది.

ఏదో మాట, ఏవో మాటలు, ఏవేవో తెగిన కంఠాల ధ్వనులు...

"వస్తా"

"నేనొస్తా"

"ఒచ్చేసేదా?"

"వద్దు... వద్దు... రావద్దు తండ్రీ, రావద్దు తల్లీ", నారపరెడ్డి ఆ రాత్రి పూర్తిగా మత్తు వదలని కలత నిద్రలో కలవరిస్తూనే...

హోటల్ మెత్తటి పరుపు మీద కుడి ఎడమల పొర్లుతూ...

● రచన, జూలై 2001

- కథామహల్, 2002. ●

# రెండు ప్రపంచాల మధ్య

"అత్తమ్మకు ఫైర్ వర్క్స్ చూపిద్దాం శ్రీ", అంగీకారంకోసం భర్త వైపు చూసి, అత్త వైపు చూస్తూ శైలజ అంది.

కొడుకు శ్రీధర్‌ను కోడలు 'శ్రీ' అని పిలవటం కొన్ని గంటల్లోనే కాంతమ్మకు అలవాటయింది. ముచ్చటేసింది.

"ఏమిటమ్మా అది?" అని అడిగింది.

"మన పక్క టపాసులు కాల్చడం అంటారే అదమ్మా. చాలా బాగుంటుంది. చూడాల్సిందే. ఈరోజు శనివారం కూడా. జనం గుంపులు గుంపులుగా వస్తారు చూడడానికి. బాగా సందడిగా ఉంటుంది. సరదాగా ఉంటుంది", తల్లికి శ్రీధర్ ఆమెకు అర్థమయ్యే భాషలో చెప్పాడు.

"ఎవరింట్లో వాళ్ళు కాల్చుకోరా? అందరూ ఒక్కచోటనా?" కాంతమ్మ అమాయకంగా అడిగింది.

"ఇది ఎవరింట్లో వాళ్ళు కాల్చుకునేది కాదమ్మా! చూసి నువ్వే చెబుదువు", శ్రీధర్ ముసిముసి నవ్వులు నవ్వుతూ అన్నాడు.

"శ్రీ! మనం నైన్ థర్టీకల్లా చేరుకోవచ్చు. గవర్నర్ మిఫ్లిన్ ప్లేగ్రౌండ్ మనకు దగ్గరే. ప్లేగ్రౌండ్‌కు కాస్త దగ్గర్లో కారును పార్క్ చేద్దాం. నడుచుకుంటూ పోదాం అక్కడికి. ఆ ఎట్మాస్ఫియర్‌ను అత్తమ్మ చూడనీ", అంది శైలజ.

తనపట్ల కొడుకూ, కోడలూ చూపిస్తున్న అపేక్షకు, కాంతమ్మ మురిసిపోయింది. తమ ఫ్లాట్ ఉంటున్న స్ప్రింగ్‌సైడ్ డ్రైవ్ నుంచీ, ముగ్గురూ కారులో బయలుదేరారు. కారు అద్దాల్లోంచీ కన్పిస్తున్న విద్యుద్దీపాల కాంతుల్నీ, రంగురంగుల

ప్రకటనల అక్షర విన్యాసాల్నీ, వస్తూ పోతున్న కార్లనూ, రోడ్డు పక్కల దిద్ది తీర్చినట్లుండే ఇళ్ళనూ, చెట్లనూ, వనాలనూ కాంతమ్మ చూస్తూపోతూ 'ఇదేదో కొత్త లోకం, సినిమా లోకం కన్నా బాగుంది' అనుకుంది. స్వంత ఊరు కొట్టాలపల్లె దగ్గర నుంచీ, కొడుకు వెంట బయలుదేరి నిన్నటి దినం రెడింగ్ చేరుకునేంతవరకూ, కాంతమ్మ పసి మనసుతో అన్నీ చూసింది. ఆశ్చర్యపోయింది, అబ్బురపడింది, తడబడింది, అయోమయాన్ని కూడా రుచి చూసింది.

బాణసంచా ఉత్సవాన్ని చూడటానికి వచ్చిన జనం, ప్లేగ్రౌండ్ చుట్టూ ఉండే ఖాళీ స్థలాలు ఎక్కడ దొరికితే అక్కడ కూర్చొనీ, నిలబడీ, అటూ ఇటూ తిరుగుతూ, ముచ్చట్లతో, చిరుతిండ్లతో, కోక్ టిన్నులతో కన్పించారు. కుడి ఎడమలా, ముందూ వెనకా ఉన్న అత్యధిక శ్వేత జనసందోహాన్నీ, సంరంభాన్నీ, సంబరాల్నీ చూసి కాంతమ్మకు వణుకు పుట్టింది. శ్రీధర్ తమకు చోటు కోసం కలయచూస్తున్నాడు.

అత్త చెయ్యి పట్టుకొని శైలజ. కాంతమ్మ కట్టూ బొట్టును కొందరు కుతూహలంగా, చిత్రంగా చూశారు. ఇంగ్లీషులో ఏదో అనుకుంటూ తన వైపు చూసి నవ్వటం, ఒకరిద్దరు 'హాయ్' అనటం, చేతులూపటం చూసి కాంతమ్మ బిత్తరపోయింది.

"ఇక్కడేం భయంలేదు అత్తమ్మా. మిమ్మల్నీ, మీ చీరెనూ మెచ్చుకుంటున్నారు వాళ్ళు. మీరు అందంగా ఉంటారు అత్తమ్మా!", కాంతమ్మకు శైలజ ఉత్సాహాన్నీ, ధైర్యాన్నీ ఇవ్వటానికి ప్రయత్నిస్తూ అన్న మాటలకు కాంతమ్మ సంతోషపడి అంది:

"నువ్వు ఈ అమెరికా వాళ్ళ బట్టల్లో చాలా చక్కగా ఉంటావు శైలజమ్మా. నీ ఒంటి పసిమి రంగు అమ్మదా? నాన్నదా?" కోడలిని మనస్ఫూర్తిగా మెచ్చుకుంటూ కాంతమ్మ అడిగింది.

"నాన్నది", అంది శైలజ ఆనందపడిపోతూ.

ఖాళీ జాగా దొరికింది.

"ఇక్కడ కూర్చుందాం శైలూ మనం. అమ్మకు ఫైర్‌వర్క్స్ బాగా కన్పడతాయి, ఇక్కడ నుంచీ."

శ్రీధర్ తల్లిని తన కుడివైపు కూర్చోబెట్టుకొని పొదివి పట్టుకున్నాడు. శైలజ ఎడమ వైపు కూర్చుంది. అమ్మ అమ్మే అనుకుంది, తన తల్లిని జ్ఞాపకం చేసుకుంటూ.

వ్యక్తి విలక్షణాంశాలు ఏ బృందంలోనైనా ఆకర్షకంగా ఉంటాయి. కాంతమ్మ చీరెకట్టూ, బొట్టూ, జాకెట్టూ, రూపూ, దగ్గరగా ఉండే వాళ్ళు అప్పుడప్పుడు చూస్తున్నారు. తల్లి ఇబ్బందిని గమనిస్తూ శ్రీధర్ అన్నాడు:

"అమ్మా! అమెరికా వాళ్ళు చాలా మర్యాదస్తులు. కలుపుగోలు మనుషులు. వాళ్ళు వెకిలిగా చూడడం లేదు చూడు. మెచ్చుకుంటూ చూస్తున్నారు."

కొడుకు మాటలతో, కోడలు ముందే చెప్పడంవల్లా, తనను చూస్తున్న మహిళల కళ్ళల్లో, తనకు అర్థంకాని భాషలోని మార్దవం వల్లా, కాంతమ్మ బెరుకు తొలగిపోయింది. ధైర్యం కూడగట్టుకొని చుట్టూ కలయచూసింది.

కాంతిపుంజాల మధ్య అంతమంది జనాన్ని ఒక్కచోట తన యాభై దాటిన బతుకులో ఏరోజూ చూడలేదు అనుకుంది కాంతమ్మ. తెలిసీ తెలియని వయసులో ఏడ్చి మొత్తుకుంటే తల్లిదండ్రులు తమ వెంట తీసుకవెళ్ళినప్పుడు చూసిన ప్రొద్దుటూరు రామేశ్వరం తిరణాల – ఆ దేవాలయం, పెన్నేటి ఇసుక తిన్నెల మీద అంగళ్ళూ – కాంతమ్మకు గుర్తుకొచ్చాయి. కాస్త వయసు వచ్చాక, బంధువుల ఊరు రావులపల్లెకు తల్లితో కలసి వెళ్ళినప్పుడు, చూసిన పుష్పగిరి తిరణాల – ఆ కొండ మీది గుడీ, గుడి కింద ఏరూ, ఒకటో రెండో సత్రాలూ, ఏట్లో రాత్రి పడుకున్న జనం – మనసులో మెదిలారు. పెళ్ళికి ముందు, అవ్వా, తాతా వెంట వెళ్ళి చూసిన గూగూడు కుళ్ళాయిస్వామి తిరణాల గుర్తుకొచ్చింది. పెళ్ళయిన కొత్తల్లో అత్తగారి ఊళ్ళో జరిగిన దేవర – ఆ గుంపులూ, ఆ బోనాలూ, ఆ మేకల, పొట్టేళ్ళ, కోళ్ళ బలులూ – స్మృతిలో మెదిలాయి. అదే తమ ఊళ్ళో ఆఖరు దేవర. బలి అయిన పెద్ద తలకాయ కోసం కొట్లాడి, పత్రావాడు వాములకు అగ్గిపెట్టి, పారిపోతూ ఉంటే పట్టుకొని మండుతున్న వామిలోకి వేసినారని విన్నది జ్ఞాపకం వచ్చింది. కాంతమ్మకు ఒళ్ళు జలదరించింది. వాటన్నిటిలో లేనిదేమిటో, ఇక్కడ కొత్తగా ఉన్నదేమిటో కాంతమ్మ స్పష్టంగా గుర్తించలేకపోయింది. 'వాటికంటే ఇది చాలా బాగుంది. ఆ మనుషులకంటే వీళ్ళు బాగున్నారు' అనుకుంది.

"పది అవుతోంది. ఫిఫ్టీన్ సెకండ్స్‌లో ఫైర్‌వర్క్స్ మొదలవుతాయి", అంది శైలజ.

"చూడమ్మా, చూడమ్మా, అదిగో ఆ కుడివైపు చూడు", శ్రీధర్ తల్లిని భుజాలు పట్టుకొని ప్రేమగా ఊపుతూ హెచ్చరించాడు.

కాంతమ్మ అటువైపు చూసింది.

ప్లేగ్రౌండ్‌లో చీకటీ, చిరువెలుగులూ – లీలగా ఏవో ఆకారాలు కదులుతున్నాయి. బాణసంచా రగిలింది. రవరవల మధ్య చిమ్ముకుంటూ, నింగి పైకి ఎగసి, ఎగసిపోతూ, ఆకాశంలో ఎంతో ఎత్తున రంగు రంగుల కాంతుల రాశుల్ని వెదజల్లుతూ, రాలే నక్షత్రాల్ని తలపిస్తూ ఉండిన అపూర్వ దృశ్యం కాంతమ్మ కళ్ళకు కనబడింది. ఆమె నిబిడాశ్చర్యంతో చూసింది.

ఆ అపురూప దృశ్యాన్ని చూస్తున్న జనం ఆనంద కోలాహలం మధ్య, బెదిరిన పసి పిల్లల ఉలికిపాట్లూ, ఏడ్పులూ, తల్లి దండ్రుల గారాబంతో కూడిన ఓదార్పులూ వేటినీ కాంతమ్మ చూడలేదు, వినలేదు – ఆ తన్మయానందంలో.

మళ్ళీ శబ్ద తరంగం. మళ్ళీ పైపైకి దూసుకుపోతున్న వెలుగుల రచనలు. చూస్తున్న వాళ్ళ చప్పట్లు, కేరింతలు.

కళ్ళు ఇంత చేసుకొని ఆ వెలుగుల్ని చూస్తూ, కాంతమ్మ తన అనుభవంలో మళ్ళీ వెతుక్కుంది.

తన పెళ్ళి మెరవణి రోజు పేల్చిన నాటురకం ఔట్లూ, తప్పెట మోతలూ, చిందులూ, దివిటీలూ కాంతమ్మ స్మృతిలో గిలిగింతలు పెట్టాయి. ఈ మధ్య

పదేండ్లలో పల్లెల్లో దీపావళి రోజు ఎవరిళ్ళ దగ్గర వాళ్ళు కాల్చుకునే పదోపరకో కాకర పువ్వులూ, చిచ్చుబుడ్లూ, టపాసుల చిన్నచిన్న వెలుగులూ మదిలో మెరిశాయి. ఇక్కడ ఎవరో ఒక్కచోట అందరి సంతోషంకోసం కాలుస్తున్నారు. ఇట్లాంటిది తన పల్లె బతుకులో ఎప్పుడూ చూడలేదు. భర్త ఉండి ఉంటే, ఎంత సంతోషపడిపోయేవాడో అనుకుంది.

ఎన్నికలు, జెండాలు, ఓట్ల కొట్లాటల్లో ఊర్లోని రెండు పార్టీల వాళ్ళు బాంబులు వేసుకున్నప్పుడు, ఏ పార్టీకి చెందని తన భర్త బలి కావడం కాంతమ్మకు ఆ క్షణంలో గుర్తుకొచ్చింది. చీర చెరుగుతో కళ్ళు ఒత్తుకొంది. అది శైలజ చూసి అడిగింది:

"కళ్ళల్లో ఏదన్నా పడిందా అత్తమ్మా?"

చీర చెరగు తీసి, భుజాలకు కప్పుకొని ఎడమ కంటిని ఎడమ చేత్తో తుడుచుకుంటున్న తల్లిని శ్రీధర్ చూశాడు. అప్రయత్నంగా శ్రీధర్ తన చేతిగుడ్డను తీసుకొని, నోటి దగ్గర పెట్టుకొని ఉఫ్, ఉఫ్ అంటూ నాలుగైదు పర్యాయాలు ఊది, తల్లి చేతిని పక్కకు తీసి, ఎడమ కంటి మీద ఉంచాడు.

"ఏం లేదర్రా. ఊరికే కళ్ళు తుడుచుకుంటున్నా. మీరిద్దరూ కంగారు పడ్డారు... శైలజమ్మా! ఆ చప్పుళ్ళకు నీకు భయం వెయ్యలేదా? పైగా కడుపుతో ఉన్నదానివి..."

అత్త పరామర్శకు శైలజ సంతోషపడింది; సిగ్గు పడింది.

"లేదు అత్తమ్మా" అంది.

బాణసంచా మహోత్సవం ఇరవై నిమిషాలు సాగింది. అది ముగుస్తూనే గలగల మంటూ జనం ఎవరిళ్ళకు వాళ్ళు తిరుగు ముఖం పట్టారు. కారులో కూర్చున్నాక శ్రీధర్ తల్లిని అడిగాడు.

"నీకు నచ్చిందా అమ్మా?"

శైలజ నవ్వుతూ కలుగజేసుకుంది: "అత్తమ్మ ఇన్‌వాల్వ్ అయి చూసింది."

"మరి శైలూనో?" అన్నాడు శ్రీధర్.

"నీకూ, నాకూ సరేలే. అత్తమ్మకు కొత్త కదా?" అంది శైలజ.

"ఏమర్రా! ఇది తిర్నాలా? పండగా? ఏంది?"

అత్త అమాయకమైన ప్రశ్నకు శైలజకు నవ్వు వచ్చింది. మర్యాదకొద్దీ ఆపుకుంది.

తల్లికి శ్రీధర్ ఓపికగా జవాబిచ్చాడు;

"అమెరికాకు స్వతంత్రం వచ్చిన రోజమ్మా. అందుకని ఈ రోజు ఇది..."

"మన పక్కల ఇట్లాంటివి జరపరే. ఎందుకని?"

తల్లి అడిగిన ప్రశ్నకు శ్రీధర్ వెంటనే స్పందించలేకపోయాడు.

కాంతమ్మ తడబడుతూ మళ్ళీ ఒక ప్రశ్న వేసింది:

"దీనికి ఎంత డబ్బు అయిఉంటుంది?"

"తెలియదమ్మా. చాలా అయిఉంటుంది", తెలియని వాటిని తెలియదని చెప్పడం అమెరికాకు వచ్చిన రెండు మూడు నెలల్లోనే శ్రీధర్ నేర్చుకున్నాడు. అదొక ప్రవృత్తిగా కూడా మారిపోయింది.

శని ఆదివారాల్లో కొడుకూ, కోడలూ కలసిమెలసి పనులు పంచుకొని ఏ రాద్ధాంతాలూ లేకుండా చేసుకోవటాన్ని కాంతమ్మ నిశితంగా గమనించింది. ఇల్లు శుభ్రపరచుకోవటం, సెల్లార్‌లోని వాషింగ్ మెషీన్‌లో బట్టలు ఉతుక్కోవటం, ఆరబెట్టుకోవటం, ఇంట్లోని చెత్తా చెదారాన్నీ, చదివి పక్కన పెట్టిన పత్రికల్నీ, ఇంటి ఎదురుగా ఉన్న గార్బేజిలో పడవేసి రావటం, అన్నిటినీ కాంతమ్మ చూస్తూనే ఉంది. 'అక్కడ పల్లెటూర్లో మగ పనులు వేరు, ఆడ పనులు వేరు. ఇక్కడ పనిలో ఆడామగా తేడా లేదు. ఇట్లాగే ఉంటే బాగుంటుంది' అని కాంతమ్మ గట్టిగా అభిప్రాయపడింది.

ఆ ఆదివారం మధ్యాహ్నం భోజనాలు చేస్తున్నప్పుడు కాంతమ్మ అడిగింది:

"ఇల్లు చాలా బాగుంది. బాడిగ ఎంతర్రా?"

"ఆరు నూరు డాలర్లు అత్తమ్మా" అంది శైలజ.

కోడలి వైపు ప్రశ్నార్థకంగా చూస్తున్న తల్లిని శ్రీధర్ గమనించాడు. బిగ్గరగా నవ్వుతూ అన్నాడు:

"అమ్మా నీ కోడలుకు ఎప్పుడన్నా అరవ మాట దొర్లుతుంది, తెలుగు మాట్లాడితే" అన్నాడు.

"నాకంటే బాగా మాట్లాడతాది", అంది కాంతమ్మ.

శైలజ, శ్రీధర్ నవ్వుతో శ్రుతి కలిపింది.

"అదేంది డాలర్లు అన్నావు శైలజమ్మా. మన రూపాయల్లో చెప్పు", అంది కాంతమ్మ.

"దగ్గర దగ్గర ఇరవై వేల రూపాయలమ్మా" అన్నాడు శ్రీధర్, కల్పించుకుని.

"అమ్మో అంతనా? మనపక్క వెలిభూమి అయితే ఒక్క ఎకరా కొనచ్చు" - కాంతమ్మ తన లెఖ్ఖ తాను చెప్పింది.

"ఇక్కడ మేలు అత్తమ్మా. అదే వేరే సిటీల్లో అయితే..."

"ముప్పయి, నలభై వేలు పెట్టాలి" అని శ్రీధర్ భార్య వాక్యాన్ని పూర్తిచేశాడు.

కాంతమ్మకు నిజంగానే భయం వేసింది. 'ఇంటి బాడిగే ఇంతుంటే ఇంకెంత డబ్బు ఖర్చు అయితాదో ఇండ్లు గడపడానికి' అనుకుంది.

"నువ్వు కాసేపు పడుకోమ్మా నీ రూంలో. సాయంత్రం బయటికి పోదాం" అన్నాడు శ్రీధర్.

పగటి విశ్రాంతి కాంతమ్మ అనుభవంలో లేదు.

తానూ, పెద్ద కోడలూ పొద్దున వెళ్ళి, బాగా ఎండ ముదిరాక తోట దగ్గర నుంచి రావడం, బోరింగు నుంచీ ఇంట్లోకీ, పశువులకూ బిందెలు బిందెలు నీళ్ళు

తెచ్చుకోవడం, నడవ ఊడ్చుకోవడం, ఏవైనా దంచుకునే పనులుంటే చూసుకోవడం, ఇంటి చాకలి నెలకొక్కమారొస్తే ఆ మధ్యలో గుడ్డల్ని ఉతుక్కోవడం, ఇంట్లో పిల్లల్ని చూసుకోవడం... పని... పని... పని... ఎడతెరపిలేని పని... ఆడ పుట్టుక పని...

మెత్తటి పరుపు మీద కాంతమ్మకు తొలిసారి సుఖనిద్ర పట్టింది. మెలకువ వచ్చాక సిగ్గుపడింది. పగటి నిద్ర పనికి చేటని కాంతమ్మ అనుకునేది. బాత్‌రూంలోకి వెళ్ళి ముఖం కడుక్కొంది. వచ్చిన రోజే బాత్‌రూంలో స్నానాల టబ్బునూ, వేణ్ణీళ్ళ, చన్నీళ్ళ కొళాయిల్నీ, ముఖం కడుక్కునే సింకునూ, సింకుపై ఉండే అద్దం అల్మారాలోని పేస్టునీ, బ్రషుల్నీ, అలంకరణ సామాగ్రినీ శ్రీధర్ తల్లికి దగ్గరుండి పరిచయం చేశాడు. టబ్ బయట స్నానం చేయవద్దని చెప్పాడు. ఊళ్ళోని జాలారిని తలచుకుంటూ, ముఖం తుడుచుకునేటప్పుడు ప్రతి వస్తువునూ కాంతమ్మ కొన్ని క్షణాలు మళ్ళీ మళ్ళీ చూసి, పడిన ఒకటి రెండు ఇబ్బందులకు నవ్వుకుంది. హాల్లోకి వచ్చి టి.వి. చూస్తున్న కొడుకు పక్క సోఫాలో కూర్చుంది. ఎడమవైపునున్న సింగిల్ సోఫాలో కూర్చొని బోనస్ ప్రైజ్ కూపన్ల కోసం వెతుకుతున్న శైలజ అత్తను చూస్తూనే నవ్వి లేచి "బాగా నిద్ర పట్టిందా అత్తమ్మా?" అంది.

"అదేం నిద్రో, మాయనిద్ర పట్టిందమ్మా?" అంది కాంతమ్మ.

"మీ కోసమే చూస్తున్నాం. టీ తెస్తానుండండి", అంది శైలజ.

కోడలి వెంట కుకింగ్ రేంజ్ దగ్గరకు వెళ్ళటానికి కాంతమ్మ లేవబోతోంది.

"మీరు కూర్చోండి అత్తమ్మా. అయిదు నిమిషాల్లో టీ తెస్తా", అంది శైలజ.

మూడు కప్పులోని టీని ట్రేలో పెట్టుకొని, శైలజ అత్తకూ, భర్తకూ చెరొక కప్పు అందించి, తానూ కప్పు తీసుకుంది ట్రేని టీపాయి మీద ఉంచి.

"ఈ రోజు జైంట్ ఫుడ్ స్టోర్స్‌కు పోదాం" అంది శైలజ టీ తాగుతూ.

"అమా!" అన్నాడు శ్రీధర్.

"అంటే ఏంది శ్రీధరూ", అడిగింది కాంతమ్మ.

"ఏం లేదులే అత్తమ్మా. మా తమిళాన్ని శ్రీధర్ సరదా కోసం వెక్కిరిస్తాడు. మేము ప్రతిదానికీ ఆమా, ఆమా అంటాం - అంటే అవును అని అర్ధం" అంది శైలజ.

"అర్ధం కాదు అర్థం" అన్నాడు శ్రీధర్.

"ఇట్లా ఏడిపిస్తాడు చూడండి అత్తమ్మా?" అంది శైలజ నవ్వుతూ.

వాళ్ళిద్దరి అన్యోన్యత చూసి కాంతమ్మ ముచ్చటపడింది.

వెస్ట్ రెడింగ్, షిలింగ్‌టన్ రోడ్డులోని జైంట్ ఫుడ్ స్టోర్స్ ముందు పార్కు చేసిన కార్లనూ, స్టోర్స్‌లో ఒక క్రమపద్ధతిలో అమర్చిన రకరకాల వస్తువుల్నీ చూసి కాంతమ్మ దిమ్మ తిరిగిపోయింది. కొడుకూ, కోడలును బిడియపడుతూనే మూగగా అనుసరించింది. మాంసం, చేపల రకాలను అద్దాల్లోంచీ చూసి జడుసుకుంది. శైలజ కూరగాయల్నీ, ఆకుకూరనూ, పండ్లనూ తీసుకుంది. కౌంటర్ గేటు దగ్గర కొడుకు

డబ్బు ఇవ్వకుండా ఏదో ఇవ్వటం కాంతమ్మ గమనించింది. వాటిని క్యారీ బ్యాగుల్లో వేసి చేతికివ్వటం చూసింది. 'ఇదేం వింత?' అనుకుంది. ఆమెకు పొట్లాలు కట్టి ఇవ్వటమో, గంపలో వేసుకోవటమో మాత్రమే తెలుసు.

ఫ్లాట్ చేరాక, శైలజ తెచ్చిన వాటిని ఫ్రిజ్‌లో అమరుస్తోంది.

కాంతమ్మ బిడియపడుతూ కోడలిని అడిగింది:

"అంత పెద్ద అంగడిలో అప్పు ఇస్తారా శైలజమ్మా"

శ్రీధర్ తల్లికి దాన్ని మాల్ అంటారనీ, క్రెడిట్ కార్డుతో ఏ వస్తువైనా కొనవచ్చుననీ తల్లికి అర్థమయ్యేట్లు వివరంగా చెప్పాడు.

క్యారీ బ్యాగుల్లోంచీ శైలజ తీసి పెడుతున్న టమోటాలు, ఆకుకూర, అరటిపండ్లను కాంతమ్మ చూసింది. వాటి ధరలను తెలుసుకోవాలనుకుంది.

"టమోటాలు కిలో ఎంత శైలజమ్మా?" అని అడిగింది.

"ఇక్కడ కిలోల ఎడ్డై కాదు అత్తమ్మా, పౌండ్లే" అంది శైలజ.

"అంటే?"

అత్తకు ఎట్లా చెప్పాలో కోడలికి స్ఫురించటంలేదు. ఎడ్డై ప్రయోగానికి శ్రీధర్‌కు నవ్వు వచ్చింది. శ్రీధర్ తల్లికి చెప్పాడు:

"ఎడ్డై అంటే తూకం అమ్మా అదే పౌండు అంటే రెండు సేర్లు. దగ్గర దగ్గర అర కిలో."

"అయితే అర కిలో ఎంత?"

"ఎంత శైలూ?"

శైలజ బిల్లు చూసి "డాలర్ ఫిఫ్టీ ఎయిట్ సెంట్స్" అంది.

"మన రూపాయల్లో ఎంత?"

"యాభై అయిదు రూపాయలు పైననే అమ్మా"

"అంతనా? మరి ఆకుకూర?"

"ఎంత శైలూ?"

"ఎయిటీత్రీ సెంట్స్"

"అంటే ముప్పయి రూపాయలమ్మా"

నోరు నొక్కుకుంటూ, "మరి అరటి పండ్లో?" అంది కాంతమ్మ.

"ఎంత శైలూ?"

శైలజ నవ్వును ఆపుకోలేకపోతోంది. "టూ-డాలర్స్ నైన్ సెంట్స్" అంది.

"డెబ్బయి అయిదు రూపాయలమ్మా" శ్రీధర్ జవాబిచ్చాడు.

"ఎంత బాగా పొదుపుగా ఉంటే మాత్రం నాలుగు పండ్లు డెబ్బయి అయిదు రూపాయలా? అక్కడే మన దేశంలో అన్యాయమనుకుంటే, ఇక్కడ అమెరికాలో ఇంకా అన్యాయమా?"

శ్రీధర్‌కు తెగ నవ్వు వచ్చింది.

"మన తోట్లో టమోటాలు, మిరప, ఎర్రగడ్డలు వేసే వాళ్ళం గదమ్మా. ఈ సారేమైనా వేశారా?"

ఇంటి వ్యవసాయాన్ని శ్రీధర్ గుర్తుచేయటంతో కాంతమ్మకు ఆ అగచాట్ల బతుకులు మనసులో మెదిలాయి. గుండెలో, గొంతులో బాధ. ఆ ఘోష చెప్పింది:

"ఈసారి వెయ్యలా. పోయినసారి టమోటాలు పండించినామా? కిలో అర్థ రూపాయకు కొనుక్కునే నాథుడు లేడు. గొడ్లకు పెట్టేవి పెట్టినాం. గంపలకు గంపలు దిబ్బలో పోసినాం. మిరపా అంతే. ఎర్రగడ్డల సంగతి చెప్పాల్సిన పనిలేదు. మిగతాచోట్ల ఏమోగానీ, శ్రీధరూ! మన పక్క పల్లెలో రైతులు ఏం పండించినా బాగుపడింది లేదు. పంట దండిగా చేతికొచ్చినప్పుడు ధరలుండవు. ధరలు బాగా ఉన్నప్పుడు పంట దిగుబడి తక్కువ – బోరులో నీళ్ళు తక్కువొచ్చో, వాన లేకో, తెగుళ్ళు తగిలో. ఇంక పత్తి పంట వేసినోళ్ల గోడు చెప్పేదానికి లేదులే. ఒక్కటి గాదులే. అదొక దరిద్ర లోకం నాయనా".

శైలజ, అత్త మాటల్ని శ్రద్ధగా వింది. ఆ మాటల వెనుక బాధను అర్థం చేసుకుంది.

"మీ ప్రాంతాల్లో వ్యవసాయ జీవితం అంత అన్యాయంగా ఉంటుందా శ్రీ?" అని శ్రీధర్‌ను ఇంగ్లీషులో అడిగింది.

"మద్రాసులో పెద్ద ఉద్యోగస్తులుగా ఉండే తల్లిదండ్రుల మధ్య కష్టాలు లేకుండా పెరిగిన దానివి. రాయలసీమ గ్రామాల ఇక్కట్లు నీ నెత్తి మీద నేనూ, మా అమ్మా కలసి రుద్దటం బాగుండదు. మీకు తెలుగు గంగను ఇచ్చిన వాళ్ళం", పరిహాస పూర్వకంగా శైలజకు ఇంగ్లీషులో చెప్పి, తల్లితో తెలుగులో మాట మార్చాడు:

"అమ్మా! ఇక్కడ ఉండే నాలుగైదు నెలలూ ఏ దిగులూ పెట్టుకోకుండా ఉండు – సంతోషంగా. ఏం కావాలన్నా అడుగు. శైలుకు నిన్ను గురించీ, మన కుటుంబం గురించీ అన్నీ తెలుసు. నువ్వు రావడంతో శైలుకు కొత్త ఉత్సాహం వచ్చింది. 'మా అమ్మ వచ్చినాక జొన్న రొట్టెలు, మెంతిపప్పు, నూనె వంకాయ, సంగటి, మాంసం చేసిపెడుతుంది' అని శైలుకు చెప్పినాలే. శైలుకు అవి తెలియవు. శైలు చేసే సాంబారు తిన్నావు, పొంగల్, కూటు, మోర్ కొలంబో శైలు భలే రుచిగా చేస్తుంది."

"శ్రీలంక,' కొలంబో కాదు శ్రీ! కళంబ్ అనాలి", అంది శైలజ పకపక నవ్వుతూ.

'మొగుడూ పెండ్లాలు ఇట్లా ఉండాల', అనుకుంది కాంతమ్మ.

"మనం ఆఫీసుకు పోతే, అత్తమ్మకు పొద్దుపోవటానికి న్యూజెర్సీ నుంచీ తెలుగు సినిమా క్యాసెట్లు తెప్పించుకుందాం" అంది శైలజ.

ఆ అభిమానానికి కాంతమ్మ పొంగిపోయింది.

శని ఆదివారాలు తప్ప, మిగతా అయిదు రోజుల్లో వాళ్ళ పనితీరు చూసి విస్తుపోయింది. పల్లెటూళ్ళో ఆడవాళ్ళే, మగవాళ్ళ కంటే ముందులేస్తారు. ఇక్కడ ఇద్దరూ వేకువ జామున్నే లేవటాన్ని కాంతమ్మ గమనించింది. చకచకా తయారై, కాఫీ తాగి, ఇంత తిని, ఇంత బాక్సుల్లో పెట్టుకొని చెరి ఒక కారులో ఉదయం ఏడులోపే పనిచేసే చోట్లకు వెళ్ళటాన్ని చూస్తోంది. మామూలుగా అయితే సాయంత్రం చీకటి పడ్డాకే తిరిగి రావటం గమనించింది. శ్రీధర్ ఒక్కొక్కరోజు రాత్రి చాలా పొద్దుపోయాక రావటం కూడా చూసింది. వాళ్ళు ఇంట్లో మాట్లాడుకునేదాన్ని బట్టి, వాళ్ళ పనిధ్యాస ఏమిటో కాంతమ్మకు లీలగా అర్థమైంది.

'ఊర్లో తన పెద్ద కొడుకుకు పొలం పనిమీద కంటే పై పనులూ, పై తిరుగుళ్ళూ ఎక్కువ. కోడల్ని రాచి రంపాన పెడతాడు. రెండో కొడుకు పులివెందులలో టీచరు. అందరికంటే పెద్దది కూతురు. కనుమ అవతల సంబంధం. అతనూ టీచరు. అయినకాడికి బాగున్నారు. చిక్కంతా పెద్ద కొడుకు సంసారంతోనే.'

ఈ రకం ఆలోచనలు కాంతమ్మకు ఏ తెలుగు సినిమానో చూస్తున్నప్పుడు వచ్చేవి. కాంతమ్మ స్వంత పనులు, శ్రీధర్, శైలజ ఆఫీసులకు వెళ్ళిపోయాక మొదలయ్యేవి. రాత్రికి అవసరమయ్యే వంట పని చూసుకునేది. టి.వి.లో కొడుకు న్యూజెర్సీ నుంచీ తెచ్చిన, తెప్పించిన వీడియో కేసెట్లలో ఏదో ఒకటి పెట్టిపోతే, తెలుగు సినిమా రోజుకొకటి చూసేది. టేప్‌రికార్డరులో తెలుగు పాటలు కాసేపు వినేది. ఒక అరగంటో గంటో నిద్ర. ఒంటరితనం బాధించేది – బిక్కుబిక్కు మంటూ ఇంట్లో ఉండటంవల్ల. తోచనప్పుడు కిటికీలోంచి కన్పించే ఓక్, పైన్ చెట్లను చూస్తూ, రోడ్డు మీద అప్పుడప్పుడూ కన్పించే వృద్ధుల్నీ, పిల్లల్నీ చూస్తూ పొద్దుపుచ్చేది. వర్షం వచ్చినప్పుడు కిటికీలోంచి ఆ దృశ్యాన్ని చూస్తూ పరమానంద పడేది.

పల్లెల్లో ఊపిరి సలపని పనిలో కాంతమ్మకు విసుకొచ్చేది. వైరాగ్యమొచ్చేది. ఆ మధ్య కొన్న టి.వి.లో కార్యక్రమాల్ని ఏ గంటో తీరికగా చూసే అవకాశం కూడా చాలా సందర్భాల్లో ఉండేది కాదు. ఇక్కడ చేతినిండా పనిలేదు. కాంతమ్మ దృష్టిలో అసలు పనేలేదు. బయటి సమాజంతో సంబంధం లేదు. భాష తెలియదు.

అమెరికా జీవితానికి కాంతమ్మ నెమ్మదిగా అలవాటు పడుతోంది. అప్పుడప్పుడూ ఆమెకు పెద్ద కోడల్నీ, పిల్లల్నీ చూడబుద్ధి అయ్యేది.

శని ఆదివారాల సందడి ఆమెకు ఇష్టంగా ఉండేది. తప్పకుండా ఆ రెండు రోజుల్లో ఇంటికి తెచ్చుకునే సరుకుల ధర వరలు, ఖర్చుల వివరాలు కోడలిని అడగటం మాత్రం మరిచిపోయ్యేది కాదు. శైలజ ఓర్పుగా చెప్పేది. ఖర్చు అవుతున్న అంకెలను మనసులో ఎంత కూడుకోవాలని ప్రయత్నించినా, కాంతమ్మకు పూర్తిగా సాధ్యపడేది కాదు. మారకం విలువలు ఆమెకు పట్టుబడలేదు. ఇక్కడ సంపాదనా ఎక్కువే, ఖర్చులూ ఎక్కువే. ఇద్దరూ సంపాదిస్తున్నారు కాబట్టి సుఖంగా ఉన్నారనుకుంది. ఆ సుఖాన్ని శ్రీధర్, శైలజల దాంపత్యంలో కాంతమ్మ చూసింది. శని ఆదివారాల సందడిలో అది ప్రత్యక్షంగా కన్పించేది.

ఒకటి రెండు పర్యాయాలు తెలిసిన తెలుగు వాళ్ళ ఇంటికీ, తమిళ తెలుగు వాళ్ళ ఇంటికీ కాంతమ్మను శ్రీధర్, శైలజ తీసుకవెళ్ళారు. అక్కడ ప్రాణం లేచివచ్చేది. కానీ అక్కడి తన తరం వాళ్ళ వంటలూ వార్పుల మాటలు అర్థమైనంతగా, వాళ్ళ పూజలూ పురస్కారాల, యోగుల, బాబాల సంభాషణలు అర్థమయ్యేవి కావు. కాంతమ్మకు తెలిసింది నాగులచవితి, ఉగాది పండగల పూజలు మాత్రమే.

ఒక ఆదివారం మధ్యహ్నం శ్రీధర్ స్నేహితులు భోజనానికి ఇంటికి వచ్చారు. 'మా అమ్మ' అని శ్రీధర్, మా 'అత్తమ్మ' అని శైలజ అతిథులకు పరిచయం చేశారు - రెండు మూడు భాషల్లో. వచ్చిన వాళ్ళందరూ కాంతమ్మను ఎంతో గౌరవంగా చూశారు. మొత్తం ఎనిమిది మంది. రెండు జంటలూ, మరో నలుగురు యువతీ యువకులు. కాంతమ్మతో తెలుగులో మాట్లాడింది రాజమండ్రి ప్రాంతం దంపతులు మాత్రమే. శైలజ ఒక జంటతో తమిళంలో మాట్లాడింది. హిందీలో మాట్లాడుకున్నారు, ఒకరిద్దరు. ఎక్కువగా వాళ్ళందరి మధ్యా ఇంగ్లీషు నడిచింది. ఎవరెవరు ఎక్కడి నుంచి వచ్చారో తల్లికి శ్రీధర్ చెప్పాడు: ఒకరిది కాలికట్, ఒకరిది కలకత్తా... ఆ స్థలాలూ, వాటి రాష్ట్రాలూ కాంతమ్మకు తెలియకపోయినా, బంధువులు కాని ఆ బంధువులకు ఆప్యాయంగా వడ్డించింది. కాంతమ్మ చేసిన సెనగబేడల పాయసాన్ని అందరూ తెగ మెచ్చుకున్నారు.

కలకత్తా యువకుడు అరుణ్‌ఘోష్ తాను తెచ్చిన తమలపాకుల్ని కాంతమ్మ చేతిలో పెట్టాడు. తెలుగు దంపతుల మాటల్లో ఒక్కొక్క ఆకు ఒక డాలరు అని కాంతమ్మకు తెలిసింది. 'ఇరవై ఆకులున్నాయి. అంటే ఇరవై డాలర్లు. డాలరుకు ముప్పయి ఆరు రూపాయల చిల్లర - మొత్తం..." కాంతమ్మకు మతిపోయింది. శ్రీధర్ అందరికీ కిళ్లీలు కట్టి ఇచ్చాడు. కాంతమ్మకు కిళ్లీ నములుతూ ఉంటే చాలా రుచిగా ఉన్నా, రూపాయలు నములుతున్నట్లు అనిపించింది.

మరొక శుక్రవారం సాయంత్రం ఆడమ్స్ టౌనుకు శ్రీధర్, శైలజా, కాంతమ్మా కలసి వెళ్ళారు. ఫార్మర్స్ మార్కెట్ కాంతమ్మకు తెగ నచ్చింది.

"మన పక్క సంత మాదిరి ఉంది శ్రీధరూ" అంది.

"రైతులు పండించి తెచ్చినవి ఇక్కడ అమ్ముకుంటారమ్మా", శ్రీధర్ తల్లికి చెప్పాడు.

వ్యవసాయపు పనిముట్ల దుకాణాలూ, రెడింగ్‌లో చూడని గుర్రపు బగ్గీలూ, వాటి మీద కన్పించిన తెల్లటి పొడుగాటి గడ్డం మనుషులూ, రాశి పోసిన కళింగర కాయలూ, నేల మీదపరచి అమ్ముకుంటున్న పిల్లల బొమ్మలూ... అన్నిటినీ కాంతమ్మ పరమాశ్చర్యంతో చూసింది. "గుర్రపు బండి మీదుండేవాళ్ళెవరు?" అని అడిగింది.

శైలజ చెప్పింది: "వీళ్ళను అమిష్ వాళ్ళు అంటారు అత్తమ్మా" అని.

అమిష్ వాళ్ళను గురించీ, వాళ్ళ వ్యవసాయాన్ని గురించీ, ప్రత్యేకతల గురించీ శ్రీధర్ తల్లికి సంగ్రహంగా చెప్పాడు.

"మన పల్లెటూర్ల పద్ధతులన్నమాట."

కాంతమ్మ మాటలకు కొడుకు, కోడలు పగలబడి నవ్వారు. కాంతమ్మ జత కలిపింది.

శ్రీధర్, శైలజ ఆగస్టు 16న కాంతమ్మను న్యూజెర్సీకి తీసుకువెళ్ళారు. అక్కడి బంగారు షాపుల్లోని కొనుగోళ్ళనూ, రద్దీని చూసింది - విస్మయంతో. 'ఇంత బంగారం పిచ్చా? ఇంత మంది ఇట్లా కొంటారా?' అని విస్తుపోయింది. తనకేమీ వద్దు వద్దు అంటున్నా శైలజ అత్తకు నాలుగు గాజులు తీసింది. చిన్నన్న పిల్లల్లో, అక్క పిల్లల్లో చెరొక అమ్మాయికి ఒక్కొక్క గొలుసును శ్రీధర్ కొన్నాడు. అక్కకు ఒక లాంగ్ చైన్ కొన్నాడు. పెద్ద వదినకూ, చిన్న వదినకూ రెండేసి గాజులు కొన్నాడు. 'ఇదేం పిచ్చి శ్రీధరూ?' అని కాంతమ్మ అంది.

"అటు చూడమ్మా ఆ గుజరాతీ వాళ్ళు బంగారం షాపులోకి అడుగు పెట్టినారంటే యాభై లక్షలకు తక్కువ కొనరు - పెండ్లిండ్ల సీజన్లో. ఇప్పుడు బంగారం ధర తగ్గిందిలే అమ్మా. ఇండియాలో కంటే తక్కువ. ఊరికి పోయేటప్పుడు తీసుకుని పోదువుగానీ" అన్నాడు శ్రీధర్.

కోడలు, కొడుకు ప్రేమలకు కాంతమ్మ లోలోపల సంతోషించినా, డబ్బు దండుగ చేస్తున్నారేమో అనుకుంది.

బంగారం షాపులోంచీ బయటికి వచ్చినప్పుడు, కారు వెనుక ఒక పెద్ద భారత జాతీయ పతాకాన్ని కట్టుకొని 'స్వతంత్ర భారత్‌కి జై' అని నినాదమిస్తూ వెళ్తున్న ఒక యువకుణ్ణి చూసింది. జాతీయ పతాకం కర్ర చివర రెపరెప లాడుతోంది. కాంతమ్మకు ముచ్చటేసింది. శ్రీధర్ స్కూల్లో చదువుకుంటున్నప్పుడు నానా గొడవచేసి, కాగితం జెండాలు కొని ఇంటికి కట్టడం గుర్తుకొచ్చింది.

'మూవీ టైం'లో శ్రీధర్ తల్లి కోసం తెలుగు సినిమా క్యాసెట్లు తీసుకున్నాడు. కాంతమ్మా మూవీ టైంలోని భిన్న భాషల క్యాసెట్లు చూసి 'అన్ని సినిమాలున్నాయా?' అనుకుంది. సబ్జిమండీలోని ఉప్పులూ, పప్పులూ మొదలుకొని మునక్కాయలు, మామిడికాయలు, కరివేపాకు సైతం ఉండటం కాంతమ్మ గమనించింది. 'వీళ్ళకు దొరకనవి అంటూ ఏవీలేవు' అనుకుంది.

న్యూజెర్సీ నుంచీ తిరిగి వచ్చాక ఆ మరుసటిరోజు ఆదివారం సాయంత్రం శైలజ అత్తను వెంటబెట్టుకొని 'మాల్స్' తిప్పేందుకు వెళ్ళింది. శ్రీధర్ ఏదో పనిఉందని చెప్పి ఇంట్లో ఉంటానన్నాడు.

శైలజ, కాంతమ్మ, తిరిగే వచ్చే వేళకు రాత్రి 8.30 అయింది. ఫ్లాట్‌లోకి అడుగు పెడుతూనే శైలజ పసిపిల్లలాగా ఉత్సాహంగా చెప్పింది:

"అత్తమ్మకు డాలర్ ట్రీ బాగా నచ్చింది. ఇంట్లోలేని కొన్ని ఐటమ్స్‌ను అత్తమ్మ సెలెక్ట్ చేసింది. యువర్ పెట్ సెంటర్ ఇంకా బాగా నచ్చింది అత్తమ్మకు. అదుసరి శ్రీ నువ్వు చిన్నప్పుడు పావురాల్ని పెంచావటగదా. అత్తమ్మ చెప్పిందిలే."

శ్రీధర్ ప్రతిస్పందించలేదు. ఆలోచనల్లో మునిగి ఉండటం శైలజ గమనించింది.

"ఏమైంది శ్రీ?" అని శైలజ అడిగింది.

దాదాపు రెండు గంటలనుంచీ తొలుస్తున్న బాధనూ, మధ్యలో రేగిన కోపాన్నీ, కలిగిన విసుగునూ, బలవంతంగా శ్రీధర్ అణచుకోటానికి ప్రయత్నిస్తూ, తల్లి వైపు తిరిగి అన్నాడు:

"అమ్మా! చిన్నన్న ఫోను చేసినాడు."

"అందరూ బాగున్నారంటనా? ఊరి దగ్గర సంగతులేమన్నా చెప్పినాడా?"

"చిన్నన్నతో ఇబ్బందేముందమ్మా. తన పని, తన సంసారం! ఊరి దగ్గర సంగతులే... పెద్దన్న తాను బాగుపడడు... అయినవాళ్ళను బాగుపడనీడు."

"ఏం జరిగింది?"

తల్లి ఆందోళనను శ్రీధర్ పసిగట్టాడు. నెమ్మదిగా విన్నది చెప్పటానికి పూనుకున్నాడు.

"మనకు స్వతంత్రం అంటే విచ్చలవిడిగా బతకడం, తాగడం, పంతాలూ పట్టింపుల్తో కొట్లాటలు పెట్టుకోవడం... అంతే కదమ్మా?"

"ఏంది శ్రీధరూ! జరిగింది చెప్పు?"

"మన ఊళ్ళో కొత్త గలాటా అంట! తెలుగు దేశమో, కాంగ్రెసో ఏదైతేనేం ఈయన కెందుకు? రాళ్ళు వేసుకున్నారు. వాములు కాల్చుకున్నారు. బాంబులు వేసుకున్నారు...."

శైలజ భయంతో వింటోంది. కాంతమ్మ అప్రయత్నంగా అడిగింది:

"మీ అన్నకేమైనా అయిందంటనా?"

"ఏం కాలేదు", జైల్లో ఉన్నాడని మాత్రం శ్రీధర్ చెప్పలేకపోయాడు.

"వ్యవసాయం చూసుకుంటూ, ఏదో వ్యాపారం చేసుకుంటాననంటే లక్ష ఒకసారి, మూడు లక్షలొకసారి పంపినా. ఆ డబ్బుల్లో అక్కకు ఒక యాభై వేలు, చిన్నన్నకు ఒక ఇరవై అయిదు వేలూ ఇమ్మని చెప్పినా. వాళ్ళకు దమ్మిడీ ఇవ్వలేదు. డబ్బును ఏం చేసినాడో, ఏమోగానీ మళ్ళా మాములే..."

"మళ్ళా అంటే... చిన్నన్నతో డబ్బు అడిగించినాడా?"

శ్రీధర్ తన లోపలి బాధను తల్లికి చెప్పాడు, స్వగతంగా:

"అమ్మా! ఇక్కడికి వచ్చినాక మూన్నెల్లు ఉద్యోగం లేదు. హైదరాబాద్ కంపెనీవాడు వీసా ఇప్పించి నడిబజార్లో తోసినాడు. పెట్రోలు బంకులో పనిచేసినా. ఇంకేవో చేసినా. శైలజను చూడు. మన కులం కాదు, మన ప్రాంతం కాదు, నా పక్కన కష్టాల్లో నిలబడింది. తన ఒక్క ఉద్యోగంతో ఇద్దరం కొన్నాళ్ళు... తరువాత నాకూ ఉద్యోగం దొరికింది. మా పెళ్ళివల్ల వచ్చే కట్నం పోయిందని ఏడ్చినవాడు పెద్దన్నే - ఎవరూ కాదు. అడిగిన డబ్బు పంపినాకనే నిన్ను అమెరికాకు తీసుకుపోవటానికి ఒప్పుకున్నాడు. రెండు నెలలు పోయినాక శైలజ ఉద్యోగం మానుకోవాలి... మళ్ళా ఎప్పుడు ఎక్కడ దొరుకుతుందో తెలియదు. నువ్వే

చూస్తున్నావు. రోజూ నలభై మైళ్ళు పోవాలి - శైలజ కారులో తన ఉద్యోగానికి. నేనూ మరొక కారులో అంతే. ఈ కార్లు కూడా అందుకోసమేనమ్మా... నిజం చెప్పమంటావా? మన పక్కల నుంచి వరిపండే కాలవ కింద పల్లెలకు పోయే కూలోళ్ళకూ, మాకూ తేడా లేదు. కోతలు ఎన్నాళ్ళుంటాయో వాళ్ళకు తెలియదు. ఇక్కడ మాకూ అంతే."

"మల్లా డబ్బు కావాలని మీ చిన్నన్నతో అడిగించినాడా?"

శ్రీధర్ మౌనాన్ని చూసి కాంతమ్మ తేల్చి చెప్పింది:

"శ్రీధరూ! కడుపు చించుకుంటే కాళ్ళ మీద పడుతుంది. మీ పెద్దన్నకు డబ్బుంటే జల్సాలు చేసేదనే మతం. ఇంకేం పంపవద్దు. పంపి ఇంకా చెడగొట్టవద్దు."

"అత్తమ్మ నిజం చెప్పింది. మీ చిన్నన్నకూ, మీ బావకూ చెప్పండి. ముందు ముందు మగపిల్లల చదువుల కోసం చేయగలిగింది చేద్దాం", అంది శైలజ.

"నా మనసులో ఉండే మాటనే కోడలు చెప్పింది", అనుకుంది కాంతమ్మ.

ఆ రాత్రి కాంతమ్మకు ఒకంతట నిద్ర పట్టలేదు. తనతో చెప్పకుండా శ్రీధర్ ఇంకా ఏదో దాచాడనే అనుమానం ఆమెను పీడించింది. 'స్వంత కడుపున బిడ్డల్లోనే ఎంత తేడాలున్నాయి? పెద్దవాడు ఏ పని చేసినా తనదే రైటు అనుకుంటాడు. రెండోవాడు కుదురు మనిషి, శ్రీధర్‌కు ప్రేమలున్నాయి, బిడ్డ పుట్టబోతోంది. కూతురు సంసారాన్ని గుట్టుగా నడుపుకుంటా ఉంది... ఈ పెద్దవాడు బాగుపడేదెట్లా?'

కలత నిదురలో కాంతమ్మ కళ్ళ ముందు ఏవేవో దృశ్యాలు...

'పెద్ద కొడుకు చుట్టూ పదిమంది పోగై ఉన్నారు. అందరూ తాగుతున్నారు, తింటున్నారు. జంభాలు పోతున్నారు.

బాంబుల మోతలు... కాలిపోతున్న వాములు... పైకి లేస్తున్న మంటలు...

ఆకాశంలో ఏవేవో వెలుగులు... వెలుగుల మధ్య పైకి లేచి రెపరెపలాడుతున్న స్వతంత్రం జెండా...

చూస్తున్న తెల్లవాళ్ళూ, నల్లవాళ్ళూ. అవేవో వేరే జెండాలు ఇళ్ళ మీద. ఆ జెండాల కర్రల్తో బాదుకుంటున్న మనుషులు... మంటలు... ఆ మంటల్లో పెద్ద కొడుకు...

"బయటికి రా...రా" అంటున్న శ్రీధర్... పెద్ద కోడల్నీ, పిల్లల్నీ ఓదారుస్తున్న శైలజ...

కాంతమ్మ ఉలికిపడి లేచింది. భయంతో వణికిపోయింది... మంచినీళ్ళు తాగి 'ఏం కాదులే - ఈ మొండి ప్రాణాలకు' అనుకుంటూ కళ్ళు గట్టిగా మూసుకుంది.

● (తొలకరి, ఏడవ ఆటా తెలుగు సమావేశ
విశిష్ట సంచిక, డలాస్, జూలై 2002.
- రచన, డిసెంబరు 2002.
- కథావాహిని, 2003.) ●

# అమ్మవారి నవ్వు

కార్తీకపు చలిగాలులు వీస్తున్నాయి. ఆకాశంలోని మబ్బుల రంగులు క్షణక్షణానికీ కదలికల్లో మారిపోతున్నాయి. దిశాంతరాళంలో తెలి మబ్బులు సంపెంగలూ, బియ్యంమల్లె ల్లాగున్నాయి. ఊదామబ్బులు, డిసెంబరు పూలలాగున్నాయి. **ఎరుపుడాలు,** పసుపుడాలు మబ్బులు, కుంకుమ చెండు మల్లెల్లాగా, కనకాంబరాల్లాగా, పచ్చ చెండు మల్లెల్లాగా ఉన్నాయి. ఆకాశం కింది రకరకాల మొక్కలు గాలికి కదిలి ఊగుతున్నాయి. ఆ కదలికలో పూల విడివిడి రంగులు కలుస్తున్న కదంబ వర్ణం ఉంది.

పూల కయ్యల పక్క, వేరొక కయ్యలో వేసిన పుదిన, మాచుపత్రి, మరువం, దవనం, కంగమొగ్గెర పచ్చపచ్చగా మంద్ర వాసనల్ని వెదజల్లుతూ, పువ్వుల చీరకు పచ్చటి కొంగులా ఉన్నాయి. గడ్డి పూలు తమ బూడిద రంగు ఎక్కడా? అని ఆకాశం మబ్బుల్లో వెదుకుతూ, అటూ ఇటూ కదులుతున్నాయి.

ఆకాశంలో కదలిపోతున్న మబ్బుల్ని చూస్తూ, పూలతోటల సువాసనల గాలుల్ని పీల్చుస్తూ, నలు దిక్కుల్నీ పరికిస్తూ, ఇంకా వేడెక్కని సూర్యుని కింద గట్టు మీద జాగ్రత్తగా అడుగులు వేస్తూ వస్తున్న శంకరరెడ్డిని, పూలతోటలో ఉన్న జాఫర్ కొంత దూరాన్నుంచే గుర్తించాడు - ఆ పంచె కట్టునూ, నడకనూ గుర్తించి.

"ఓయ్ శంకరన్నా! ఇట్లా ... ఇట్లా రా తిన్నంగ" అని బిగ్గరగా పిలిచాడు.

శంకరరెడ్డి ఆదరాబాదరా అడుగులు వేశాడు. ఉల్లాసంతో జాఫర్ ఉండే సంపెంగల కయ్యలోకి అడుగు పెట్టాడు. కుడి భుజంమీది పై పంచెను సరిచేసుకుంటూ సరదాగా అన్నాడు:

"జాఫరూ! నీ అదృష్టమే అదృష్టం. పూల తోటలో నువ్వెట్లా కన్పిస్తుండావో చెప్పేదా? ఏపుగా ఎదిగిన రెండు దోసిళ్ళ వెడల్పుండే సన్‌ఫ్లవర్ మాదిరుండావు."

"అబ్బో. నువ్వో అన్నా! ఇదుగో ఆకుపచ్చ అంచు తెల్లటి పంచెలో గన్నేరు పువ్వు మాదిరి ఉండావు," జాఫర్ నవ్వుతూ పొగిడాడు - మాటల్లో పోటీపడుతూ.

"జాఫరూ! పొగడ్తలోనన్నా నీ తోటలోని ఏ పువ్వుతోనో పోల్చగూడదా?" శంకరరెడ్డి చెణికాడు.

"శంకరన్నా! నిన్ను ఈశ్వరుడికి ఇష్టమైన పువ్వుతో పోల్చినా. నువ్వేమో మన వెలి భూముల రైతుల మాదిరి నన్ను పంట పువ్వుతో పోల్చినావు. సరికి సరా?"

"నువ్వేమీ మారలేదు జాఫరూ. మా దేవుళ్ళూ, వాళ్ళ ఇష్టాలూ కూడా నీకు తెలుసు," శంకరరెడ్డి బిగ్గరగా నవ్వాడు. శంకరరెడ్డి నవ్వుతో జాఫర్ నవ్వు జత కలిపాడు.

"మరిచినా, మరిచినా" అంటూ జాఫర్ చేతులు బార్లా చాపాడు. శంకరరెడ్డికి నవ్వు వచ్చింది. తానూ చేతులు చాచాడు. ఒకరినొకరు మూడుసార్లు గుండెలు హత్తుకున్నారు.

జాఫర్ కుశల ప్రశ్నలు వేశాడు:

"శంకరన్నా, వదిన బాగుందా? నీ కొడుకు, వాడి పేరేమి... ఆ హరీశ్వర్ బాగున్నాడా? ఇంజనీరింగు పూర్తి అయి ఉండాలే. అమెరికాకు పోవాలని ఉండాడా? ఉద్యోగంలో చేరినాడా? పెద్దమ్మ ఈశ్వరమ్మ బాగుందా? ఈ మధ్య పెదనాయన కాలం చేసినాడని విన్నా. నందలూరు స్కూల్లో టెన్త్‌లో మన క్లాస్‌మేట్ సుబ్బానాయుడు చెప్పినాడు, ఆ సంగతి. నేనేమీ పరాయివాడినా? మరీ దూరాభారంలో ఉండానా? చెప్పి పంపకపోతే పాయలే. దివసానికి రమ్మని ఒక కార్డు ముక్క వెయ్యకూడదా? పెదనాయన, మా నాయన ఒకరి కొకరు ప్రాణం ఇచ్చుకునేవాళ్ళని నీకు తెలీదా? మనిద్దరి మాదిరే వాళ్ళు. మా నాయన చచ్చిపోయినాక రోజులు బాగుండకపోయి, నువ్వు వద్దంటున్నా ఈ పక్కలకు - ఈ పల్లెకు వచ్చినాం - మా అత్తా, మామా పోరు పెడితే. మన ఊరు వదిలి ఇక్కడకొచ్చి అయిదేండ్లయింది."

జాఫర్ నిట్టూర్చాడు.

జాఫర్ ప్రతి మాటను గురించి ఆలోచిస్తున్న శంకరరెడ్డి ఉక్కిరిబిక్కిరయ్యాడు:

"అంతా బాగుండారు. నాయన సంగతి తెలపకపోవడం తప్పే" అని ఒప్పుకున్నాడు.

కొడుకుకు 'స్టూడెంట్ వీసా రాలేదు. సివిల్‌చేసి, ఏడాది కంప్యూటరు కోర్సులు చేసి, హెచ్1బి అనేసరికి అమెరికాలో అవకాశాలు సన్నగిలినాయి. ఇప్పుడు కెనడా ప్రయత్నాల్లో. ఆ దిగులులో ఇప్పుడు...' అని చెప్పలేకపోయాడు.

ఆ క్షణానికి కడుపులో రాని ఉత్సాహాన్ని పైకి తెచ్చుకొని కుశల ప్రశ్నలు వేశాడు:

"మా మరదలు జరీనా ఎట్లా ఉంది? ముసలమ్మ బాగుందా? ఆడపిల్లోళ్ళు ముగ్గురి పెండ్లిండ్లు చేసినావు. కూతుర్లూ, అల్లుళ్ళూ సౌదీలో సుఖంగా ఉన్నారా? ఆ రకంగా నువ్వు అదృష్టవంతుడివి."

"శంకరన్నా! ఎవరి బతుకులు వాళ్ళవి. ఎవరి నసీబులు వాళ్ళవి," జాఫర్ గొంతు వణికింది.

ఆ కలవరపాటును శంకరరెడ్డి గుర్తించి ఆత్రంగా అడిగాడు: "ఏంది అట్లా మాట్లాడతావు? ఏమైంది?"

జాఫర్ మాట మార్చాడు: "ముందు నువ్వింత హఠాత్తుగా వచ్చిన సంగతి చెప్పు. రెండేండ్లయింది మనం కలవక. మీ ఊర్లో మల్లా కొత్త గలాటాలేమన్నా నెత్తికి చుట్టుకున్నాయా? నేను నా మనుషుల్ని తీసుకురావాల్నా? నీ కోసం ఏం చెయ్యాలన్నా సరే చేస్తా..."

జాఫర్ ప్రేమకు శంకరరెడ్డి చలించిపోయాడు. కొన్ని నిమిషాలు గతంలోకి జారుకున్నాడు:

'పదేళ్ళ కిందట, తన తండ్రి మీద నాటుబాంబులతో, వేట కొడవండ్లతో జరగబోయిన దాడిని పసిగట్టి, చాకచక్యంగా జాఫర్ తండ్రి ఇమాం తప్పించినాడు. అప్పుడు విన్న దృశ్యాలు శంకరరెడ్డి మనసులో కదిలాయి. ఇమాం సాబు బొడ్డులో దాచుకున్న నాటు పిస్తోలుతో తన తండ్రిని ప్రమాదాన్నుంచి ధైర్యంగా తప్పించినాడని అప్పట్లో జనం చెప్పుకున్నారు. తన తండ్రే ఊర్లో కక్షలూ కార్పణ్యాలూ ఎందుకని **ఎదుటి పార్టీ వాళ్ళతో** రాజీ అయింది గుర్తుకొచ్చింది. ఈ పదేండ్లలో గ్రామ **రాజకీయాలు మారినాయి**; కాలం మారిపోయింది. ఇమాం సాబు చనిపోయినాడు; జాఫర్ కుటుంబంతో రాజంపేట పక్కల పల్లె చేరినాడు – కొత్తరకం బతుకు తెరువు వెతుక్కుంటూ...'

"ఏంది శంకరన్నా? ఆలోచనలో పడినావు. నేనడిగిందానికి చెప్పు?"

"అదేం కాదు జాఫర్. ఊర్లో ఏ గలాటలూ లేవు. ఇప్పుడు ఇక్కడికి మా చిన్నాయన కూతురు పెండ్లి విషయంగా వచ్చినా."

"ఏ చిన్నాయన? నారదుడు చిన్నాయనా? రేడియో చిన్నాయనా?"

జాఫర్ ప్రశ్నకు శంకరరెడ్డికి తెగ నవ్వు వచ్చింది. తన తండ్రి హయాంలో తంటాలు పెట్టి, తమాషా చూసే చిన్నాయనను నారదుడనీ, అక్కడి ఇక్కడి వార్తలు చేరవేసే చిన్నాయనను రేడియో అనీ నలువురూ ఛాటుగా అనుకుంటున్నది జాఫర్‌కు ఇంకా గుర్తుందన్నమాట!

"కాదులే, కాదులే" అంటూ శంకరరెడ్డి పొర్లి పొర్లి నవ్వాడు.

"ఇంకెవరు?" జాఫర్ గుర్తుతెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ అడిగాడు.

"మా నాలుగో అబ్బ హుసేన్ రెడ్డి – నీకు జ్ఞాపకమే గదా! మా జేజి పక్కీరమ్మ జ్ఞాపకం ఉందా? వాళ్ళ రెండో కొడుకు – వెంకటస్వామిరెడ్డి – ఆయన కూతురు పెండ్లి."

"చంపినావు పో. ఆయన తెలీకేమి? మనకు వయసు వచ్చేసరికే కర్నాటక వైపు కాంట్రాక్టులకు పోయినాడు. ఆయనేనా? ముందు కాంగ్రెస్‌లో ఉన్నాడు. తర్వాత తెలుగుదేశంలో చేరినాడు. ఇప్పుడు సంగతి..."

"అవు. ఆయనేలే. మన కుటుంబానికి ఏదో ఒక సాయం చేస్తానే ఉండాడు. ఇప్పుడు మండలాధ్యక్షుడు. మంచి పలుకుబడి సంపాదించుకున్నాడు. ఆయన కూతురు పెండ్లి. ముప్ఫయి లక్షల కట్నమిస్తున్నాడు. తెలంగాణ సంబంధం - వరంగల్ పక్క పల్లె వాళ్ళది. పిల్లోడు అమెరికాలో ఉన్నాడు. మన పిల్ల ఇంజనీరే గదా..."

"ఆ సంగతులు గొప్పగా చెప్తా ఉండావు. ఇంతకూ నేనూ, నువ్వూ చెయ్యాల్సింది ఏముంది?" జాఫర్ అసహనంగా అడిగాడు.

"పెండ్లి పనులు కొన్ని నా వంతు. వాటిల్లో నువ్వు చేసే పని ముఖ్యమైంది. ఈ మధ్య ఒక సెట్టిగారి పెండ్లికీ, ఇంకా ఎవరివో పెద్దాసాముల పెండ్లిండ్లకూ నేను పోయినాలే. ఆ పెండ్లి మంటపాలు ఎవరు కట్టినారని అడిగినా. 'పూల జాఫరు' అని పేరూ, ఊరూ చెప్పినారు. మనోడే అని తెగ సంతోషపడినా. ఇప్పుడు నేనొచ్చినా. ఆ పని నెత్తి మీద వేసుకొని, నీతోనే చెయ్యించాలని."

జాఫర్ ఆ మాటలకు పొంగిపోయాడు.

"పెండ్లి మండపం, హాలు, బయట అలంకరణ అంతా నీ చేతుల మీదనే సాగాల. చూసినోళ్ళు అదిరిపోవాల. వెంకటస్వామిరెడ్డికి మన కథంతా చెప్పలేదులే, పెండ్లిలో దిమ్మతిరిగిపోయేటట్లు చేస్తాంలెమ్మని, చేస్తావని..."

"పెండ్లెప్పుడు?"

"వారం రోజులుంది. నవంబరు 24."

"ఎక్కడ?"

"నువ్వు నీ పనితనం చూపిన చోటే, కడపలో." శంకరరెడ్డి కొంటెగా నవ్వాడు.

"టి.టి.డి కల్యాణ మండపంలోనా?"

"అవు."

"వారం రోజులు ముందు చెప్పి బతికించినావు. రాజంపేట, కడప, తిరుపతి మార్కెట్లు గిట్టుబాటు గాక ఏకంగా హైదరాబాదుకు పూలు పంపుతున్నాం- ఈ మధ్యన. ఎక్కువగా సంపెంగల్నీ, వాళ్ళు బంతి పూలనే చెండుమల్లెల్నీ, చామంతుల్నీ, మరువం, దవనం సరే అనుకో. ఈ సీజన్లో సంపెంగలకు గిరాకీ వచ్చింది."

"ఎంత పలుకుతున్నాయి?"

ఈ వారంలో కిలో పది రూపాయలు. రేపటి మాపటి కోతలకు ఏ రేటుంటుందో తెలియదు. అల్లాకూ తెలియదు. రాముడికీ తెలియదు. జాఫర్ హాస్య దృష్టిని శంకరరెడ్డి పట్టించుకోలేదు.

నీరసంగా అన్నాడు: "మా కాయగూరలకన్నా నీ పూలే నయం. ఆ మాటకొస్తే కొన్ని మిగతా పంటలకన్నా కూడా. మొన్న టమోటాలు పది కేజీల గంప ఒకటికి నాలుగు రూపాయలకమ్మినా."

"శంకరన్నా! ఈ రోజులు మీవీ కావు, మావీ కావు. దబాయించి, 'ధర ఇంతే, సరుకు ఇస్తే ఇవ్వు, లేకపోతే నీ చావు నువ్వు చావు' అనే గుత్త మొత్తంగా కొనేవాళ్ళ రోజులు. ఈ గవర్నమెంటుకు రోడ్లు ముఖ్యం, మనం కాదు. ఎవడి చేతిలో ఏ చక్రముందో చచ్చినా అర్థం కాదు."

"నీ చేతిలో చక్రం లేదా? రైతులందరి దగ్గరా కొని పంపవా?"

"శంకరన్నా! నేను పూల ఎగుమతిదారున్నే. నా పూల కొక ధరా, రైతుల పూలకొక ధరా కట్టలే నన్నా. పూల అమ్మకాల పట్టీలు నావీ, కొనేవాళ్ళవీ రైతుల ముందు పెట్టడం నా మతం. సాయం చేసినందుకు రైతులు ఎంత ఇస్తే అంత తీసుకుంటాను. ఈ సాయం చెయ్యబట్టే ఈ భూమి గుత్తకు దొరికింది..."

"కమీషనా?"

"ఆ పేరుతో పిలవద్దు. చేతికి చేతి సాయం. మాటకు మాట సాయం. నాకేదన్నా మిగిలేది, పెండ్లిండ్ల సీజల్లోనే. ఈ పెండ్లి మండపాల పనిలో – అదీ పెద్దాసాముల పెండ్లిండ్లు అయితేనే. మిగతా పూలల్లో మిగిలేది పెట్టుబడులకూ, గుత్తలకూ, కూలీలకూ, మా ముగ్గురి తిండికీ. పూల బతుకు ఒకటి రెండు రోజులే గదా?"

'జాఫర్ ఏమీ మారలేదు. తాను నొప్పించే ప్రశ్నలు వేసినాడేమో!' అని శంకరరెడ్డి అనుకున్నాడు. కొన్ని క్షణాలు మౌనం వహించాడు.

శంకరరెడ్డి భుజం తట్టి జాఫర్ అన్నాడు: "ఇంటికి పోదాం పద."

"జరీనానూ, ముసలమ్మనూ చూసి రెండు గంటల బస్సుకు పోతా. వచ్చేటప్పుడు బస్సు కండక్టరు చెప్పినాడు, రెండు గంటలకు తిరుగు బస్సు ఒకటి ఉందని."

"ఈ రాత్రికి ఉండు శంకరన్నా. పగటి పూట నీతో కలసి భోంచేయలేను." జాఫర్ ఉమ్మిని మింగుతూ అన్నాడు.

"జాఫరూ, నీ ప్రేమ తెలీదా? నీ దర్బారు తెలీదా? రాత్రికి కోడి అంటావు. దొరికితే మాంసం అంటావు. పలావు అంటావు. ఖైమా ఉండ లంటావు. నాయనా! కడపలో నాకు అర్జంటు పని ఉంది. నన్ను వదులు. ఇంట్లో వాళ్ళు గొడవ పెడుతుంటే, కార్తీక మాసంలో నీచు వద్దులెమ్మనుకున్నా"

"ఏం మతాలో, ఏం పండగలో, ఏం మాసాలో ఏమో? తినే తిండిలో పితలాటకాలున్నాయి." జాఫర్ మాటలో ఏదో అసంతృప్తి ధ్వనించింది.

జాఫర్ పక్క తోటలోని కనకాంబరాలను కోస్తున్న మహిళల వైపు శంకరరెడ్డి చూస్తూ జాఫర్ మాటల్ని పట్టించుకోలేదు.

తోటలు దాటి, ఊరుకు వెళ్ళే రోడ్డు చేరారు ఇద్దరూ. జాఫర్ జేబులోంచి అల్లిక టోపీ తీసుకుని తలకు పెట్టుకున్నాడు. శంకరరెడ్డి ఆశ్చర్యంగా జాఫర్ తలవైపు చూస్తూ, "ఇది ఇంతకు ముందు అలవాటు లేదే?" అని అడిగాడు.

"ఇదా? ఈ ఏడాదిగా అప్పుడప్పుడు ఈ పూల పని మీద హైదరాబాదు పోతున్నా. మొదటిసారి పోయినప్పుడు ఈ టోపీ గీపీ లేదు. రైతు మాదిరి పోతి. గడ్డమూ లేకపోయె. నాకొచ్చే ఉర్దూ మన కడపది. నా ఉర్దూ, నా యాసా విని పగలబడి నవ్వినారు, ఆ హైదరాబాదోళ్ళు. 'నువ్వు ముసల్మానువు కాదు పో' అన్నారు. హైదరాబాదు పూల వ్యాపారస్థులు. 'నేను ముస్లిమునే. అయితే ఏం చెయ్యాల?' అన్నాను. టోపీ అన్నా పెట్టుకో అన్నారు. ఇదీ జాఫర్ టోపీ కథ". జాఫర్ చెప్పిన తీరుకు శంకరరెడ్డి పగలబడి నవ్వాడు.

"మరి ఇప్పుడెందుకు ఆ టోపీ? పెద్దగా ఎండ కూడా లేదే. ఇది హైదరాబాదూ కాదు," శంకరరెడ్డి జాఫర్‌ను ఆట పట్టించడానికి అన్నట్లు అడిగాడు. జాఫర్ ఇల్లు రావడంతో శంకరరెడ్డికి జాఫర్ నుంచి సమాధానం రాలేదు.

జాఫర్ ఇంట్లో జరీనా, ముసలమ్మ చూపిన ఆపేక్షలు చూసి శంకరరెడ్డి ఉప్పొంగిపోయాడు. జరీనా ముందు కాళ్ళకు నీళ్ళిచ్చింది. కుర్చీ వేసింది.

మంచినీళ్ళ లోటా అందిస్తూ జరీనా అడిగింది:

"బావా! అందరూ బాగున్నారా? అక్క, పిల్లలు..."

జాఫర్ జేజి (నాయనమ్మ) బోసి నోటితో కుశల ప్రశ్నలు వేసింది. పాతకాలం సంగతులు ఎత్తుకుంది:

"శంకరయ్యా! మన ఊర్లో మేమున్నప్పటి ఆ రోజులు రమ్మంటే ఇప్పుడొస్తాయా? జాఫర్ అబ్బకు మీ అబ్బ (తండ్రి తండ్రి) ఆ ఫకీరు మాన్యం అయిదెకరాలు ఇప్పించె - దర్గా పూజలు చేసుకొమ్మని. ఆ ఫకీరు మాన్యానికి తగాదా వచ్చె. అది ఆంజనేయుడి మాన్యమని కరణమయ్య పుల్లలు బెట్టె. రెడ్డి (గ్రామ మునసబు) తోడాయె. అసలు కడుపు కుట్టు వేరు. మీ అబ్బ, జాఫర్ అబ్బ దోస్తీ చూసి వాళ్ళకు కన్నుగుట్టింది. దానికితోడు ఒకమారు కరణమయ్య తన భూమి దున్నడానికి ఎద్దుల్ని రమ్మనె. మీ భూమిలో దున్నకం పూర్తయిందాకా రానని జాఫర్ అబ్బ. ఇంకోసారి వామి వెయ్యడానికి రెడ్డి పిలిచె. మీ వామి పని ఉందని చెప్పె జాఫర్ అబ్బ. కరణమయ్య సైతాను. రెడ్డి మాదర్చోదు. పంచాయితి పెట్టిరి. పితలాటకం చేసిరి. కరణం భూమి లాక్కునె. ఆంజనేయుడి గుడిలో దీపం పెట్టకపాయె. ఈ మీ అబ్బో, జాఫర్ అబ్బో వాళ్ళు బతికినన్నాళ్ళూ దీపం పెట్టిరి..."

"దాదెమ్మా! యాభై ఏండ్ల నాటి ఊసులెందుకు?" జాఫర్ అడ్డు తగిలాడు.

"చెప్పనీలే జాఫరూ. కడుపు మంట ఒకంతట ఆరేది కాకపాయె," శంకరరెడ్డి ప్రోత్సహించినట్లయింది.

ముసలమ్మ పాత చరిత్రను తవ్విపోయటానికి మళ్ళీ మొదలుపెట్టింది:

"భూమి పాయె. జాఫర్ అబ్బ కాలం చేసె. మీ అబ్బ కాలం చేసె. మీ నాయనా, జాఫర్ నాయనా అన్నదమ్ముల మాదిరి బతికిరి. మీరిద్దరూ అన్నదమ్ముల మాదిరే పెరిగిరి. కరువులొచ్చె. కాటకాలొచ్చె. కచ్చెలొచ్చె... ఇక్కడికి చేరుకుంటిమి..."

"ఇక ఛాల్లే దాదెమ్మా! శంకరన్న అన్నం తిని బస్సుకు పోవాల" అని జాఫర్ అనటంతో ముసలమ్మ ఆగి, ఆకు వక్కా సున్నం వేసి వక్క రోలులో దంచుకోవడం మొదలుపెట్టింది.

"సేమ్యా పాయసం చేస్తా బావా. నీ కిష్టం," జరీనా నవ్వుతూ వంటగదిలోకి వెళ్ళింది.

"శంకరన్నా! పదైదు నిమిషాల్లో ఇక్కడుంటా. ఏమనుకోకు. ఈ లోగా వంట పూర్తవుతుంది. పప్పన్నమేలే. మసీదుకు వెళ్ళి నమాజు చేసొస్తా."

"నమాజా? ఈ పల్లెలో మసీదుందా?" శంకరరెడ్డి ప్రశ్నలకు జాఫర్ ఇబ్బందిపడ్డాడు.

"ఆఁ. కువాయిట్, సౌదీ చందాల్తో ఈ మధ్య మసీదు కట్టినారులే. పోటీల్లో పల్లె జనం పడడంతో, ఒక కొత్త గుడి, చర్చి కూడా వచ్చినాయి. రంజాన్ రోజుల్లోనన్నా మసీదుకు రమ్మని సాటి ముస్లిం ముసలోళ్ళు, కుర్రాళ్ళ రంపు. మీ నాయనా, మా నాయనా చిన్నప్పుడు మనిద్దర్నీ దగ్గర కూర్చోబెట్టుకుని వేమన పద్యాలు నేర్పినారు, గుర్తుందా? మా నాయన ఎన్నోసార్లు ఈ పద్యం చదివేవాడు:

పసుల వన్నె వేరు పాలేక వర్ణమౌ
పుష్పజాతి వేరు పూజ ఒకటె
దర్శనములు వేరు దైవంబు ఒక్కడే
విశ్వదాభిరామ వినుర వేమ!

ఈ పద్యం ఇప్పుడు గుర్తుందా?"

శంకరరెడ్డి హాస్య ధోరణిలో అందుకున్నాడు:

"మీ నాయన నేర్పించిన ఆ పద్యం గుర్తుంది. 'ఒరె ఈ పద్యం కూడా నీ కొడుకూ, శంకరుడూ నేర్చుకోవాల' అని మా నాయన చెప్పిన పద్యం నీకు గుర్తుందా? అదే...

మక్కకు జననేల? మగుడ తా రానేల?
ఏకమైన కర్త యిందు లేడొ
అన్నిట పరిపూర్ణు డల్లా మహమ్మదు
విశ్వదాభిరామ వినుర వేమ!"

ఇద్దరూ పద్యాలు పాడి నవ్వుకుంటుంటే, ముసలమ్మ బోసినోటితో మరిమరీ నవ్వింది.

జాఫర్ నవ్వుకుంటూనే బయటికి వెళ్ళాడు. జరీనా పెరడులోకి వెళ్ళడాన్ని ముసలమ్మ గమనించింది. హీనస్వరంతో అంది: "శంకరయ్యా! జాఫరుకు చిన్న కూతురుదే పెద్ద దిగులైపోయింది." ముసలమ్మ కొంగుతో కళ్ళు ఒత్తుకుంది.

"మంచి సమ్మందమని సిద్దోటానికిస్తిమి. వాడు సౌదీకి తీసుకుపోయినాడు. బాగుండారని మురిసిపోతాంటే, ఆర్నెళ్ళకే తలాఖ్ ఇచ్చినాడు. ఒకర్నో ఇద్దర్నో కట్టుకున్నాడంట! ఆ బిడ్డ ఏమైందో, ఎక్కడుందో తెల్దు. రెండేండ్లయింది. అజా పజా లేదు." ముసలమ్మ విన్పించీ విన్పించనట్లు రోదించసాగింది. జరీనా అలికిడి వినటంతోనే మాటలు ఆపింది.

'ఆ పెళ్ళి సంబంధం ఖాయం చేసినప్పుడు తాను కూడా ఉన్నాడు. ఎంత అందమైన పిల్లో రజియా! ఆ పిల్ల నవ్వు ప్రత్యేకంగా ఉండేది. కష్టాలు ఎందుకు చుట్టుకుంటాయో, మంచి మనుషులకు కూడా? హరీశ్వర్‌తో తనకు బాధలు. వాడికి తలకాయ చెడిపోతాంది. ఉద్యోగం లేదు. రెండు లక్షలకు పైగా వాడి చదువులకు ఖర్చయింది. మూడు లక్షలు అప్పుంది. వెంకటస్వామిరెడ్డి 'ఏదో ఒకటి చేస్తాం, చేస్తాం' అంటున్నాడు. తన బాధలు తనకున్నాయి. పెండ్లి పనులు నెత్తికెత్తుకోవడం అందుకే.'

శంకరరెడ్డి తనలోకి జారుకున్నాడు.

జాఫర్ వచ్చీరావటంతోనే, జరీనా దస్తర్ పరిచింది. శంకరరెడ్డికి భోజనం ఏర్పాటు చేసింది. జాఫర్ ఎదురుగా కూర్చొని, "తిను, తిను. పాయసం ఇంకొంచెం..." అంటూ బలవంతం చేశాడు. జరీనా నవ్వుతూ శంకరరెడ్డికి మారు వడ్డించింది.

"జాఫర్! అమ్మా జరీనా! కడుపు నిండిపోయింది. జాఫర్‌ది ఉపవాసం. నాది కడుపు నిండిన భోజనం."

"రాత్రికి ఉండి రేప్పొద్దున పోవచ్చు గదా బావా!"

"రాత్రికి ఉంటే నీ మగడి దెబ్బకు మూడు రోజులు ఇక్కడే ఉండిపోవలసి వస్తుంది – ఆయాసానికి తట్టుకోలేక. పనుంది. పోవాలలే అమ్మా, వస్తానమ్మా, వస్తాను జేజీ", అంటూ బయలుదేరాడు.

చెప్పులు వేసుకుంటూ జాఫర్ వైపు తిరిగి అన్నాడు:

"ఇరవై మూడో తేదీ మధ్యాన్నానికే పూలతో, నీ మనుషుల్తో కడప చేరుకో. ఆ టైంకు నేను నిన్ను కల్యాణ మండపంలో కలుస్తా. ఇరవై నాలుగు పెండ్లి. నువ్వు ఏం పూలు, ఏం ఆకులు గడతావో, ఎట్లా గడతావో అది నీ ఇష్టం. చూసిన వాళ్ళు మాత్రం అదిరిపోవాల. ఇదిగో ఈ మూడు వేల రూపాయల అడ్వాన్సు. పని అయ్యాక నీవెంత చెబితే అంత తీసుకుందువు," డబ్బును జాఫర్ జేబులో చనువుగా శంకరరెడ్డి పెట్టాడు.

"అంతా బాగుంది. పెండ్లి కొడుకు, పెళ్ళి కూతురు పేర్లు మాత్రం నువ్వు చెప్పలేదు శంకరన్నా!" జాఫర్ నవ్వుతూ శంకరరెడ్డికి జ్ఞాపకం చేశాడు.

"ఈ మధ్య బుర్ర సరిగా పనిచేయడం లేదులే." అంటూ శంకరరెడ్డి ప్లాస్టిక్ చేతి సంచిలోని పెండ్లి కార్డు తీసి జాఫరుకిచ్చాడు.

"పెండ్లి కొడుకు పేరు మనుగాల మదన్‌రెడ్డి, పెండ్లి కూతురు పేరు నళిని. మర్చిపోవద్దు. కార్డు చూడు."

జాఫర్ కార్డును పరికించాడు. పసుపు రంగుతో, నీలం రంగు అక్షరాలతో కార్డు అట్టహాసంగా ఉంది.

శంకరరెడ్డి ఎక్కిన బస్సు కదులుతూనే, కల్యాణ మండపాన్ని ఏ పద్ధతుల్లో అలంకరించాలో అని ఆలోచిస్తూ జాఫర్ పూలతోట వైపు నడిచాడు.

పెళ్ళికి ముందు రోజు, ఆ సాయంత్రం, రాత్రి, మరుసటి ఉదయం ఎనిమిదింటి దాకా జాఫర్, జాఫర్ తెచ్చుకున్న వాళ్ళు నడుం వంచింది లేదు. ఆ పని చూస్తూ ఉంటే శంకరరెడ్డికి ఆశ్చర్యం వేసింది.

రంగురంగుల పూలల్లో ఒదిగిన ఆర్చిలో స్వాగతం, వధూవరుల పేర్లు, గేటు దగ్గర నుండి హాలు వరకు అర్ధగోళాకారంలో చమ్కీ దండల మధ్య పూలమాలలు, గేటు దగ్గరే ఆహ్వానితులకు ఇచ్చేందుకు ఏర్పాటు చేసిన సెంటు జల్లిన గులాబీలు, హాలు ముంగిట్లోని నిలువెత్తు సీతారాముల, వాళ్ళ పాదాల దగ్గర ఆంజనేయుల పుష్ప నిర్మిత చిత్రాలు శంకరరెడ్డికి అమోఘంగా కన్పించాయి.

పెండ్లి మండపం వెనుక తొమ్మిది అడుగుల ఎత్తు, పది అడుగల వెడల్పులో పచ్చ చెండు పూల భిత్తికలో పొదిగిన వెంకటేశ్వర పద్మావతుల చిత్రాలు - ఏడు అడుగులు, ఆరు అడుగుల ఎత్తున్నవి అపూర్వంగా తోచాయి.

వెంకటేశ్వరుడి మణిమయ రత్నకిరీటం, ముఖం, కర్ణాభరణాలు, శంఖచక్రాలు, కౌస్తుభం, వకుళాభరణం, అభయవరదహస్తాలు, పద్మావతి కనకాంబరపు చీర కట్టు, మంగళసూత్రం కళ్ళకు కట్టినట్లు చెయ్యడానికి వాడిన సుగంధాలు వెదజల్లే రంగురంగుల పూలూ, పత్రాలూ చూసి శంకరరెడ్డి దిగ్భ్రాంతికి గురి అయ్యాడు.

పెళ్ళికి తరలి వచ్చిన వాళ్ళందరూ పుష్పాలంకరణల, పుష్ప వేదికల గంభీర సౌందర్యానికీ, కళాభిరుచికీ ఎంతగానో ముగ్ధులయ్యారు. అదేదో దేవలోకం సెట్టింగుల్లా ఆ దృశ్యాలు పెళ్ళికి వచ్చిన కుర్రకారుకు తోచాయి. పెళ్ళి వేదిక వెనుక భారీగా, కొట్టవచ్చినట్లు కన్పిస్తున్న వెంకటేశ్వర పద్మావతుల పుష్ప చిత్రాలు చూస్తూ, కాబోతున్న వధూవరులను సైతం కొందరు విస్మరించారు.

కళ ఒక అద్భుత భ్రాంతి. భ్రాంతిని మింగే ఒక కఠిన వాస్తవం. పెళ్ళి జరిగిపోయింది. పెళ్ళి విందులోని రకరకాల వంటల్లో ఏది, ఎంత వడ్డించుకోవాలో, ఏవేవి ఏ వరుసల్లో ఉన్నాయో, విందులో కన్పించే వాళ్ళల్లో ఎవరెవర్ని పలకరించాలో వెతుక్కునే ఆత్రంలో బంధుమిత్ర సపరివారం పడింది. పెళ్ళికి తరలివచ్చిన చిన్నా,

పెద్దా రాజకీయ నాయకులూ, కాంట్రాక్టర్లూ 'బాగానే ఖర్చు పెట్టాడు' అనుకున్నారు. పలకరింపులు, చిన్న చిన్న రహస్య మంతనాల పర్వాలయ్యాక భోంచేసి ఎవరి దారి వాళ్ళు వెళ్ళిపోయారు. సుందర పుష్పకళా లోకాన్ని చాలా మంది మరచి తమ తమ దారుల్లో తిరిగి వెళ్ళారు.

వరుడి బృందం వెంట విశిష్ట ఆహ్వానితుడిగా వచ్చిన సుందర రామానందులు పుష్ప చిత్రాలను తదేకంగా చూస్తున్నాడు. కుడివైపు వరుడి తండ్రి, ఎడమ వైపు వధువు తండ్రి, స్వామి ఏం మాట్లాడుతారోనని ఎదురు చూస్తున్నారు.

'వియ్యంకుడు బి.జె.పిలో ఉన్నాడు. స్వామి వియ్యంకుడికి సద్గురువు. వీళ్ళనుకుంటే వచ్చే ఎన్నికల్లో పార్లమెంట్ టికెట్ తనకు దొరకక తప్పదు – పువ్వు గుర్తు మీద' అని వెంకటస్వామిరెడ్డి ఆలోచనలో ఉన్నాడు.

స్వామి హఠాత్తుగా అడిగాడు: "ఈ పుష్ప దైవాలను మనముందు నిలిపిందెవరు?"

వెంకటస్వామిరెడ్డి ఉలిక్కిపడ్డాడు. తడబడ్డాడు. 'ఈ ఏర్పాట్లు చూసిన శంకరరెడ్డి ఎక్కడున్నాడో వెంటనే రమ్మన'మని తన మనిషిని పిలిచి చెవిలో చెప్పాడు. సుందర రామానందుల వైపు తిరిగి, "లోపాలు ఏమైనా ఉన్నాయా స్వామీ?" అన్నాడు.

"లేవు. ఒక గొప్ప హిందువు సంస్కారం ఆ మూర్తుల్లో కన్పిస్తోంది. అమ్మవారి పెదాల మధ్య విరిసీ విరయని ఆ నవ్వును చూపడం సాధకులైన మన హిందూ కళాకారులకే సాధ్యం."

ఈలోగా శంకరరెడ్డి పరుగెత్తుకుంటూ వచ్చాడు – కొడుకు హరీశ్వర్‌ను కూడా వెంటబెట్టుకొని. ఒగరుస్తూ, "ఏదన్నా తక్కువ జరిగిందా అన్నా?" అని అడిగాడు. వెంకటస్వామి రెడ్డి పక్కన మల్లెపువ్వులాంటి జుబ్బా, పైన కాషాయపు రంగు ఓవర్‌కోటు, కాషాయపు రంగు బార్డరు తెల్లటి పంచెకట్టు, నుదట కుంకుమబొట్టు ఉన్న స్వామిని శంకరరెడ్డి ఆ హడావిడిలో గుర్తించలేదు. మరోపక్క వ్యక్తిని కూడా.

శంకరరెడ్డినీ, హరీశ్వర్‌నూ సుందర రామానందులకు వెంకటస్వామిరెడ్డి పరిచయం చేశాడు.

సుందర రామానందులు అతి శాంతంగా అడిగారు: "ఈ పుష్ప ప్రతిమలను ఎవరు రూపొందించారు?"

"మా జాఫర్ చిన్నాయన" హరీశ్వర్ మాటల్ని నొక్కుతూ అన్నాడు. ఆ నొక్కులను సుందర రామానందులు గుర్తించాడు. ఆయనకు నోట మాట రాలేదు. 'ఆ నవ్వు ఆ నవ్వు' అని గొణుక్కున్నాడు ఎదుటి వాళ్ళకు విన్పించకుండా.

హాలు బయట ఒక మూల ఇరవై ఆరు గంటల ఉపవాసంతో, పనితో అలసిపోయి గోనె పట్టలు పరచుకొని, వాటి మీద జాఫర్ పడి నిద్రపోతున్నాడు.

● ఇండియాటుడే, 28 జనవరి 2003. ●

# దగ్గరైన దూరం
# దూరమైన దగ్గర

స్వదేశ ప్రయాణం తలపెట్టినప్పుడే వీరభద్రుడికి ఒక సందేహం వచ్చింది. 'ఈ ఇద్దరు పిల్లలూ తాము పుట్టిపెరిగిన సీమలోని ఆ పల్లెల గాలికీ, ఆ నేలకూ, ఆ తిండికీ, ఆ దుమ్ముకూ, ఆ ఎండలకూ, ఆ మొరటు ప్రేమలకూ, ఆ భాషకూ, ఆ యాసకూ తట్టుకుంటారా? మూడు వారాలు అక్కడ ఉండగలుగుతారా? ముఖ్యంగా బుద్ధితెలిసిన లోహి ఇమడగలదా?' అని వీరభద్రుడి సందేహం. తనకు కలిగిన సంకోచం గురించి అర్ధాంగి సరస్వతికి చెప్పాడు.

సరస్వతి మనసులో కూడా ఆ అనుమానం తొంగిచూడకపోలేదు. అయితే, నిబ్బరంగా ఆమె చిన్న ఉపన్యాసం ఇచ్చింది:

"అక్కడ మనం పుట్టినాం. పెరిగినాం. మన దేశంలో మనవాళ్లున్నారు. లోహి అక్కడ పుట్టింది. తొమ్మిదేండ్లు ఇక్కడ పెరిగింది. లీనా ఇక్కడే పుట్టింది. ఇద్దరికీ ఇండియా తెలియదు. మన ఊర్ల సంగతులు అసలే తెలీవు. ఇంత కాలంగా మనం మన వాళ్లకు దూరంగానే ఉన్నాం. ఇంటికి డబ్బులు పంపటమొక్కటే ప్రేమ కాదు. కడుపులో దాచుకున్నది చెప్తా. నాకూ మా అమ్మానాన్నలను చూడాలని ఉంది. వాళ్లకు పిల్లలను చూపాలని ఉంది. ముందు ముందు వీళ్లకు పెళ్ళిళ్లు కావాలన్నా అక్కడి బంధాలు అవసరం. పైగా మనమేమీ వీళ్లను అమెరికన్ల మాదిరి పెంచలేదు."

"నిజమే. అక్కడి ప్రభావాలు, పరిస్థితులు పిల్లల మీద ఏమైనా..." వీరభద్రుడు నసిగాడు.

"ఉండవచ్చు. ఉంటాయి. ఎప్పటికైనా మనం అక్కడి వాళ్లమే" అంది సరస్వతి.

'అమెరికన్ సమాజం ఇచ్చిన సదుపాయాల్లో, సుఖాల్లో ఈ పిల్లలు పెరిగినారు - ఐదు గదుల ఇల్లూ, రెండు కార్లూ, కావలసిన బొమ్మలూ, బట్టలూ అన్నీ... కానీ అక్కడ...'

వీరభద్రుడి ఆలోచనలు పరిపరి విధాలుగా సాగాయి. ఏడేళ్ల తన చదువుల కష్టాలూ, అక్కడికి అక్కడ సాగిన బతుకూ, ఇప్పటికి సిద్ధించిన ఒక రకం స్థిరత్వమూ గుర్తుకొచ్చాయి. ప్రవాసి మనస్తత్వంలోని ద్వైదీభావంతో వీరభద్రుడు కొట్టుకుపోయాడు. ఇద్దరు ఆడపిల్లల భవిష్యత్తూ, సరస్వతి అన్న 'ఎప్పటికైనా మనం అక్కడివాళ్లమే' అన్నమాటా మనసును తొలిచాయి. వీరభద్రుడి శంక సగానికి పైగా తొలగిపోయింది.

కూతురు లోహిని అడిగాడు. లోహి తన అంగీకారాన్ని తెల్పుతూ అంది:

"ఇండియా చూడాలని ఉంది. గ్రేట్ కంట్రీ కదా నాన్నా! అక్కడ దేవాలయాలు, పెద్ద పెద్ద కోటలు. నేను చదివిన, మహాభారతం, రామాయణం, పంచతంత్రం, బుద్ధుడి జాతక కథలు, బీర్‌బల్ కథలు, అవన్నీ అక్కడివే గదా? నువ్వూ చెప్పినావు. ఇలియడ్, ఈసప్ ఫేబుల్స్ కంటే మన కథలే బావుంటాయి. తాతయ్యలనూ, నాన్నమ్మనూ, అమ్మమ్మనూ చూడాలని ఉంది. అక్కడ అందర్నీ చూడాలని ఉంది. పోదాం నాన్నా."

అప్పుడప్పుడే మాటలు వస్తున్న రెండేళ్లు నిండిన లీనాకు అక్క తెలుగు మాటలు అర్థం కాలేదు. కానీ 'ఇండియా, తాతయ్య, నానమ్మ, అమ్మమ్మ' అర్థమయ్యాయి.

"ఇండియా... ఇండియా... తాత, నానమ్మ, అమ్మమ్మ..." అని ముద్దు ముద్దుగా చప్పట్లతో తన సంతోషాన్ని ప్రకటించింది.

అపేక్షలూ, బంధుబంధాలూ కొత్త ఊపిరినీ, ఉత్సాహాన్నీ పిల్లల్లో తేవచ్చు అని వీరభద్రుడు సమాధానపడ్డాడు. అమెరికాలో తనుంటున్న ప్రదేశంలోని వారాంతాల వినోద సంస్కృతితో విసిగిపోయి ఉన్నారు.

పదేళ్ల అనంతరం నలుగురూ జన్మభూమిలో, రామాపురం గ్రామంలో అడుగుపెట్టారు. తల్లిదండ్రులూ, అన్నావదినెలూ అమితానందపడ్డారు. అమెరికా వీరభద్రుడొచ్చాడని బంధువులూ, బాల్య స్నేహితులూ పలకరింపులకు వచ్చారు. "అమెరికా పిల్లోళ్లు చానా బాగుండారు. వాళ్ల గౌన్లూ అవీ ఇంకా బాగుండాయి", అని వాళ్లను ఆ వీధిలో చూచిన పిల్లందరూ ముచ్చటించుకున్నారు. వాళ్లతో ఎప్పుడు ఆడుకుందామా అని కుతూహలపడ్డారు. ముఖ్యంగా లోహి, లీనా ఈడుల్లోని బాలికలు. తమతో కూడా ఆడుకుంటే బాగుంటుందని మగపిల్లలు అనుకున్నారు.

ముందటి రెండు దినాలలో లాగానే, రాత్రి ఇంటి ముందరి బయలులో మంచాలు వేసుకొని పడుకున్నారు. లోహి, ఆకాశం వైపుచూస్తోంది. లీనాకు చూపిస్తూ అంది.

"లీనా... లీనా అబ్బ! ఎన్ని స్టార్లో చూడు..."

లీనా ఆ పాటికే నిద్రలో ఉంది. లోహి మంచం దిగి, పక్క మంచంలో పడుకొని బాల్య స్మృతుల్ని నెమరు వేసుకుంటున్న తండ్రిని తట్టి అడిగింది:

"నాన్నా! డాలాస్ ఆకాశంలో ఇన్ని స్టార్స్ ఎందుకని కనబడవు?"

వీరభద్రుడిలో ప్రవాసాంధ్ర సంస్కారం మేల్కొంది.

"స్టార్స్ అనవద్దు లోహీ. చుక్కలు అనాల"

లోహి నవ్వింది. ఇంట్లో తెలుగు, బయట ఇంగ్లీషు.

"సరే చుక్కలు. ఇక్కడ ఎందుకిన్ని ఉన్నాయి?" అంది.

కూతురు ప్రశ్నకు వీరభద్రుడు ఆశ్చర్యపోయాడు. తమ ఇంటి వెనుక హరితవనంలో కూర్చొని ఎన్నో మార్లు డాలాస్ ఆకాశం వంక తానూ చూడకపోలేదు. కానీ చుక్కల్ని లెఖ్ఖ గట్టలేదు.

"డాలాస్‌లో ఇన్ని చుక్కలు లేవా లోహి తల్లీ?" అని అడిగాడు.

"ఊహు... ఒకటి, రెండు, మూడు... మబ్బులు చాలా చాలా కన్పడేవి."

లోహి అన్నది నిజమే. జ్ఞాపకం వస్తోంది. ఇటుక, ఊదా, పసుపు, నీలం రంగుల మబ్బులు ఈ రుతువులో కన్పించేవి. వర్షం ఉన్నట్టుండి దుమికేది. ఆకాశం నల్ల మోడమేసి, మధ్యమధ్య తెరపి ఇచ్చినా ఒకటే చినుకులు, వాన! ఒకరోజు సాయంత్రం నడకలో అప్పుడే తొంగి చూచిన రెండు నక్షత్రాల్ని చూసి లోహి వాటి పేర్లను అడగడం వీరభద్రుడి స్మృతిలో మెదిలింది. వాటి అసలు పేర్లు తనకు తెలియక "ఆ పడమటి వైపుండే దానిపేరు జార్జిబుష్, ఆ వైపు ఎదురుగా ఉండేది టోని బ్లెయిర్" అని అన్నాడు. లోహి పకపకా నవ్వింది.

తండ్రి పలక్కపోవడం చూసి లోహి తన మంచం చేరుకుంది. నిద్రలోకి జారుకుంది.

వారం, పది దినాలు పిల్లలు ఏ మారాములూ చేయలేదు. తాగేందుకు కాచి చల్లార్చిన వేణ్ణీళ్లు తప్ప, ప్రత్యేకంగా ఇవే కావాలని వాళ్లు అడగలేదు. సెరియల్స్, బేగల్స్, పాస్తా, డోనట్స్, వాఫెల్స్, నూడుల్స్, పిజా అంటూ అమెరికాలో అప్పుడప్పుడు లోహి అడిగేది. ఇక్కడ అడగలేదు. శుభ్రంగా పెట్టింది ఇద్దరు పిల్లలూ తిన్నారు - పొట్టేలు మాంసంతో సహా. కొత్త స్నేహితులు, కొత్త పరిసరాలు కొత్త కొత్త ఆటలు, కొత్త అనుభవాలు బుద్ధికి సరిపడితే పిల్లలు సులభంగా సర్దుకుపోతారు అని సరస్వతీ, వీరభద్రుడూ అనుకున్నారు. పిల్లలు మనలో ఎంత బాగా కలిసిపోయారు అని ఇంటిల్లిపాదీ సంతోషపడ్డారు.

ఆషాఢమాసం. ఎండలు డాలాస్ ఎండల్లాగానే ఉన్నాయి. కాకపోతే నల్లమోడాలు కన్పించలేదు. ముంగారి వానలు ఇంకా తొంగి చూడలేదు.

లోహీ, లీనా తమ ఈడు పిల్లలతో కలసి ఆడుకున్నారు. కట్టిన బట్టల్లో తేడా లేకుండా సరస్వతి చూసింది. ఊళ్లోని పిల్లలు వాళ్ళతో కలసి తిరగడంలో, ఆడుకోవడంలో ఎంతో ఉత్సాహాన్ని చూపారు. లోహి తెలుగులో మాట్లాడడం వాళ్లకు బాగుంది. మూడు మైళ్ల దూరంలోని కాన్వెంటుకు వెళ్లే పిల్లలు కూడా బిందెలతో నీళ్లు పట్టుకోవడం, చంకల్లోనో, భుజాల మీదుగానో మోసుకుపోవడం... అన్నీ లోహికి కొత్తగా కన్పించాయి. కొత్తగా కన్పించిన ప్రతిదాన్ని గురించీ, పల్లె స్నేహితురాళ్లను అడిగేది. వాళ్లు చెప్పినవి గుర్తుపెట్టుకునేది. తండ్రిని వాటి గురించి అడిగేది. అవసరమైన చోట్ల ఇంగ్లీషులో చెప్పించుకునేది. అర్థం చేసుకోవడానికి ప్రయత్నించేది. తాను చదివిన కథల్లో 'ఇవి' 'ఇవి' లేవు అనుకుంది.

తాముంటున్న ప్లేనోలో వీటిని వేటినీ చూడలేదు. చదవనీ, చూడనీ లోకం కంటే అనుభవం పిల్లల్ని ఆకర్షిస్తుంది, ఆలోచింపచేస్తుంది. లోహి విషయంలో జరిగింది అదే, అనుకున్నాడు వీరభద్రుడు.

ఒకటి రెండుసార్లు డౌన్‌టవున్లో చూసిన నల్లజాతి వాళ్ల పిల్లల్లాగా పేదగా, మురికిగా ఇక్కడి పిల్లలు లోహీకి కన్పించారు. బాధపడింది. కల్లంలో కుక్కల్ని చూసి భయపడింది. అసహ్యించుకుంది. ఎనుములు పేడ వేసుకుంటూ ఇంట్లోంచి వీధిలోకి వెళ్లడాన్ని చూసి ఏవగించుకుంది. ఇంటి వెనుక దిబ్బనూ, దిబ్బలోంచి వచ్చే గంజూ, పేడకళ్ల వాసననూ చూడలేకపోయింది; భరించలేకపోయింది. పాలు పిండడం, మజ్జిగ చిలకడం సరదాగా కన్పించాయి. నాగలబండ్లను ఎద్దులు లాగడం చూసి ముచ్చటపడింది. కల్లంలో కంకుల గుండు వల్ల ఏం ప్రయోజనం ఉండేదో తెలుసుకొంది. దాని ఉపయోగం ఇప్పుడు లేదని గ్రహించింది. వాములు డాలాస్ పొలాల్లో కన్పించినట్లు – ఆ కంకుల గుండుల్లాంటి హే స్టాక్స్ – కన్పించినట్లు ఎందుకని లేవు? అని ప్రశ్నించుకుంది.

మినరల్ వెల్స్ వెళ్లే దారుల్లో చూచిన రాంచ్‌లలో, రెడింగులో ఉన్నప్పుడు చూచిన బార్నులలో లోహి కల్లాలను, కల్లాల వెనుక పొలాలను కూడా చూసింది.

ఒక సెలవురోజున ఇద్దరు స్నేహితురాళ్లు తమ స్కూలును చూపించారు. అక్కడి అనుభవం లోహిని దిగ్భ్రాంతికీ, జుగుప్సకూ గురి చేసింది.

ఒక స్నేహితురాలు అంది:

"ఉండు లోహీ! ఇప్పుడే వస్తా."

"ఎక్కడికి?"

ఆ అమ్మాయి కుడిచేతి బొటన వేలు పక్కవేల్ని వంచి చూపించింది.

"అంటే."

"నీ కొస్తే నా వెంట రా" అంది స్నేహితురాలు.

లోహికి అదేదో అర్థమయింది. అర్థం కాలేదు. స్నేహితురాలి వెంట నడిచింది.

స్కూలు ఆవరణలో ఒక మూల అటు ఇటు చూసి ఆ స్నేహితురాలు కూర్చొని, మునిగాళ్ల వరకూ పావడా కప్పుకుంది. కాసేపయ్యాక లేచింది.

"ఏం చేసినావు?" అని లోహి అడిగింది.

ఆ అమ్మాయి సిగ్గుపడింది. చెవిలో మెల్లగా చెప్పింది.

"ఉచ్చలు పోసినా"

"అంటే"

"ఒంటికి", అంది పక్కనున్న మరో స్నేహితురాలు నవ్వుతూ.

"అంటే? ఏమిటో చెప్పు?" అంది లోహి తికమకపడుతూ.

స్నేహితురాళ్లు అటూ ఇటూ చూశారు. దూరంగా నిలబడే మూత్ర విసర్జన చేస్తున్న ఒక పిల్లవాణ్ణి లోహికి చూపించారు. ఆ దృశ్యం చూసి లోహికి వెగటు కలిగింది.

'ఇక్కడ రెస్ట్‌రూమ్స్ ఉండవా?' అంది.

'అదేమమ్మా?' అని పిల్లలిద్దరూ అడిగారు.

'షిట్' అంది లోహి.

'ఏందో ఈ అమెరికా పిల్ల' అనుకొని నవ్వుకుంటూ 'ఇండ్లకు పోదాం పా' అన్నారు. అందులో ఒక అమ్మాయి అంది:

'నీకేమమ్మా చుట్టానివి. నేనింటికి పోయి బోరు నీళ్లు తేవాల. నాలుగు బిందెలు తేకపోతే మా అమ్మ తంతుంది.'

లోహి ఆశ్చర్యపోయింది, ఆ కష్టం విని.

ఈ మధ్యలో పిల్లల్ని తీసుకొని వీరభద్రుడు సరస్వతి వాళ్ల ఊరికి అద్దె జీపులో బయలుదేరాడు. అక్కడ మూడు రోజులున్నారు. చుట్టాలు వచ్చారు. ఆ మమకారాల కోలాహలంలో ఆడుకోడానికి లోహికీ, లీనాకూ వీలు దొరకలేదు. తమ ఈడు పిల్లలూ కనపడలేదు. ఆ పల్లెకు వస్తున్న దారిలో రోడ్డు పక్కల బీడు పొలాలు, ఒకటో రెండో చెట్లూ లోహి చూసింది. వాటిని గురించి తెలుసుకోవాలనుకుంది. కుదరలేదు. మళ్లీ తిరిగి రామాపురం చేరుకునేసరికి లోహికి ప్రాణం లేచి వచ్చింది.

ఒక అయిదురోజుల్లో అమెరికాకు తిరిగి వెళ్తారనగా, ఆ ఆదివారం పది పదిన్నర ప్రాంతంలో సరస్వతి, తోడికోడలూ రోలు దగ్గర పీట మంచాలు వేసుకొని కబుర్లలో ఉన్నారు. మిగతా అందరూ తోటలో ఉన్నారు. వీరభద్రుడు మాత్రం వసారాలో పత్రికా విలేకరుల్లాంటి ముగ్గురు నలుగురు బంధు స్నేహితులతో భేటీ అయి వున్నాడు.

వీరభద్రుడి కంటే వయస్సులో రెండింతలు పైగా ఉన్న మునెయ్య తాత వీరభద్రుణ్ణి అడిగాడు:

"వీరభద్రుడూ! నువ్వున్నావే అక్కడ - ఆ దేశంలో వానలెట్లా కురుస్తాయి? రైతులెట్లా ఉండారు?"

"తాతా! అక్కడివి అన్నీ నాకు తెలియవు. ఎవడి బతుకు వాడిదే. ఎవరి పని వాళ్లదే. తీరిక తక్కువ. తెలిసినమటుకు చెప్తా. పోయినసారి నేనుంటున్న టెక్సాస్ అనే రాష్ట్రంలో కరువు వచ్చింది. బయటపడినారు. నీళ్లను ఎట్లా కాపాడుకోవాలో వాళ్లకు తెలుసు. నలభై ఏండ్లుగా అక్కడ సరస్సుల్ని - మన చెరువుల మాదిరివి - కాపాడుకున్నారు. కాలువల్ని తవ్వుకున్నారు. కావలసినంత భూమి ఉంది. అమెరికా మొత్తం భూమిలో వాళ్లు సాగు కిందికి తెచ్చుకున్నది నూటికి అరవై ఇంతలే... సరేగాని తాతా. చెరువుల్లో పూడిక తీయించడం - అవేవో వాటర్‌షెడ్లూ, ఇంకుడు గుంతలు వీటి వల్ల మార్పు రాలేదా?" వీరభద్రుడు అడిగాడు.

"నువ్వు చూసినావుగదా? రైతును పట్టించుకునే రాజ్జెం కాదు ఇది", మునెయ్య తాత నిస్పృహలో అన్న మాటలకు ఏం చెప్పాలో తెలియక వీరభద్రుడు అయోమయంలో పడ్డాడు. "మరి... మరి.." అని చెప్పబోయాడు.

ఆ సమయంలో లోహి, లీనా వసారాలోకి వచ్చారు. చేతుల్లో తువ్వాళ్లతో స్విమ్మింగ్ డ్రెస్సులో వచ్చిన పిల్లలిద్దర్నీ చూసి వీరభద్రుడు అవాక్కయ్యాడు.

"ఏంది వీరభద్రుడూ? ఈ ఆడపిల్లోళ్ల ఆకారం - టీవీల్లో మాదిరి", ఒక దాయాది అడిగిన ప్రశ్నకు వీరభద్రుడు తడబడ్డాడు.

లోహి తండ్రి దగ్గరకు వచ్చి అంది:

"లీనా స్విమ్మింగ్ పోవాలంది. స్మిమ్మింగ్‌పూలుకు పోదాం."

"స్మిమ్మింగ్ పూలు అంటే ఏంది భద్రుడూ? అవి కొత్త రకం పూలా? మన పక్కల లేవే?" అని మునెయ్య తాత అడిగాడు.

"స్మిమ్మింగు కాదు తాతా? స్విమింగ్ అనాల," లోహి సరి చేసింది.

"అదేలే తల్లీ. అంటే ఏంది?"

లోహి తండ్రి వైపు చూసింది.

"అంటే చిన్నప్పుడు నాకు ఈత నేర్పినావు జ్ఞాపకం ఉందా, దిగుడుబావిలో?. స్విమింగ్ అంటే ఈత కోసం కట్టిన కోనేరు అనుకో," వీరభద్రుడు వివరణ ఇచ్చాడు.

మునెయ్య తాత నిట్టూరుస్తూ అన్నాడు:

"ఇంకెక్కడ దిగుడుబావులూ, కోనేర్లూ? ఆ కాలం పోయింది. బావులన్నీ గుంతలయినాయి. కోనేర్లు పూడిపోయినాయి. ఊరికంతా ఉండేది రెండు బోర్లు, పొలాల్లో మిగిలింది నాలుగు బోర్లు. నీళ్ళొచ్చేది రెండు దాన్లల్లో. అందులో మీదొకటి- నువ్వు పంపిన డబ్బుతో నన్నూరు అడుగులు కిందికిపోతే..."

మునెయ్య తాత మాటలు లోహికి పూర్తిగా అర్థంకాక అడిగింది:

"మనూళ్లో స్విమ్మింగ్ పూల్ లేదా?"

మాట మార్చి పిల్లలను ఏమార్చాలి వీరభద్రుడు అనుకున్నాడు.

"మనూళ్లో ఒకప్పుడు ఉండేవి లోహీ. ఈ తాతకు గజఈతగాడని పేరుండేది."

"గజఈతగాడంటే?" లోహి కుతూహలంగా తండ్రి పక్కన కూర్చొని అడిగింది. లీనా కూడా అక్క పక్కన కూర్చుంది.

"ఏస్ స్విమ్మర్. ఏనుగు మాదిరి ఈదేవాడు అనుకో. గొప్ప ఈతగాడు"

"తాతా. నువ్వు ఏనుగు ఈతగాడివా?" లోహి పకపక నవ్వుతూ అడిగింది.

'ఇప్పుడా? మొండిగా బతుకును ఈదుతున్నా చిన్నతల్లీ', అన్నాడు మునెయ్య తాత.

ఆ మాటల్లోని బాధను వీరభద్రుడు గ్రహించాడు. ఉత్సాహ వాతావరణం కల్పించే ప్రయత్నంలో అన్నాడు: "మునెయ్య తాత ఒకమారు పెద్ద ఏరును ఈదినాడు, పెద్దవానలో ఏరు పొంగిపొర్లుతున్నప్పుడు."

"ఏరు మనూళ్లో ఉందా? ఏరు అంటే ఏది నాన్నా"

"రివర్. మన ఊరి దగ్గర లేదు. మన బంధువుల ఊళ్లో ఉంది, మన ఊరి దగ్గర వంక మాత్రం ఉంది"

"వంక అంటే"

"రివులెట్"

"నీళ్లుంటాయి గదా రివులెట్‌లో"

"వాన వస్తేనే మన వంకల్లో కొన్ని రోజులు నీళ్లు పారతాయి. ఇప్పుడుండవు"

వీరభద్రుడు ఓర్పుగా పిల్లలకు చెప్పడం చూసి మునెయ్యతాత మెచ్చుకున్నాడు. పిల్లల్ని గోము చేయడం బాగాలేదు అనుకున్నాడు దాయాది.

లీనాకు అసహనంగా ఉంది. 'అక్కా... అక్కా... నానా... నానా' అంటూ పిలిచింది. ఈత కోసం అన్నట్లు చేతులు కదిలిస్తూ అభినయించింది.

దాయాది ఓర్పు కోల్పోయి మనసులో మాట కక్కేశాడు:

"పిల్లల్ని ఇంత గోముగా పెంచకూడదురా వీరభద్రుడూ. పైగా ఆడపిల్లలు. ఈ బట్టలూ, ఈ ఈతలూ - నలుగురూ చూస్తే... వస్తా... పనుందిరా."

వీరభద్రుడు శాంతంగా సమాధానం చెప్పేలోగా ఆ దాయాది వెళ్ళిపోయాడు.

"వాడట్లానే అంటాడు. తిట్టి తిట్టి వీడి నోరు చెడింది. తిట్లు తిని ఒక కొడుకు తాగుబోతయినాడు. ఇంకొకడు ఎందుకూ పనికి రాకుండా తయారైనాడు", మునెయ్య తాత దాయాదిని గురించి ఫిర్యాదు చేశాడు.

వీరభద్రుడు పిల్లలకు అపేక్షలను పంచి ఇచ్చే విషయంలో తాను అమెరికాలో నేర్చుకున్నవీ, అనుసరించేవీ మనసులో మెదిలాయి. బంధు హింస తనకు తెలియంది కాదు అనుకున్నాడు.

తోట దగ్గర నుంచి అప్పుడే వస్తున్న వీరభాస్కర్ పిల్లల దుస్తులు చూసి నవ్వుతూ అడిగాడు:

"ఏమిట్రా లోహీ? నీకేం కావాలమ్మా లీనా?"

మునెయ్య తాత బోసి నవ్వు నవ్వుతూ అన్నాడు:

"వీరభాస్కరూ! ఈ పిల్లోళ్లు ఈతకు పోవాలంట."

"ఈతా? పోదాం లేర్రా. నేను తీసుకపోవాలే. కరెంటు ఇంకొక గంటే ఉంటుంది. పది నిముషాల్లో తోట దగ్గరకు అన్నం తీసుకపోదాం - అందరికీ," తడుముకోకుండా వీరభాస్కర్ పిల్లల్ని ఉత్సాహపరిచాడు.

"ఇంట్లోకి పోదాం. గుడ్డలు మార్చుకోండి. ఇప్పుడు వేసుకున్నవి తోట దగ్గర వేసుకుందురు," అంటూ పిల్లల్ని ఇంట్లోకి తీసుకవెళ్లాడు.

మునెయ్య తాత మెచ్చుకోలుగా అన్నాడు:

"చూసినావుగదా వీరభద్రుడూ? నీ దయవల్ల వాడిది ఇంజినీరు అయిపోతాది. ఇప్పటి ఓగు పిల్లకాయల మాదిరి కాదు వీడు. మిమ్మల్ని చూడటానికి తిరుపతి నుంచి వచ్చినాడా? ఇంటిపనీ, తోటపనీ అన్నీ చూసుకుంటాడు. గడ్డిమోపులు కూడా తెస్తాడు."

ఇంట్లోకి వచ్చిన పిల్లల్ని సరస్వతి చూసి విస్తుపోయింది.

"ఏమయిందర్రా మీకు? స్విమింగ్ డ్రెస్సులు నేను మన సూటుకేసుల్లో పెట్టలేదే" అంది.

"నా బ్యాగ్‌లో పెట్టుకున్నా. మా యిద్దరివీ," లోహి నిర్భయంగా జవాబిచ్చింది.

అన్నం గంపను భుజం మీద పెట్టుకొని, వీరభాస్కర్ నడవలోకి వచ్చి సరస్వతికి చెప్పాడు:

"చిన్నమ్మా! పిల్లల్ని మన తోట దగ్గరకు తీసుకపోతా. బయం లేదులే. అక్కడ అబ్బా, జేజి, నాయనా అంతా ఉన్నారు. ఈత... ఈత అంటున్నారు... లోహీ! లీనా! ముందు ఆ బట్టలు మార్చుకోండి" అన్నాడు.

పిల్లలు దుస్తులు మార్చుకున్నారు. ఈతదుస్తుల్ని లోహి పట్టుకుంది. వీరభాస్కర్ వెంట పిల్లలు నడుస్తూంటే సరస్వతికి ఏమనాలో తోచలేదు. వసారా వరకూ వాళ్లను వెంబడించింది.

వసారాలోని వీరభద్రుడు "నేను వీళ్ల వెంట వెళ్తున్నాలే... ఇంటికి వచ్చినాక చెబుతా గదా వీళ్ల తమాషాలు" అన్నాడు సరస్వతితో.

"లీనా అంతదూరం నడవగలదా?" అంది సరస్వతి, అమెరికాలో అప్పుడప్పుడు నడవనన్నట్లు మొండికేస్తే స్ట్రోలర్‌లో తీసుకవెళ్లడం గుర్తు చేసుకుంటూ.

"అంతగా అయితే ఎత్తుకుంటాలే," అన్నాడు వీరభద్రుడు.

తోటదారిలో చుట్టుపక్కల పొలాల్లో ఇంకా సేద్యమే లేదు. ఒకప్పటి చెట్లు లేవు. వీరభద్రుడు గమనించి బాధపడ్డాడు. ఇన్నాళ్లూ తోట దగ్గరకు వెళ్లలేకపోయాడు. ఇప్పుడు ఆ పరిసరాలు చూస్తుంటే, అమెరికాలోని రకరకాల చెట్లూ, గరికపచ్చ మైదానాలూ, పచ్చదనమూ... ఎన్నెన్నో మనసులో మెదిలాయి.

'ఇక్కడి భవిష్యత్తు ఏమవుతుంది?' అని మదనపడ్డాడు.

లోహి అటూ ఇటూ వింతైన పరిసరాలను గమనిస్తూ జాగ్రత్తగా, నెమ్మదిగా తండ్రి, అన్నల వెంట నడిచింది. లీనా కొంత దూరం నడిచాక చేతులు చాచింది, ఎత్తుకోమన్నట్లుగా. వీరభద్రుడు లీనాను ఎత్తుకున్నాడు.

తోట దరిదాపుల్లోకి రాగానే ఆ కాలిబాటలో చచ్చిపడిన ఒక కాకిని లోహి చూసింది. గాల్వెస్టర్ బీచిలో ఎవరిదో కారు కిందపడి, రెక్కలు చాచి బోర్ల పడుకున్న బొమ్మలాగా, చనిపోయిన సీగల్ లోహికి గుర్తుకు వచ్చింది.

"వీరా అన్నా! ఇక్కడ సముద్రం ఉందా?" అని అడిగింది.

"లేదురా. ఇక్కడికి మున్నూరు కిలోమీటర్ల దూరంలో ఉంది."

"అంటే ఎంతదూరం?"

వీరభాస్కర్‌కు ఏం చెప్పాలో తోచక చిన్నాన్నవైపు చూశాడు. అలవాటయిన అమెరికా కొలతల్లో "టు హండ్రెడ్ మైల్స్" అన్నాడు.

"ఓహో" అంది లోహిత, సముద్రం కూడా లేనందుకు విచారపడుతూ.

తోటలోకి వెళ్తూనే, తమ తోటలోని, పక్క తోటల్లోని ఇరవై ఎకరాల పచ్చదనాన్ని లోహి ఆశ్చర్యంతో చూసింది. పసుపుపచ్చటి పొద్దు తిరుగుడు పూలు, మిరప, టమోట, వంకాయ, ఉల్లిపూలు, గెట్లవార కంది – లోహి గమనించింది. పేర్లు అడిగి తెలుసుకుంది.

"వీరా. పొద్దుతిరుగుడు పూలు అంత చిన్నగా ఉన్నాయే. దిగుబడి పెద్దగా వచ్చేటట్లు లేదే" అని వీరభద్రుడు అడిగాడు.

'నీళ్లు చాలలేదు చిన్నాన్నా. మిరపకూ తెగులే. కందికీ తెగులే," అన్నాడు వీరభాస్కర్.

"తెగులు ఏమిటి వీరా అన్నా?" లోహి ప్రశ్నకు ఇంగ్లీషుమాట వీరాకు వెంటనే స్ఫురించలేదు.

"అమెరికాలో బగ్స్ చూసినావు గదా అవీ... పెస్ట్స్" అని కూతురికి వీరభద్రుడు ఇంగ్లీషు సమానార్థకాలు చెప్పాడు.

"అమ్మో! నేను రాను" అంది జంకుతూ.

మనుమరాళ్లనూ, కొడుకునూ, మనవణ్ణీ చూసి, మిరపకయ్యల్లో ఉన్న వీరభద్రుడి తండ్రి గబగబా వచ్చాడు. అప్పటికే లీనా కూడా చంక దిగింది.

"పిల్లల్ని ఇంత దూరం నడిపించినారా?" అన్నాడు.

"తాతయ్యా. నానమ్మ ఎక్కడా" అని లోహి అడిగింది.

"నానమ, నానమ" అంది లీనా.

"మా అమ్మవే...మా బంగారు కొండవే" అంటూ లీనాను ఎత్తుకొని, "అదుగో మీ జేజి – మీ నానమ్మ" అని ఉల్లిపువ్వుల కయ్యల్లోని భార్యను చూపించాడు.

"తాతయ్య! ఈతకు వచ్చినాం" అంది.

వీరభద్రుడి తండ్రికి మతిపోయింది. కొడుకు వైపూ, మనమడివైపూ చూశాడు.

"అబ్బా! నేను చూసుకుంటలే. పిల్లల ముచ్చట తీర్చడం ఎట్లాగో నాకు తెలుసులే" అని వీరభాస్కర్ అన్నాడు.

"ఎట్లారా?"

"మన బోరు పైపు ఉందా? పైపులో నుంచి నీళ్లు వచ్చినప్పుడు ముందు కాలువలోని గుంతలో పడతాయి గదా?"

"నీకేమన్నా పిచ్చి పట్టిందా ఏరా? ఏదో మనమో, సేద్యగాళ్లో, కూలోళ్లో మంచినీళ్లు ఆ గుంతలో పట్టుకుంటాం. అక్కడ ఎప్పుడన్నా స్నానాలు చేస్తాం.. వీళ్లు ఈ పిల్లలు..."

"నువ్వు ఊరుకో అబ్బా! నేను చూసుకుంటాను"

వీరభాస్కర్ వ్యూహానికి వీరభద్రుడు ఆశ్చర్యపోయాడు. లోహి పట్టుదల తనకు తెలియంది కాదు. ఎండిపోయి సగం పూడిపోయిన పెద్దబావినీ, ఆ బావిలో మొలచిన చెట్లనూ, ఒకచెట్టుకు వేలాడుతున్న గిజిగాళ్ల గూళ్ళనూ, బావి అడుగున వేసిన బోరునూ, బావి పక్క చిన్న కొట్టంలో ఉండే మోటారునూ చూసి లోహి ఆశ్చర్యపోయింది. ఈత తొందరలో గిజిగాళ్ల గూళ్లను పట్టించుకోలేదు.

"ఎక్కడ ఈత?" అంది.

"ఇక్కడ" అని వీరభాస్కర్ నవ్వుతూ ఆ చోటు చూపించాడు.

మూడించి పైపు నుంచి, రెండించి నీళ్లు ఉరవడిగా వస్తున్నాయి. ఆ నీళ్లు మూడడుగుల వెడల్పు, నాలుగడుగుల పొడవు, రెండడుగుల లోతూ ఉండే రాతి బండలు పేర్చి కట్టిన గుంతలో పడుతున్నాయి. అక్కడి నుంచి గడ్డి దట్టంగా మొలిచిన కాలువలో పారుతూ, పోతున్నాయి.

స్ప్రింక్లర్ల పద్ధతి లేనందుకు వీరభద్రుడు విచారించాడు. 'ఎన్ని నీళ్లు వృధా అవుతున్నాయి?' అనుకున్నాడు. ఆ పద్ధతికి డబ్బు సాయం చెయ్యవచ్చు. కానీ... కానీ... అమెరికాలో ఈ ఆడపిల్లల పెంపకం, చదువు... ముందు ముందు పెళ్లిళ్లు అనుకొని భయపడ్డాడు. ఎవరి జీవితం వాళ్లది అనుకుంటున్న రోజుల్లో ఎవరి యుద్ధాలు వాళ్లు చేసుకోవాలి. బంధాలు, ప్రేమలు తప్పకపోవచ్చు. కానీ అన్నిటినీ కాపాడుకోలేం అనుకున్నాడు.

లోహి 'టబ్, టబ్' అంది నీళ్ల గుంత దగ్గరకు చేరి. అమెరికాలోని వాళ్ల ఇంట్లోని స్నానాల గదుల్లోని స్నానాలతొట్లు లోహికీ, లీనాకూ గుర్తుకొచ్చాయి. ఇద్దరూ నీటి ప్రవాహాకర్షణలో పడ్డారు. దుస్తులు మార్చుకున్నారు. గుంతలో దిగారు. నీళ్లను టపటప చేతులతో కొడుతూ ఈదినట్లు కదిలారు. జలభ్రమలో పడ్డారు. అది చూసిన వీరభద్రుడి తల్లీ, ఒకరిద్దరూ ఆడకూలీలూ విస్తుపోయారు. అరమరికలు లేని ఆ పిల్లలను చూసి ముచ్చటపడ్డారు. అరగంటకు పైగా పిల్లలిద్దరూ జలకాలాటల్లో మునిగారు. కరెంటు పోవడంతో వాళ్ల నీటి ఆట ముగిసింది.

ఆ రాత్రి దొంగమబ్బులు దోబూచులాడుతున్నాయి. వాన వస్తుందో ఏమోనని వీరభాస్కర్ చిన్నాన్న చిన్నమ్మలకూ, పిల్లలిద్దరికీ స్వయంగా మంచాలు వేశాడు. కరెంటు పోయింది. రెండు కిరసనాయిలు బుడ్లను వెలిగించారు. ఆ ఏర్పాటు లోహికి గమ్మత్తుగా ఉంది. విసుగ్గా ఉంది. వీరభద్రుడి నాన్న, అన్న భోజనాలు ముగించి తోట దగ్గరకు వెళ్లారు - ఏ అర్ధరాత్రో అపరాత్రో కరెంటు వచ్చినప్పుడు తోటకు నీళ్లు కట్టుకోవడానికి. వీరభద్రుడి తల్లీ, వదినా, సరస్వతి టి.వి.సీరియళ్ల గురించి మాట్లాడుకుంటూ కన్నీళ్లు కార్చుకుంటున్నారు. లీనా ఎప్పుడో నిద్రపోయింది. వీరభద్రుడూ, వీరభాస్కర్ ఏవేవో మాట్లాడుకుంటున్నారు.

ప్లేనోలోని తమ ఇల్లూ, పరిసరాలూ, తమ స్కూలూ, స్కూల్లోని చైనా పిల్లలూ, మెక్సికన్ పిల్లలూ, సాటి ఇండియన్లూ, అమెరికన్లూ, టీచర్లూ, స్కూలు ఆవరణలోని చెట్లూ చేమలూ, సరస్సూ, ఈతకు వెళ్లిన కమ్యూనిటీ స్విమింగ్‌పూల్, ఈత నేర్చుకోడానికి ఈత క్లాసులకు వెళ్లిన ఓక్ పాయింట్ రిక్రియేషన్ క్లబ్బులోని స్విమింగ్‌పూల్, ఆ పూల్‌లో పదహారు విభాగాల్లో ఈత నేర్చుకునే ఆడపిల్లలూ, మగపిల్లలూ అక్కడి సౌకర్యాలూ లోహి నెమరు వేసుకొంటోంది. ఇక్కడ బాగుంది. బాగులేదు. అనుకుంది. లోహి మెదడు రకరకాల జ్ఞాపకాలతో, సంకోచాలతో ప్రశ్నలతో తల్లడిల్లింది. ఇక్కడ లేనివి అక్కడున్నాయి. అక్కడ లేనివి ఏవో గ్రహించడానికి లోహి ప్రయత్నించింది.

వీరభాస్కర్ లోహిని అడిగాడు:

"లోహీ! నిద్ర వస్తాందా?"

"లేదు వీరా అన్నా"

"నీకు మన ఊరు నచ్చిందా?"

లోహి, తన ఆలోచనల్నీ, తెలుగు మాటల్నీ కూడగట్టుకుంటూ అంది. పూర్తిగా రాని తెలుగు - అక్షరాలు రాని తెలుగు - బాగా వచ్చిన ఇంగ్లీషు మధ్య నలిగిపోతూ అంది:

"ఇక్కడ బాగుంది, అమెరికాలో మాదిరి అన్నీ లేవు, ఎందుకు?"

ఎందుకు? అనే ప్రశ్న కూతురు నుంచి విని వీరభద్రుడు ఉలిక్కిపడ్డాడు. అమెరికా ఒక స్వర్గం, వెళ్లి తీరాలనే పట్టుదలతో ఉన్న వీరభాస్కర్‌కు ఏం సమాధానించాలో ఆ క్షణాల్లో దిక్కుతోచలేదు.

ఆ సీమ ఆకాశంలో దొంగమబ్బులు విచ్చిపోయాయి. తెల్లమోడమేసింది. గాలి స్తంభించింది. కరెంటు ఇంకా రాలేదు. ఆకాశంలో మాత్రం కోటానుకోట్ల నక్షత్రాలు మినుకు మినుకుమంటున్నాయి.

లోహి, నిద్రలో ఏవేవో చెల్లాచెదరిపోతున్న కలల్లో తేలాడుతూనే ఉంది.

● ఆదివారం ఆంధ్రజ్యోతి, 2 మార్చి 2003. ●

# సంకట విమోచని

అమ్మా, కూతురూ ఏం గుసకొట్టుకున్నారో నాకు తెలియదు. ఎవరి ప్రోద్బలముందో, ఇంకెవరి ప్రభావాలు పడ్డాయో తెలియదు. నా పెద్దకూతురు మొండికేసింది. తెగేసి చెప్పింది. చిల్లరంగళ్ల మాదిరుండే మన కొత్త ఇంజనీరింగు కాలేజీల్లో దేంట్లోనూ చేరననీ, చెన్నైలో ఏ మంచి ఇంజనీరింగు కాలేజీలోనైనా చేరతాననీ, అదీ కంప్యూటర్స్‌లో మాత్రమే అనీ.

బిడ్డను ఏమీ అనలేకపోయిన అసమర్థత నాది. ఇంటర్‌లో మంచి మార్కులే తెచ్చుకుంది. 'ఎంసెట్‌లో మంచి రాంకును ఎందుకు తెచ్చుకోలేకపోయావని అడగలేకపోయాను. ఇంగ్లీషు ఎం.ఏ., చేద్దామనుకున్న నేను తత్త్వశాస్త్రంలో ఎం.ఏ. చేరిన పాతరోజులు గుర్తుకొచ్చాయి. జీవితంలో పోటీలన్నీ మన చేతుల్లో ఉండవులే అనుకున్నా.

మా పాప కోరినట్లే చెన్నైలో ఒక పేరున్న ఇంజనీరింగు కాలేజీలో చేర్పించాను. కాలేజీ యాజమాన్యం ముఖ్యుడు పెన్సిల్‌తో రాసిన డొనేషను చెల్లించాను. కాలేజీ, హాస్టలు ఫీజులు కట్టాను. పాపను హాస్టల్‌లో చేర్పించి, బాగా చదవమని చెప్పి, తిరుపతికి తిరుగుప్రయాణం కట్టాను.

ఇప్పటికి రెండు లక్షలైంది. నా చదువుకోసం అమ్మిన పొలం పోయింది పోగా, మరొక పద్దెదు ఎకరాలు అమ్మకంలో పోయాయి.

మా రెండో పాప అయినా వచ్చే ఏడాది ఎంసెట్‌లో మంచి రాంకు తెచ్చుకుంటుందేమో చూడాలి. పై చేయిగా బతకాలనుకున్నప్పుడు, తిప్పలు భరించక తప్పదు. నా కూతురు కంప్యూటర్ ఇంజనీరు కాబోతున్న మొట్టమొదటి ఆడపిల్ల.

మా నాయన ఉంటే ఎంతగా ఆనందపడేవాడో! మా అమ్మ సంతోషంగా పొలాన్ని అమ్మి ఇచ్చింది.

పారిస్ బస్టాండు నా మనసు మాదిరే గజిబిజిగా ఉంది. తమిళమే ఎక్కువగా, బిగ్గరగా వినపడుతున్నా, ఇతర భాషలు చెవికి సోకుతున్నాయి. చేతి సంచులతో, గుడ్డ మూటలతో బీదాబిక్కీ, ముసలీ ముతకా. ఖరీదైన బ్రీఫ్‌కేసులతో, సూట్‌కేసులతో మగవాళ్లూ. మెళ్లో నగలతో స్త్రీలూ, అట్టహాసంగా, సంప్రదాయం, ఆధునికత కలగలిసిన లోకంలా కన్పించింది. చీరెకట్లూ, పంచెకట్లూ, సఫారీలూ, టక్కులూ, పాంట్లూ, స్లాకులూ, నుదిటి మీద పెద్ద పెద్ద కుంకుమ బొట్లూ, నామాలూ, విభూది రేఖలూ, నములుతున్న వక్కాకూ చూసి, పిల్లల చదువులకు చెన్నై భద్రమైన నగరం అనుకున్నాను. బస్సు బయలుదేరింది.

నా పక్క సీట్లోని వ్యక్తిని చూశాను. ఆయన పేపరు చదవడంలో మునిగిపోయి ఉన్నాడు. కిటికీ వైపు సీటు నాది. కిటికీ లోంచి వెనక్కి వెనక్కి పోతున్న నగర వాణిజ్యాన్నీ, పర్యావరణాన్నీ చూస్తూ కూర్చున్నా, బస్సులో ఎవరివో మాటలూ, నవ్వులూ, తినటంలోని కరకరలూ విన్పిస్తున్నాయి. మానసికమైన ఒత్తిడి. శారీరకమైన అలసట. కళ్లు మూసుకున్నా, కుదురుగా సీటుకు చేరబడి...

'కళ్లముందు ఏవేవో కదలాడుతున్న నీడలు; అస్పష్టంగా, స్పష్టంగా, సాకారంగా ప్రత్యక్షమవుతూ కదలిపోతున్న దృశ్య మాలికలు:

మా సింహాద్రిపురం. మా సంత. మా ఇల్లు, మా స్కూలు, మా మంచినీళ్ల బావి. మా ఇంటి వెనుక ఇల్లు. మగ్గం చప్పుడు.

సంతలో మా అబ్బ భుజాలమీద నేను అయిదారేళ్ల పిల్లవాడిగా, బొరుగులు, బెండ్లు, బెత్తాసులు, పాలనురుగులు రాసులు పోసి. అబ్బ నేను చూపించిన వన్నీ కొంటూ, ఒల్లెలో పోసుకుంటున్నాను... పదేళ్ల పిల్లవాడిగా అబ్బ వేలు పట్టుకొని సంతలో లడ్లూ, కారాలు, కజ్జికాయలు కొనమంటున్నాను.

మా అబ్బ అంటున్నాడు:

"బాగా తినాలరా. తిని పెరిగి పెద్దయి మన యాభై ఎకరాల పొలాన్నీ చూసుకోవాలి. మనకు చదువెందుకు? ఈ ఆస్తి చాలదా? ఒకరికి పెట్టవచ్చు. ఇంత తినవచ్చు."

నేనూ, మా నాయన... చుట్టూ ఎవరూ లేరు. నాయన అంటున్నాడు:

"ఒరే' చెన్నా! మీ అబ్బకు నిన్ను చదివించాలని లేదు. నే నొక్కణ్ణే కొడుకును. కాబట్టి ఈ ఆస్తేదో నిలిచింది, ఇప్పటిదాకా. పొలంమీద రైతు బతుకూ, గాటిపాట గొడ్డు బతుకూ ఒక్కటే. కాలం ఒక్క మాదిరిగానే ఉండదు. మనకొచ్చే కరువులూ, పైనబడే అవసరాలూ ఎన్నెన్నో? మెట్ట వ్యవసాయం, మట్కా ఒక్కటే. వచ్చేదేమోగానీ పోయేదెక్కువ. బాగా చదువుకో. ఉద్యోగం చెయ్యొచ్చు. ఉండే పొలం ఉండనే ఉంటుంది..."

అమ్మ అన్నం పెడుతోంది. నాకు మాత్రమే విన్పించేటట్లు చెపుతోంది:

"చెన్నయ్యా! ఒక్కగా నొక్క బిడ్డవు. మీ నాయనకు బాగా చదువొచ్చేదంట! ఈ రాజ్జెమేదో పోతాదని మీ అబ్బ ఎచ్చులు. మీ నాయనను అయిదో తరగతిలోనే చదువు చాలించి నాడంట! నువ్వన్నా బాగా చదువుకోవాల... మన చౌడమ్మను చూడు. నీకంటే రెండేండ్లు చిన్నది. నీ తరగతిలో ఉంది. వాళ్ల నాయన మంచిపనివాడే. చేనేత సంగమో అంటూ బయట తిరుగుతాడు, వారానికి రెండుమూడు రోజులు. ఆ యప్ప లేకపోతే నేతపని తల్లి ఎత్తుకుంటుంది. చౌడమ్మ సాయం చేస్తుంది పడుగుకూ, గిడుగుకూ, నేతకూ గీతకూ. తీరిక దొరికితే చాలు. పుస్తకాలు ఎత్తుకుంటుంది. ఇంట్లో నీకేం పనీ చెప్పకపోతిమి. చదువుకోవచ్చు కదా, చౌడమ్మ కంటే బాగా?..."

చౌడమ్మ... చౌడేశ్వరి...

మగ్గం చప్పుడు.

తెల్లటి గుండ్రటి ముఖం, చక్కటి ముక్కు, పెద్ద పెద్ద కళ్లు. చిక్కని నల్లటి జుట్టు. నవ్వు... బుగ్గల మీద లోతైన చారికలు. మాటకారి చౌడేశ్వరి. పదేళ్ల పిల్లగా పావడా, బుట్టల జాకెట్టులో.

పరుగెత్తుతోంది. వెంట నేనే. నేను.

"చూడబ్బా! ఈ అన్న! చూడు పెదనాయనా! చెన్నారెడ్డెన్నా. చూడు పెద్దమ్మా, అన్న! చీరె నేసేది నేర్పాలంట!" ఒగరుస్తూ అంటోంది.

అబ్బ, నాయన, అమ్మల నవ్వులు. ఆ నవ్వుల్లో జతకలిపిన చౌడేశ్వరి తల్లి నవ్వులు...

చౌడేశ్వరి తల్లి అంటోంది, అబ్బతో:

"మామా! మీవాడు రెడ్డి నేత నేస్తాడేమో!"

అబ్బ అంటున్నాడు:

"చూడమ్మీ. మడక దున్నితే సాలు వంక రుండదు. ఆ రక్తం అమ్మీ! నేత ఒక లెఖ్ఖ కాదు."

చౌడేశ్వరి అంటోంది:

"నువ్వు బాగ చెప్తావు అబ్బా! సేద్యం వేరు, నేత వేరు. నేతలో చక్కదనమే పనితనం. కుంగకుండా ఉండాల. పోగు తెగకూడదు. మిడత కండ్లు రాకుండా చూసుకోవాల!"

"ఓ యబ్బ! నీకంటే బాగా నేస్తాను. ఏమిట్లోనైనా నీతో చౌడక్కా! పోటీనే" అంటున్న నేను...

అబ్బ శవం... నాన్న శవం... వెక్కిళ్ళు పెడతూ ఏడుస్తున్న చౌడేశ్వరి, అందరికంటే ఎక్కువగా...

హెడ్‌మాస్టరు అంటున్నాడు:" ఓరే చెన్నారెడ్డీ చౌడేశ్వరి స్కూలు ఫస్టొచ్చింది. నువ్వూ ఫరవాలేదు. ఫస్ట్ క్లాసొచ్చింది నీకు. పోటీ పడుతూ చదివినావురా...'

'పదహైదేళ్ళ ఓణీ పరికిణీల్లోని చౌడేశ్వరి నవ్వుతోంది.'

ఎవరో బిగ్గరగా నవ్విన చప్పుడు.

మెలకువ వచ్చింది. అటూ ఇటూ చూశాను. నా పక్కన కూర్చున్న ఆయన తమిళంలో ఏదో అడిగాడు. నాకు తమిళం రాదని ఇంగ్లీషులో జవాబిచ్చాను.

"మీరు తెలుగువాళ్లా?" అని తెలుగులో అడిగాడు.

అవునని తల ఊపాను.

"అలసట వల్లనో ఏమో కునుకుతీశారు", అన్నా డాయన. మాటల్లో మర్యాద, నెమ్మదితనం ధ్వనిస్తున్నాయి.

"ఆ" అన్నాను నవ్వుతూ.

ఆయనను పరిశీలనగా చూశాను. అరవైయేళ్లు పైబడి ఉంటాయి. హుందాగా ఉన్నారు. పొడగరి. కళ్లజోడులో పొడవైన ముఖం. పొడవు ముక్కు. చెవులు పెద్దవే. ఎగుభుజాలున్నాయి.

"ఏం అట్లా చూస్తున్నారు? నేను అచ్చమైన తెలుగువాణ్ణే. అయితే రాష్ట్రేతరాంధ్రుణ్ని. మరొకలా చెప్పాలంటే విదేశాంధ్రుడిని కూడా. అన్నట్లు తిరుపతికేనా?" అని అడిగాడు.

"అవున"న్నాను.

"తిరుపతిలో ఏం చేస్తారు?"

"వెంకటేశ్వర యూనివర్సిటీలో రీడర్ని", నిన్న మొన్నవచ్చిన కెరియర్ అడ్వాన్స్ మెంటు అయితేనేం అనుకుంటూ జవాబిచ్చాను.

"ఏ డిపార్ట్‌మెంట్?"

"ఫిలాసఫీ"

"డాక్టరేటు ఏ విషయం మీద చేశారు?"

పిహెచ్.డి. టైటిల్ చెప్పాను. ఇంగ్లీషులో. ఆయన స్వచ్ఛమైన తెలుగు అనువాదం చేస్తూ అన్నాడు:

"మహాభారతంలో సంక్షేమ రాజ్యభావన... సంస్కృత భారతం ఆధారంగా పరిశోధన సాగిందా? తెలుగు భారతం ఆధారంగానా?"

నాకు సంస్కృతం రాదని చెప్పడానికి మనసు అంగీకరించలేదు. పెద్దవాడు, ఆయనకు సాధ్యమైనంత నిజాయితీతో బదులు చెప్పాలనిపించింది:

"నేను, ఇంగ్లీషు, తెలుగు అనువాదాల మీదా ముఖ్యంగా ఆధారపడినా, భారతం మీద ఇంగ్లీషులో తెలుగులో వచ్చిన విమర్శలూ, వ్యాఖ్యానాలూ చదివినా. అవసరమైనచోట్ల సంస్కృత శ్లోకాల్ని ఉదహరించాల్సి వచ్చినప్పుడు సంస్కృతం

శాఖలోని నా మిత్రుడు సాయపడ్డాడు." అన్నాను, తెలుగులోనే మాట్లాడడానికి ప్రయత్నిస్తూ.

"మంచి తెలుగు మాట్లాడుతున్నావు. తమిళుల్లాగా మనకు భాషాభిమానం ఉండాలి. మరీ పూర్తిగా, చాదస్తంగా కాదనుకో," అన్నాడు మెచ్చుకోలుగా.

ఆయన స్వగతంగా చెప్పకపోయాడు:

"మహాభారత కాలాన్ని ఖచ్చితంగా చెప్పలేం. మన చరిత్రతో వచ్చిన చిక్కే అది. భారతంలోని భాషనూ, ఇతర లోపలి సాక్ష్యాలనూ పరిశీలిద్దామా అంటే అవి క్రీస్తుపూర్వం నాల్గవ శతాబ్ది నుండి పదహైదు పదహారు శతాబ్దాలదాకా ఉంటాయి. ఎన్నో ప్రక్షిప్తాలు.

అష్టాశ్లోక సహస్రాణి అష్టాశ్లోక శతానిచ
అహమ్ వేద్మి శుకోవేత్తి సంజయోవేత్తి వా నవా"

మరి ఎనిమిదివేల ఎనిమిది వందల మూల జయ భారతం సపాద లక్ష గ్రంథమైంది. పాఠాంతరాలతో ఇప్పుడు మరి నాలుగింతలైంది..."

ఆయన జ్ఞాపకశక్తికి విస్తుపోయాను. ఆయన మాటలకు అడ్డు తగల వద్దనుకున్నాను. పరిశోధనలో మునిగిననాళ్ల ఉత్సాహం నాకు తిరిగి వచ్చింది.

ఆయన తిరిగి చెప్పడం మొదలు పెట్టాడు:

"భారతం మీద లెఖ్ఖలేనన్ని ప్రభావాలు. ఉపాఖ్యానాలు పోనీ... నేననేది రాజనీతి, లోకనీతి విషయాల్లో... సంక్షేమం అంటే గుర్తుకొస్తోంది. సభాపర్వంలో ధర్మరాజుకు నారదుడు చేసిన రాజధర్మోపదేశం. 'పంట చెరువులన్నీ వర్షం నీళ్లతో నిండి కర్షకులకు ఆనందం కల్గిస్తున్నాయా? పేదరైతులకూ, వణిజులకూ అప్పురూపంలో విత్తనాలు దొరుకుతున్నాయా?' అని నారదుడు అడగటం గుర్తుకొస్తోంది. ఇలా మన ప్రభుత్వాల్ని అడిగే వాళ్లున్నారనుకుందాం. 'అడిగే వానలు రాలేదు. టెర్మినేటరు విత్తనాలు కొనబోతున్నాం. దొరికిన మేరకు ప్రపంచ బ్యాంకు నుంచి అప్పులు తెస్తున్నాం. విత్తన ఋణాలు ఏర్పాటు చేస్తున్నాం' అంటారేమో ఇప్పటి మన సంక్షేమ రాజ్య ధర్మరాజులు!"

ఆయనలోని హాస్యానికి నాకు నవ్వు వచ్చింది. నా నవ్వుతో ఆయన జతకలిపాడు.

"నాకొక అనుమానం ఉందయ్యా! దీఘ నికాయంలో, మహావాస్తులో... మిళింద పన్హలో రకరకాల వృత్తుల ప్రస్తావన ఉంది. సంగం వాఙ్మయాన్ని కూడా ఈ దృష్టితో చూడాల్సిందే. అర్థశాస్త్రంలో నేత పరిశ్రమను గురించి ఉంది. చూసే ఉంటావు. 'నేర్పు గల వాళ్లతో సభాధ్యక్షుడు నేయించాలట! వడికించటం, నేయించటం స్త్రీలతోనే చేయించాలట. నూలు రకాన్ని బట్టి, చాకిరినీ బట్టి, జీతాలు ఏర్పరచాలట. సూత్రం తగ్గితే, ధర గట్టి, కోత విధించాలట!' ఆ స్త్రీలకు రాజు, ముఖ్య పురోహితుడికీ, సలహాదారుకూ ఇచ్చినట్లు దగ్గర దగ్గర సాలుకు యాభైవేల

పణాలిచ్చేవారంటావా? దొంగలు! ఆ స్త్రీలకు అరవై పణాల కనీస వేతనం కూడా ఉండేదని నేను నమ్మను. ఇదేమి సంక్షేమ భావన? స్త్రీ వాదులు ఈ దృష్టినుంచీ పరిశీలిస్తే బాగుండు. అన్ని సంక్షేమాల వైభోగాలు బయటపడతాయి."

ఆయన మాటల్లోని కరుకుదనం చూసి అదిరిపడ్డాను. ఆ ప్రశ్నలు, ఆ వివరణలు, ఆ వ్యాఖ్యలు, హాస్యం, కరుకుదనం, ఆ మర్యాద, వీటిని గురించి ఆలోచిస్తూ ఉంటే ఆమధ్య ఒక ప్రఖ్యాత ఇంగ్లీషు దినపత్రికలో ఆయన ఫోటో, ఆయన పరిచయ వ్యాసం నా స్మృతిని వెలిగించాయి.

"మీరు... మీరు... ప్రొఫెసర్ నాగరాజు, ప్రొఫెసర్ నాగరాజన్..."

"నన్ను ఎలా గుర్తించారు?" చిరునవ్వుతో కుతూహలంగా అడిగాడు.

"నా లెక్చరర్ ఇంటర్వ్యూ అప్పుడు మీరొక ఎక్స్‌పర్ట్‌గా వచ్చినారు. పదిహేడేండ్లయింది. ఇంతవరకూ గుర్తుపట్టలేక పోయాను. క్షమించండి" అన్నాను.

"నువ్వే మేలు బాబూ. గుర్తు పట్టావు. నేను నిన్ను గుర్తుపట్టలేదు. మీ పేరు?" ఆయన అడిగారు.

పేరు చెప్పాను.

"పదేళ్లు యు.కె.లో, జర్మనీలో గడిపాను. నా భార్య పోవటంతో మన గూడు చేరుకున్నాను. ఒక సంవత్సరమైంది వచ్చి. తిరుపతిలో రెండు మూడు రోజులుందామని వస్తున్నా. మీ యూనివర్సిటీలో ఎకనామిక్స్ డిపార్ట్‌మెంట్‌లోని డాక్టరు చౌడేశ్వరి తెలిసే ఉంటుంది. చౌడేశ్వరి భర్త నా రక్తబంధువు. నాకు చౌడేశ్వరి అంటేనే ఎక్కువ అపేక్ష... ఏదేదో మాట్లాడాను. పెద్దవాణ్ణి. మీరు తత్త్వశాస్త్రం అనటంతో నా నాలుకకూ హద్దూ పద్దూ లేకపోయింది. ఏమీ అనుకోకు. నిన్ను విసిగించి ఉంటాను..."

తొడలమీద అందాకా పెట్టుకున్న పుస్తకం తీసి చదవటంలో డాక్టర్ నాగరాజన్ లీనమయ్యారు. ఆయన్ని మాట్లాడించే ధైర్యం లేకపోయింది. ఆయన చౌడేశ్వరితో తన బంధుత్వాన్ని గురించి చెప్పారు.

చౌడేశ్వరిని గురించిన ఆలోచనలు నన్ను కమ్ముకున్నాయి–కిటికీలోంచీ చూసే దృశ్యాల మధ్య.

నేను లెక్చరర్‌గా సెలక్ట్ అయిన విషయం, ఆర్డర్ రాకముందే చౌడేశ్వరి నాకు చెప్పి, అభినందించిన రోజు గుర్తుకొచ్చింది.

"నీకెట్లా తెలుసు? నిజంగానా?" అని చౌడేశ్వరిని అడిగాను–సంతోషంతో, అనుమానంతో.

"ఎట్లాగో తెలిసింది... నువ్వు సెలక్ట్ అయినావు," అంది చౌడేశ్వరి.

ఇప్పుడనిపిస్తోంది. ప్రొఫెసర్ నాగరాజు చెప్పి ఉంటాడని.

అప్పుడే ఆరోజు చౌడేశ్వరిని నేను అడిగాను:

"నీ సెలెక్షన్ ఏమైంది?" అని.

"తెలియదు. తప్పకుండా సెలెక్ట్ అవుతాననే ఆత్మవిశ్వాసం నాకుంది. నాకున్న అర్హతలు ఇతర అభ్యర్థులకు ఉంటాయనుకోను. స్వంతంగా పరిశోధన వ్యాసాల్ని విదేశీ జర్నల్స్‌లో కూడా ప్రచురించిన దాన్ని. ఇంటర్వ్యూ చాలా బాగా చేసినా," అంది చౌడేశ్వరి ధీమాతో.

అదే, ఆ ధీమా... పొగరేమో అన్పించింది. ఆ పొగరుతోనే నాకు కష్టం.

ఒకేరోజు ఇద్దరం ఎవరి డిపార్ట్‌మెంటుల్లో వాళ్లం చేరాం. కానీ చౌడేశ్వరి నాకంటే నాలుగేండ్లు ముందు రీడరైంది. రిజర్వుడు పోస్టు. రీడరైంది. రేపో మాపో ప్రొఫెసరు కాబోతోంది. నేను ప్రొఫెసరు కాగలననే నమ్మకం నాకు పోయింది. మా డిపార్ట్‌మెంట్ రాజకీయాలట్లాంటివి. చౌడేశ్వరి పట్ల ఏదో అసూయ! ఏదో కసి! ఏదో కోపం! వేరు కులాలమీద, రిజర్వేషన్ల మీద నాలో నాకే తెలియని వ్యతిరేకత.

రెండేళ్ల కిందట టీచర్స్ అసోసియేషన్ ఎన్నికల్లో మా పానెల్ అభ్యర్థిగా ఉండమని చౌడేశ్వరిని అడిగాము. ఖరాఖండిగా చెప్పిన చౌడేశ్వరి మాటల్ని నేనింకా మరిచిపోలేదు:

"నేను బి.సి.ల్లో ఒక కులానికి చెందిన దాన్నే. కాదనను. దానికి నేను కారణం కాదు. ఈ కారణంగా మీ కుల కోటా రాజకీయాల ఎన్నికల్లో తలదూర్చలేను" అంది.

నేను కోపం దిగమింగుకున్నాను. మా గుంపు మాత్రం నన్ను బాగా తిట్టింది. చౌడేశ్వరిని అప్పటినుంచి పలకరించటం మానేశాను. పుండు మీద కారం చల్లితే ఎట్లా?

తిరుపతి ఆర్టీసీ బస్టాండులో ప్రొఫెసర్ నాగరాజూ, నేనూ బస్సునుంచి దిగాము. ఎదురుగా చౌడేశ్వరి. ఆశ్చర్యం! ఆందోళన! బలవంతపు నవ్వు నవ్వాను. ప్రొఫెసర్ నాగరాజు ప్రయాణ సంచీని చౌడేశ్వరి అందుకుంది. "ముగ్గురం కలిసి పోదాం" అంది, నా వైపు చూస్తూ. నేను ముఖం తిప్పుకోలేకపోయాను. మౌనంగా వాళ్లిద్దరి వెంట నడిచాను. ఆటోను పిలవబోయాను. "కారుంది" అంది చౌడేశ్వరి. అద్దెకారు తెచ్చింది అనుకున్నాను.

నీలం రంగులో తళ తళ మెరిసే కారుముందు చౌడేశ్వరి ఆగింది. అది శాంత్రో! వెనుక వైపు ఎడమ తలుపు తీసింది. ఆశ్చర్యం నుంచీ తేరుకోకముందే ప్రొఫెసర్ నాగరాజు అన్నాడు: "రావయ్యా. కూచో, నేను కుడివైపు జరుగుతాలే. రా"

చౌడేశ్వరి కారు తోలటం మొదలుపెట్టింది – తిరుపతి సంస్కృతీ సందోహం మధ్య. ప్రొఫెసర్ నాగరాజు అన్నాడు:

"చెన్నారెడ్డి తోడు మా ప్రయణంలో హాయిగా ఉంది. నాది కొంత చాదస్తమే అనుకో. ఒకటే శాఖ వాళ్లం అని తెలిశాక ఏదేదో మాట్లాడాను; బస్సులో. అది కాలక్షేపమో, మనసులో ఉన్నది పంచుకోవటమో నాకు తెలియదు. ఇతను విన్నాడు. నేను ఆలోచించాను. నిజానికి కొత్త ఆలోచనలు వచ్చాయి. చెన్నారెడ్డి మూలంగా.

అన్నట్లు చౌడేశ్వరీ! మీ పాపకు ఐ.ఐ.టి. కాంపస్ నచ్చిందట! ఆ చెట్లూ, ఆ వాతావరణం బాగా నచ్చాయట! క్లాసులు మొదలయ్యాయట! అక్కడ ఎవరి పని వాళ్లదేనట! ఎవరి గాంభీర్యం వాళ్లదేనట! చదువు... బోధన... చదువు... వచ్చేముందు ఫోన్లో మాట్లాడా. నీ కూతురు ఉత్సాహం చూసి పరమానంద పడ్డాననుకో, జర్మనీలో ఆనందపడినట్లు. పిల్లలకు వాళ్ల చదువుకూ, జ్ఞానానికీ అవసరమైన శక్తినిచ్చే సంస్థలు ఇంకా మిగిలి ఉన్నాయి, ఈ దేశంలో..."

చౌడేశ్వరి ఏమనుకుందో ఏమో నాకు తెలియదు. కారు నడుపుతూ వెనక్కి చూడకుండా నన్ను అడిగింది:

"మీ పాపకూడా చెన్నైలో అదేదో మంచి ఇంజనీరింగ్ కాలేజీలో, కంప్యూటర్స్ లోనే చేరిందని, మా పాప గంటకిందట ఫోను చేసినప్పుడు చెప్పింది. కష్టమో, నిష్ఠురమో మంచిపని చేసినావు! మీ పాపా, మా పాపా మంచి స్నేహితులు, నీకు పూర్తిగా తెలియదేమో గానీ!"

ఇప్పుడు తెలుస్తోంది. నా భార్యా, నా కూతురూ గునకొట్టుకోవడం వెనుక అసలు కారణం తెలుస్తోంది. చౌడేశ్వరి కూతురు ఐ.ఐ.టి.లో, నా కూతురు ఒక ప్రైవేటు కాలేజీలో. ఈర్ష్య తన్నుకొచ్చింది. మాట్లాడలేకపోయాను. ఏదో తపన! ఏదో బాధ? ఇదీ రిజర్వేషన్ల కారణంగానేనా?

"ముందుగా క్వార్టర్‌కు పోదాం, టీ తాగుదాం. నిన్ను మీ ఇంటి దగ్గర దింపుతాను." అంది చౌడేశ్వరి నన్ను ఉద్దేశిస్తూ.

"చాలా అలసటగా ఉంది. మరోమారు మీ ఇంటికి వస్తాను. పద్మావతి ఉమెన్స్ కాలేజీ రోడ్డు మోటున దిగుతాను. అక్కడినుంచి మా ఇల్లు దగ్గరే" అన్నాను.

"నువ్వు ఇల్లు మారినావంట. మా పాప చెప్పింది. ఇల్లు చూసినట్లుంటుంది" అంది చౌడేశ్వరి.

మా ఇంటి దగ్గరకే చౌడేశ్వరి కారును పోనిచ్చింది. దిగి ఇద్దరినీ ఇంట్లోకి ఆహ్వానించాను.

ప్రొఫెసర్ నాగరాజు "రేపో మాపో వస్తానులే. ఉంటాను కదా!" అన్నాడు.

"ఒక్క నిముషం మామయ్యా" అంటూ చౌడేశ్వరి కారు దిగింది. నాతోపాటు మా ఇంట్లోకి వచ్చింది. మా ఆవిడను పలకరించింది. "మల్లా కలుద్దాం" అని చెప్పి, కారెక్కింది.

మా ఆవిడ తబ్బిబ్బు అయినట్లుంది. చాటంత ముకం చేసుకొని అంది: "కొత్తకారు. చాలా బాగుంది. ఈ మధ్యనే కొనిందనుకుంటా. చౌడేశ్వరి అదృష్టవంతురాలు, పైగా మంచి మనిషి."

అదృష్టానికీ మంచితనానికీ మధ్య ఉండే లంకె ఏమిటో అర్థం కాలేదు. లోలోపలి మంటను బలవంతంగా అణచుకున్నాను. 'ఇద్దరి సంపాదనా ఉంటే నేను కారును ఎప్పుడో కొనేవాణ్ణి' అని మా ఆవిడతో అని ఉండేవాణ్ణే. ఆ తర్వాత ఆవిడ

విసుర్లు వినాలి. స్నానానికి బయలుదేరాను. స్నానం చేస్తున్నంతసేపూ నా డొక్కు స్కూటరు జ్ఞాపకాలూ, చౌడేశ్వరి మీద మరింత ఈర్ష్య.

రెండురోజుల తర్వాత చెప్పాపెట్టకుండా ప్రొఫెసరు నాగరాజును తీసుకొని చౌడేశ్వరి నా గదికి వచ్చింది.

"మామయ్య మీ డిపార్ట్‌మెంటునూ, నిన్నూ చూడాలన్నారు... నాకు క్లాసుంది. పండ్రెండూ పదిహేను కల్లా తిరిగి వస్తాను, మామయ్యను ఇంటికి తీసుకపోవడానికి", అని చౌడేశ్వరి వెళ్లిపోయింది.

డిపార్ట్‌మెంటులోని హెడ్‌కూ, ప్రొఫెసర్లకూ, లెక్చరర్లకూ పరిచయం చేద్దామనిపించింది. ఆ విషయమే ప్రొఫెసర్ నాగరాజును అడిగాను. ఆయన ఉత్సాహం చూపలేదు – "నాకు తెలిసిన వాళ్లంతా రిటైరైపోయార"ని చెప్పి. టీ తెప్పించాను. టీ తాగుతూ "మీ థీసిస్ అచ్చు అయిందా?" అని అడిగాడు.

"కాలేదు" అన్నాను.

"ఎందుకు?" అన్నారు ఆయన.

"ఆసక్తి లేక" అన్నాను.

"పరిశోధన మీదనా? జీవితం మీదనా?"

నేను ఆ ప్రశ్నకు బదులు చెప్పలేకపోయాను.

"థీసిస్ కాపీ ఉంటే ఇవ్వండి. చదివి ఇస్తాను" అని ఆయన అడిగారు.

నా వెనుక టేబులు మీద చెల్లాచెదురుగా పడి ఉన్న కాగితాలూ, పుస్తకాల మధ్య నా పరిశోధనా గ్రంథాన్ని సిగ్గుపడుతూ ఆయన చేతులకు అందించాను. అంతలో నా పర్యవేక్షణలో ఎం.ఫిల్; పిహెచ్.డి. లు చేస్తున్న ఒక అబ్బాయీ, ఒక అమ్మాయీ వచ్చారు. ప్రొఫెసర్ నాగరాజును వాళ్లకు పరిచయం చేశాను. వాళ్లకు, ఆయన తత్త్వశాస్త్ర విషయాలను, అడిగిన వాటికన్నిటికీ సమాధానాలు చెప్పారు. యు.కె., జర్మనీ విశ్వవిద్యాలయాల్లో తత్త్వశాస్త్రంలో జరుగుతున్న చర్చలనూ పరిశోధనలనూ వివరించారు.

సరిగా పండ్రెండూ పదిహేనుకు చౌడేశ్వరి వచ్చింది.

నేను ప్రొఫెసర్ నాగరాజును ఆ రాత్రి భోజనానికి రమ్మని ఆహ్వానించాను. చౌడేశ్వరిని కూడా.

"భోజనం చేసి కొండకు వెళ్లి, రేపు ఉదయం చెన్నై వెళుతున్నా, ఎల్లుండి మద్రాసు యూనివర్సిటీలో ఒక లెక్చరుంది. తప్పక వెళ్లాలి", అన్నారు లేచి నుంచొని చౌడేశ్వరి వెంట వెళ్లడానికి సిద్ధపడుతూ, నా థీసిస్‌ను పట్టుకొని. దాన్ని నాకు చూపిస్తూ అన్నారు. "మీకు వెళ్లేలోగా అందచేస్తా"నని.

ఆ మరుసటి రోజుకాక మరుసటి రోజు పదకొండు గంటల ప్రాంతంలో చౌడేశ్వరి నా గదికి వచ్చింది.

"నిన్ననే మీ ఇంటికి వస్తామనుకున్నా. కుదరలేదు. థీసిస్ భద్రంగా, స్వయంగా నీకే అందచెయ్యమని మామయ్య చెప్పి చెన్నై పోయినారు", అంది చౌడేశ్వరి నవ్వుతూ, నా థీసిస్ నా టేబులు మీద ఉంచి. దాన్ని తీసి నా వెనుక టేబుల్ మీద పడేశాను.

"మామయ్య నీ థీసిస్‌ను రాత్రే పూర్తిగా చదివారంట! 'మంచి కృషి' అని మెచ్చుకున్నారు. చెన్నైకి వస్తే నిన్ను తన ఇంటిలోనే దిగమన్నారు. ఉత్తరం రాస్తారంట!" అంది చౌడేశ్వరి.

"మా రిసెర్చ్ స్టూడెంట్లు, ఆయన తమతో మాట్లాడినందుకు పొంగిపోయినారు. దర్పం లేని మనిషి," అన్నాను.

"అన్నా!"

చౌడేశ్వరి పిలుపుకు నేను చకితుణ్ణయ్యాను. చౌడేశ్వరి ముఖంలోకి నేరుగా చూడగలిగాను.

ఆమె అంది, పరమ శాంతంగా:

"ఇద్దరం ఒకే ఊరి వాళ్లం. ఒకచోట పెరిగినాము. ఒకే స్కూల్లో చదువుకున్నాము. ఆ రోజులు ఎప్పుడైనా నీకు గుర్తుకు రావా?"

"వస్తుంటాయి" అన్నాను.

"ఈ మధ్య రెండేండ్లనుంచీ నాతో ముభావంగా ఉంటున్నావు. కోపమేదో వచ్చినట్లుంది. నీకింకా కోపం వచ్చినా ఫరవాలేదు. నా మనుసులో మాట చెప్పాలని ఉంది" అంది చౌడేశ్వరి.

ఏం చెబుతుందో కానీ అనుకుంటూ టేబుల్ మీద కాగితాలను సర్దసాగాను.

"జీవితాన్ని సాధించే వాళ్లూ, జీవితంలో సాధించుకునే వాళ్లూ అని రెండు రకాల మనుషులున్నారు. నువ్వు మొదటి రకం మనిషివి అన్నా!"

చౌడేశ్వరి మాటలతో ఉలిక్కిపడ్డాను.

"ఎట్లా?" అని ఆందోళనతో అడిగాను.

"నీ మీద నీ ఆస్తి బరువుంది" అంది చౌడేశ్వరి.

"ఆస్తి ఏం చేసింది?" అన్నాను తమాయించుకొని.

"ఒక ఎకరం మీద పెట్టే పెట్టుబడికీ, శ్రమకూ, ఆదాయానికీ; అట్లాగే ఒక చీర నేతలో పెట్టే పెట్టుబడికీ, శ్రమకూ, ఆదాయానికీ మధ్య తేడాలు నీ కెప్పుడన్నా కన్పించినాయా? నువ్వు యాభై ఎకరాల కుటుంబం నుంచి వచ్చిన వాడివి."

"ఇప్పుడా ఆస్తి కరిగిపోతోంది. ఇద్దరు ఆడపిల్లల చదువులున్నాయి. వాళ్ల పెళ్లిళ్లున్నాయి" అని గొణిగాను.

"అదే చిక్కు" అంది చౌడేశ్వరి.

ఆ ముక్క నాకు అర్థం కాలేదు.

"చూడన్నా! మీ ఇంటి వెనుక మీరు బాడుగ లేకుండా ఇచ్చిన ఇంట్లో చీరెల పోగుల్ని చక్కదిద్దిన చౌడేశ్వరినే నేను, చీరెలు నేసిన చౌడేశ్వరినే నేను. మీ ప్రేమలు దొరికినాయి. అంతో ఇంతో ఆదరణ దొరికింది. ఆస్తూలూ. కులం దొరకలేదుకదా? నా అభద్రతే నా మీద ఒత్తిడి. దాన్ని పోగొట్టుకోవడమే నా ఘర్షణ. ఇది నేను సాధించుకున్న జీవితం. ఎవరో అప్పనంగా ఇచ్చింది కాదు.

మా నాయన సంగతి నీకు తెలుసు. తను నమ్మిన రాజకీయాలు, చేనేత సంఘం ఐక్యత దెబ్బతిన్నాయి. కుంగిపోయినాడు. వెనకడుగు వెయ్యలేదు. చీరెలు నేసీ, కొనీ, మోసీ ఊరూరూ తిరిగీ, అమ్మీ నన్ను చదివించినాడు. వేణ్ణీళ్లకు చన్నీళ్లు తోడుగా ఏదో ఒక స్కాలర్‌షిప్ వస్తూనే ఉండేది. నాయన యాభైల నాటి సంగతి చెప్పేవాడు, ప్రొద్దుటూర్లో వీధిన పడిన చేనేత కుటుంబాలను గురించి. తర్వాత తర్వాత ఆయా జిల్లాల నుంచి భివాండీకీ, కోయంబత్తూరుకూ పోయిన వలసల గురించి, బతుకుతెరువు కోసం పడిన అష్టకష్టాల గురించి..." చౌడేశ్వరి కంట తడిని చేతిగుడ్డతో తుడుచుకోవడం చూసి నా మనసు తల్లడిల్లింది. నిరుత్తరుణ్ణి అయ్యాను.

"అన్నా! నేను నీకంటే రీడరుగా ముందు అయినా, నా మీద కోపానికి అదే కారణం అనుకోమంటావా? కులంవల్లా, ఆ కులానికుండే రిజర్వేషన్ వల్లా మాత్రమే ఆ అయ్యే రీడరేదో అయ్యానని కోపమా?"

చౌడేశ్వరీ సూటి ప్రశ్నకు సూటిగా చెప్పగలిగిన శక్తి సన్నగిల్లింది.

"నా అర్హతలు నీకు తెలియవనుకోవాలా?" చౌడేశ్వరి అడిగింది.

"తెలుసు" అన్నాను, నీరసంగా.

చౌడేశ్వరి నా వెనుక టేబుల్ మీది మంచినీళ్ల సీసా తీసుకుంది. గ్లాసులో ఒంపుకుంది. నెమ్మదిగా తాగుతోంది.

చౌడేశ్వరి పదో తరగతి స్కూలు ఫస్టు. ఇంటర్, బి.ఏ.లో ఫస్ట్ క్లాసులు. ఎం.ఏ.లో యూనివర్సిటీ సెకండ్. పి.హెచ్‌డి. గొప్పదని విదేశీ పరీక్షకుల సిఫారసు. పరిశోధన పత్రాలు ప్రముఖ జాతీయ అంతర్జాతీయ పత్రికల్లో వచ్చాయి. టీచరుగా మంచి పేరుంది. ఇవన్నీ నాకు తెలుసు.

"పోనీ. నాకు ఏవో పెద్ద అర్హతలు లేవే అనుకుందాం. కావలసిన కనీసార్హతలు మాత్రమే ఉన్నాయనుకుందాం? తప్పా? అట్లాగే రేపోమాపో అట్లాంటి కనీసార్హతలున్న నా కులం కంటే కింది కులం మనిషికి నా కంటే ముందుగా ఏ పై పదవో వచ్చిందనుకున్నాం. ఈర్ష్య పడడం ఎందుకు? చరిత్రలో జరిగిన, జరిగే తప్పులన్నీ పోయేవరకు ఇవి తప్పవు" అంది చౌడేశ్వరి.

'అవునేమో' అన్నాను సందిగ్ధంగా.

చౌడేశ్వరి నింపాదిగా అంది:

"అన్నా! నువ్వు మంచి టీచరు వనీ, మంచి గైడువు అనీ అందరూ అంటారు. నీకు ఎవరిమీద కోపం? ఎందుకు? రిసర్చి పేపర్లు రాయటం మానేసినావు అని

విన్నా... ఆఫీసర్ల క్లబ్బుకు పోవడం మానుకోలేవా? ఎందుకు నిన్ను నీవు హింసించుకుంటావు?"

చౌడేశ్వరి పొడవవలసిన చోట పొడిచింది. బాల్యంలో గోలీలాడేటప్పుడూ, అల్లరి స్నేహితులతో తిరిగినప్పుడూ, ఎం.ఏ., చదువుకునే రోజుల్లో సిగరెట్లు తాగుతున్నది చూసినప్పుడూ చౌడేశ్వరి మందలింపులు స్మృతికి వస్తున్నాయి. నా అలవాట్లను తెలుసుకొనే, క్లబ్బు ప్రస్తావన తెచ్చిందని అర్థమైంది. చౌడేశ్వరి నిష్కాపట్యం, అపేక్ష ముందు నోరెత్తలేకపోయాను.

"రేపు ఆదివారం. నువ్వూ, వదినా, చిన్న పాపా మా ఇంటికి భోజనానికి రావాల. అన్నట్లు అసలు విషయం మరిచినా, నీ థీసిస్‌ను ప్రచురించే ఏర్పాటు చేస్తాననీ, అదనంగా చేర్చాల్సిన విషయముంటే సూచిస్తాననీ నాగరాజు మామయ్య నీకు చెప్పమన్నాడు... ఇంటికి రేపు అందరూ తప్పక రావాల, నీ మనసును నొప్పించి ఉంటే క్షమించు. చిన్నప్పుడు 'నొప్పి నొప్పో' అని మొత్తుకుంటున్నా నా జడ లాగేవాడివి. గుర్తు తెచ్చుకో... వస్తాను."

నా గదిలోంచీ బయటకు వెళ్తున్న చౌడేశ్వరి ఎంతో ఉన్నతంగా కన్పించింది.

నా పిల్లలైనా జీవితాన్ని సాధిస్తూ కూర్చోకుండా, జీవితంలో చౌడేశ్వరిలాగా ఏదైనా చక్కగా సాధిస్తే బాగుండు.

నాలో కూడా ఏదో చలనం కొత్తగా మొదలైంది.

● ఆంధ్రప్రభ ఆదిత్య హృదయం, ఆదివారం
6 ఏప్రిల్ - 13 ఏప్రిల్ 2003. ●

# పొడి నిజం

నా వంతు వచ్చింది. లేచి నిలబడినా. మా రంగయ్యసారు నిన్న చెప్పిన కతను సొంత మాటల్లో రాసినా. రాసిన కతను చదవాల. కాగితం తీసుకొని నిలబడినా. నిలబడినానో లేదో, మా సారు అరిచినాడు:

*"గంగాధరా! నోటు బుక్కులో రాసుకొని రమ్మని చెప్పినా, చిత్తు కాగితం మీద రాసుకొని వచ్చినావేం?"*

"నోటు బుక్కు అయిపోయింది సార్. కొనుక్కున్నాక మల్లా రాసుకుంటానుసార్," అన్నా.

"అన్నిటికి కరువే, నీటికీ కరువే, నోటు బుక్కులకూ కరువే", అని మా సారు గొణిగినాడు. "సరే చదువు" అన్నాడు.

అమ్మయ్య అనుకున్నాను. చదవడం మొదలుపెట్టినా.

"బగీరదుడు" అని.

"బగీరదుడు కాదు కాదు గంగాధరా! భగీరథుడు అనాల. పొల్లుల్ని మింగద్దు. రాయడమన్నా సరిగ్గా రాసినావా? ఏది చూడనీ"

సారుకు కాగితాన్ని అందించినా, చూసినాడు.

"సరిగ్గా రాసినావే. పలికేది చక్కగా పలకాల", అన్నాడు.

నేను మల్లా మొదటికొచ్చినా. సారు చెప్పినట్లు "భగీరథుడు" అన్నా.

తర్వాత చదువు అన్నాడు మా సారు.

"భగీరథుడు ఒక రాజు. ఆయన ముత్తాతకు అరవై వేలమంది కొడుకులుండేవారు. ఆ ముత్తాత పేరు సగరుడు. సగరుని కొడుకులు సాగరులు. వాల్లు..."

"ల్ల కాదు 'ళ్లే' అనాల. ఆ...కానీ"

"వాళ్ళు ఇంద్రుడు దొంగిలించిన గుర్రం కోసం బూ... బూ... భూమి అంతా వెతికినారు. కనపడలేదు. భూమిని తవ్వి పాతాళానికి పోయినారు. కపిలునికి కోపం వచ్చింధి. వాళ్ళను బూడిద చేసినాడు. భగీరథుడు వారికి సొర్గం..."

"సొర్గం కాదు స్వర్గం" అని మాస్టారు నా మాటను దిద్దినాడు.

"భగీరథుడు వారికి స్వర్గం వచ్చేటట్లు చేయాలనుకున్నాడు. దాని కోసం గంగను గురించి పెద్ద తపస్సు చేసినాడు. గంగ మనలోకానికి దిగివచ్చింది. పాతాలానికి...

"ల కాదు నాయనా గంగాధరా! ళ... ళ..."

"పాతాళానికి భగీరథుని వెంబడి పోయింది. భగీరథుని ముత్తాతల బూడిద మీద గంగ పారింది. సముద్రమైంది. సాగరులకు స్వర్గం దొరికింది..."

"ఏదీ నీ కథను చూపించు", అని సారు తిరిగి తీసుకున్నాడు. చదివినాడు. ఏమని చెప్పినాడంటే...

"గంగాధరా! తప్పులు లేకుండా రాసినావు. తప్పులతో చదువుతే ఎట్లా? రాసేది శుద్ధంగా ఉండాలి. పలుకు శుద్ధంగా ఉండాలి. భాష ఎవరి సొత్తూ కాదు. చక్కగా నేర్చుకుంటే అదే వస్తుంది. చదువుకున్న వాళ్ళ మాటలను శ్రద్ధగా వినండి. మాట్లాడండి. చదువు రానివాళ్ళ భాష, యాస తప్పుకాదు. మర్యాద కోసం చదువొచ్చిన వాళ్ళ భాషను మాట్లాడతాం. మంచి మంచి కథలు వింటే, చదివితే మంచిది. ఇది నీకే కాదు చెప్పింది. ఈ నాలుగో తరగతిలోని అందరికీ."

అందరం ఒక్కసారిగా "సరే సార్" అనినాము.

మా సారు పిల్లలందరికీ చెప్పినాడు:

"గంగాధర్ కథ బాగుంది", అని.

నాకు చక్కలిగిలి పెట్టినట్లయింది.

సారు కత మీద పాఠం చెప్పినాడు:

'భగీరథుడు తన ముత్తాతల కోసమే తపస్సు చేసినాడు. గంగను భూలోకంలో ప్రవహింపజేసినాడు. తన కుటుంబం కోసం చేసుకున్న పని. స్వార్థం అంటే ఎవరికి వాళ్ళు చేసుకునే మేలు. ఈ మేలు తనకు మాత్రమే ఉపయోగపడిందా? నలుగురికీ మేలు చేసిందా? ఇదీ అసలు గొడవ."

రంగయ్య సారు మాట్లాడేది నాకు చానా బాగుంటుంది. ఒక్కొక్కసారి అంతపెద్దపెద్ద మాటలు నా తలకాయకు అందవు.

బెల్లు మోగింది.

"పోండ్రా. రేపు మన అసలు పాఠం కొత్తది మొదలు పెడదాం" అన్నాడు.

మా పుస్తకాలు సంచుల్లో సర్దుకున్నాం. బిలబిలా, గోలగోలగా ఇండ్లకు బయలుదేరినాం.

నా సంచిని ఇంట్లో తలవాకిలి పక్క కింద గూట్లో పెట్టినా. మా అమ్మకు చెప్పినా:

"అమ్మా! రంగయ్యసారు నేను రాసిన కత బాగుంది అన్నాడు. నోటు బుక్కులో రాసుకోవాల. రెండు నోటు బుక్కులు కొనాల."

"మీ నాయన రానీలే. మీ మామా వాల్ల ఊరికి పోయినాడు - బియ్యం కోసం, అప్పుకోసం" అనింది మా యమ్మ.

మా మామ వాళ్ళకు చిన్న అంగడి ఉంది. అందుకోసం పోయి ఉంటాడులే అనుకున్నా.

మా అమ్మ చెప్పింది:

"గంగాధరూ! మీ అబ్బ పొద్దుననంగా పోయినాడు. ఇంకా ఇంటికి రాలేదు. అంబళ్ల పొద్దున సంగటి తిని పోయినాడు. పైటేల ఏమీ తినలేదు. కయాలు ఎక్కువైంది. నీలి తోట్ల దగ్గరన్నా కూర్చొని ఉంటాడు. మన పొలంకాడ ఆ కాలవ దగ్గరన్నా కూర్చోని ఉంటాడు. ఆ నీలి తొట్లూ, ఆ పూడిపోయిన బాయీ, చుట్టూ ఉండే అయిదు ఎకరాల పొలం మీ ముదెబ్బల కాలం నాటిది. తకరార్లలో అమ్ముడు పోలేదు... ఒక దాయాది మరొక దాయాది బాగుపడతాడంటే ఓర్చలేడు. పది మంది దాయాదులు కలిసి అమ్ముకోవడం కుదిరేపనా? ఇప్పుడు కొనేనాథుడు లేడు. కానీ మీ అబ్బకేమో ఆశ. సరేలే సరేలే. రోజూ ఉండేవే ఇవి. మీ అబ్బను పిల్చకరా - చీకటి పడకుండానే. చీకటి పడితే మీ అబ్బకు కండ్లు సరిగ్గా కనపడవు. చుక్కలా లొచ్చినాయి. దార్లో ఏ రాయికో, గోడకో, కంపచెట్టుకో కొట్టుకొని కిందపడితే, యాడ చస్తాంరా గంగాధరూ? పాడు రోజులు దాపురించినాయి..."

పాడు రోజులంటే ఏమిటో అవి ఎందుకొస్తాయో? పాడు మనుషులు అనే మాటను విన్నా. అంటే చెడ్డ మనుషులు. పాడు రోజులు అంటే చెడ్డ రోజులు. రోజులు చెడ్డగా ఉండడం అంటే ఏందో? రంగయ్య సారును అడగాల. మిగతా సార్లు చెప్పలేరు. రంగయ్యసారుకు తెలిసినంత మిగిలిన సార్లకు తెలియదు. నాకు ఆడుకోవాలని ఉంది. అమ్మేమో 'అబ్బను తోడుకొనిరా' అంది.

అబ్బంటే నాకు చానా ఇది. మా అబ్బకు కతలు బాగా వచ్చు. నాకంటే బాగా చదువుకున్నాడు. భారతమూ అదీ. నేను కతలు చెప్తానంటే, రాస్తానంటే మా అబ్బేనన్ను బలపరిచేది. మా నాయనకు ఎప్పుడూ సంసారం పనులే. అబ్బ ఎన్నికతలు చెప్తాడో! ఈ మద్దెన చెప్పడంలేదు. అమ్మ చెప్పినట్లు కయాలుగా ఉంటాడు. కయాలు అంటే దిగులు. దిగులు ఎందుకొస్తాది? ఏమో రాత్రి పూట

పడకునేముందు "ఏదన్నా కత చెప్పాబ్బా" అంటాను. "మనసు బాగా లేదురా" అంటూ ఉండాడు. దిగులు అంటే మనసు బాగా లేకపోవడం అన్నమాట. అబ్బ రోజూ పొద్దున సంగటి ఇంత తినిపోయి మాపటేల వస్తా ఉండాదని అమ్మ నాతో ఆ మొన్న చెప్పింది. ఆకలయితే మనసు బాగుండదేమో. నాకు ఆకలయితే దిగులు కలుగుతుంది. కోపం వస్తుంది. అప్పుడు ఎవరన్నా ఏదన్నా అంటే తన్నుదామనిపిస్తుంది. నేను పైటేల ఇంటికి వచ్చినా. అమ్మపెట్టిన సంగటి, కారం తినినా. నాకు ఆకలి లేదు. కోపం రాలేదు. అసలు ఆకలి అనేది ఎందుకుండాలి? ఆకలి లేకుండా చెయ్యొచ్చు గదా, ఎవరన్నా?

"గంగాధరూ! ఏందిరా కూర్చోని ఆలోచన చేస్తండావు. పోయిరా నాయనా! ఆ పెద్దాయనను ఇంటికి తీసుకరా", అనింది మా యమ్మ.

"పోతాండాలే అమ్మా!" అన్నా.

మా అమ్మకు మా అబ్బ అంటే చానా ప్రేమ. ముసలోడు గదా! మాజేజి ఆ నడమ చచ్చిపోయింది గదా. మా నాయన ఊర్లో ఉన్నా, లేకపోయినా పనులు ఏమన్నా ఉంటే చూసుకుంటాడు. పనులుంటే ఊరికే కూర్చోడు. మా పెదనాయనలు, వాళ్ళ పిల్లలున్నారు. నాకంటే పెద్దోల్లు. వాళ్ళ మీదకంటే మా అబ్బకు మా మీదనే ఇష్టం. వాళ్ళకు అబ్బంటే పడదు. కోడి గోసుకున్నా పిలవరు. వేరుబోయినారు గదా! వేరుబోతే ప్రేమ లుండవంట. ఎందుకుండవో?

మా రంగయ్యసారు ఒకసారి చెప్పినాడు. ఎవరో గురజాడ అనే ఆయన ఉండాడంట! ఆయన చెప్పినాడంట: 'ప్రేమనిచ్చిన ప్రేమ వచ్చును' అని. మరి మా అబ్బ ఇవ్వాలనుకుంటే వాళ్ళు తీసుకోవాల గదా? ఇదేందో?

మా అమ్మ కసిరింది: "గంగాధరూ! చెప్పింది వినరా! అబ్బను పిల్చుకొని రారా. నా బయం నాది"

అబ్బ కోసం బయలుదేరినా, దారిలో బాలమ్మ కనపడింది. బాలమ్మంటే మూడో తరగతిలో నా తరగతే. ఇప్పుడు స్కూలు మానేసింది. మేకనూ, రెండు మేక పిల్లలనూ తోలుకొని వస్తా కనపడింది.

"నూకలిస్తా, మేకలు కాస్తావా?" అని అడిగినా. ఏడిపించాలనిపించింది. అడిగినా.

"యాడిస్తావు? పండితే గదా?" అంది బాలమ్మ

"పండకపోతే అంగట్లో దొరుకుతాయి గదా?" అన్నా.

"అంగట్లో అన్నీ దొరుకుతాయి. అల్లుని నోట్లో శని!" అనింది బాలమ్మ, బాలమ్మ మాటకు మాట అంటిస్తుంది. అందుకే నాకు ఇష్టం.

"అల్లుడెవరూ?" అన్నా. బాలమ్మను ఉడికించడం నాకు బలే బాగా ఉంటుంది.

"నా మొగుడూ, నీ మొగుడూ" అంది.

ఆడోళ్లకు మొగుళ్లు ఉంటారు. మొగోళ్ళకు మొగుళ్ళు ఉండరు. ఏందో? తిక్క మాటలు, అనుకున్నా, బాలమ్మకు చదువు బాగా వచ్చేది. జరుగుబాటు లేక మానేసిందంట! నాకు కూడ అది అనుకుంటే బయమేస్తాంది.

"ఏందో నబ్బా గంగాదరూ! మా నాయన దేశాంతరం పోయినాడు - పని కోసం. నాకు చానా పని ఉంది. ఇంటి దగ్గర" అంటూ పోయింది.

నీలి తొట్ల దగ్గరకు పోయినా. తొట్లో గొర్లు, మేకలు పడుకొని ఉన్నాయి. ఆ పక్కన ఒక చిన్న మిద్దె ఉంది. దాంట్లో గొర్లపెంటికలు, మేక పెంటికలు తప్ప ఏమీ కనపడలేదు. మా అబ్బ ఆ చుట్టు పక్కల కనపడలేదు. మా పొలం దగ్గరకు పరిగెత్తినా, 'ఎంతెంత దూరం చానచాన దూరం' అని పాడుకుంటూ. పొలాలంబడి అడ్డంగా పరిగెత్తినా. నాకేం బయంలేదు.

పొలాల్లో ఒక్కరు కూడ కనపడలేదు. ఒక్క పురుగులేదు. ఒక పిట్టలేదు. విత్తనం వెయ్యలేదు. పైరు లేదు. మా అయిదెకరాల చేను వచ్చింది. అది కూడ మిగతా వాటి మాదిరే శుబ్బరంగా తుడిచిన పలక మాదిరి ఉంది - అచ్చరాలు తుడిచేసిన పలక మాదిరిగా. మా చేనులో నుంచి చూసినా. కాలవ కనపడతాంది. జమ్మిచెట్టు కనపడతాంది. జమ్మిచెట్టు కింద ఎవరో కూర్చొని ఉన్నారు - తల మీద ఒల్లె గుడ్డ వేసుకొని. అట్లా వేసుకునేది మా అబ్బే!

బాగా చూసినా... మా అబ్బే...

'అబ్బా!' అని గట్టిగా అరిచినా. మా అబ్బలేచి నిలబడినాడు.

"ఒరేయి గంగాధరా! ఇక్కడకు, ఇక్కడకురా. పరుగెత్త మాకు. రాయోరోప్పో కాళ్లకు కొట్టుకుంటుంది. నిదానంగా రా" అని మా అబ్బ అరిచి చెప్పినాడు.

మా అబ్బ ఒత్తులను నాకంటే బాగా పలుకుతాడు. కాలవగట్టు మీద ఉండే జమ్మి చెట్టు దగ్గరకు గెసపోసుకుంటా పోయినా. మా అబ్బ దొరికినాడు.

"నువ్వెందుకు ఇంత దూరం వచ్చినావు రా?" అని అడిగినాడు.

"నీ కోసమే. అమ్మ పిల్చుకొని రమ్మనింది. చీకటి పడతే నీకు కండ్లు సరిగా కనపడవని చెప్పింది" అన్నా.

"పగలే చీకటి పడింది గంగాధరా!" అన్నాడు.

మా అబ్బ ఆకాశంపైకి చూస్తా ఉండాడు. దూరంగా ఉండే కొండ చూస్తా ఉండాడు. పొలాలు చూస్తా ఉండాడు. కాలువలోకి చూస్తా ఉండాడు. పెద్దోల్ల వేదాంతం నాకు అర్థం కాదు.

అబ్బ తన కుడిచేత్తో నా కుడి చెయ్యిని పట్టుకున్నాడు. మెల్లగా గెట్టు దిగుతూ కాలువలోకి తీసుకపోయినాడు. కాలువ నడుమ నిలబడినాడు. నేనూ నిలబడినా.

"ఇది పులివెందల కాలవ కథ గంగాధరూ!" అన్నాడు.

ఆ కథేదో విని, తొందరగా ఇంటికి పోవచ్చు. ఇంకా పొద్దుంది. అనుకున్నా, "చెప్పబ్బా అన్నా."

•

"ఇది జరిగిన కథరా గంగాధరూ. నలభై ఏండ్లు పైగా అయింది. మా కళ్ళ ముందు జరిగింది. ఈ కథలోని వాళ్ళంతా రైతులే. ఈ కాలవ కోసం పెద్దపెద్ద సభలు జరిగినాయి. రైతులంతా ఒక్కతాటి మీద నిలిచినారు. రైతుయాత్ర జరిగింది. రైతులం పోలీసుల దెబ్బలు తిన్నాం. జైళ్లకు కూడా పోయినాం. ఆ పార్టీలేదు. ఈ పార్టీ లేదు. అందరూ ఒక్కటే. అందరికీ కావలసింది ఒక్కటే. కాలవ. ముఖ్యంగా శివరామిరెడ్డి అనే ఆయన ఉండేవాడు. అచ్చం గాంధీతాత మాదిరి అనుకో. జగమొండి. ముతక పంచెలో రైతే. 'కత్తులొద్దు కఠార్లొద్దు, ఈ తంపులు లొద్దు, ఏమొద్దు, నలుగురం కలిస్తే మనమే పులులం' అనేవాడు. కాలవ కోసం తిండి తిప్పలు మాని పది రోజులు కూర్చున్నాడు. అప్పటి సభలు, అప్పటి నాయకులు, పాటలు మరిచిపోదామన్నా, మరిచిపోలేము.

కాలవ ఎట్లాగో వచ్చింది. చివరకు కాలవలో నీళ్లొచ్చిన రోజు గంగధరూ! పెద్ద పండుగ అనుకో. ఊరు ఊరంతా కదిలి వచ్చింది. కాలవ గెట్ల మీద నిలబడి చూసినారు ఆడోళ్లూ, మగోళ్లూ, పిల్లా పిసుకూ, ముసలీ ముతకా. మా జన్మల్లో అన్ని నీళ్లు కాలవలో పారతా ఉండగా చూడలేదు. వానాకాలంలో రెండు మూడు రోజులు వంక పారితే చూసిందే. నేను కాలవ నీళ్లల్లో దిగినా. దోసిళ్ళలో నీళ్లు నెత్తి మీద పోసుకున్నా. ఆ నీళ్లు తాగినా గంతులేసినా, చూసినోళ్లంతా నాకు పిచ్చిపట్టిందనుకున్నారు.

ఒక పంటకే నీళ్లు వదిలినా, బతుకులు మారినాయి. కాలవ పక్క బావుల్లో ఊటలు పెరిగాయి. మనకు బావి లేదు. అది మీ ముగ్గురు పెదనాయనల భాగానికి పోయింది. చంకలు గుద్దుకొని చీని చెట్లు వేసుకునే వాళ్ళు వేసుకున్నారు. వడ్లు పండించే వాళ్లు వడ్లు పండించుకున్నారు. మనమూ పండించుకున్నాం - చెనక్కాయల్నీ, నల్లకుసుమల్నీ, మిరపనీ. ఈ సారి మాత్రం ఈ కాలవలోని మట్టీ, రాళ్ళూ నెత్తిమీద కొట్టుకోవాల్సిందే. నిమ్మచెట్లు వేసుకున్నోళ్లకు నీళ్లు లేవు. ఎనిమిది నూరు, వెయ్యి అడుగులు పాతాళంలో బోర్లు వేసుకున్నారు. చుక్క నీళ్లు పడలేదు. పైగా చీనీ చెట్లకు బంక తెగులు. మనుషులకు అప్పుల తెగులు.

ఇప్పుడు చూడు. కాలవలో గడ్డిపరక కూడ ఎండిపోయింది. గోరీ గుంత మాదిరి ఉంది. అప్పుడు గండిపేట, తొగరుపేట, ఇంకా ఏదో అన్నారు.

ఇప్పుడు చిత్రావతి చిత్రావతి అంటున్నారు. ఇంకేమంటారో తెలియదు. కనపడిన చోటల్లా రాళ్ళను పాతి పెట్టి పోతారు. మన కొండవార ఉండాయే ఆ పనికిరాని తంగేడు, జిల్లేడు చెట్ల మాదిరి - ఆ ఎండిపోయిన కంపచెట్ల మాదిరి ఉంది మన బతుకు. గడ్డి లేదు గాదం లేదు. సాగు నీరు లేదు. తాగే నీరుకూ కటకటే... అప్పిచ్చేవాడు లేదు. ఇదీ మనకథ!"

ఇది కథా? ఏమో నాకు తెలియదు. కత మాదిరుంది; కత మాదిరిలేదు.

"పోదాంపద అబ్బా! అమ్మ ఇంటికాడ ఎదురు చూస్తా ఉంటాది" అన్నా.

మా అబ్బ ఏమనుకున్నాడో ఏమో, మా అబ్బ మోకాళ్లు పట్టుకొన్నాడు. మెల్లగా కాలవను ఎక్కినాం. ఇంటి దారి పట్టినాం. దారిలో మా అబ్బ ఏమీ మాట్లాడలేదు. ఏందో ఆలోచన చేస్తా ఉండాడు. మా అబ్బ ఆలోచన నాకు తెలియదు. నా ఆలోచన మా అబ్బకు తెలియదు. విచిత్రం! తెలిస్తే కాలవలో నీళ్లొస్తాయా?

రాత్రి అన్నం తిన్నాం. ఇంటి బయట మంచాలు వేసుకున్నాం. నేనూ అబ్బా పక్కపక్కన మంచాలు వేసుకున్నాం. మా అమ్మ ఇంకా ఇంట్లో ఏదో పనిలోనే ఉంది. అమ్మకు ఎప్పుడూ పనే. అదేం పనో? బాలమ్మకూ పనే అంట!

మా ఎదురింట్లో నుంచీ టి.వి. పాటలు విన్పిస్తా ఉండాయి. ఆ పెదనాయన రోడ్డు పనులు తీసుకున్నాడు. టి.వి. కొన్నాడు. మాకు టి.వి. లేదు. వాళ్లింటికి పోయి టి.వి. చూడాలని నాకు లేదు. దిగులుగా ఉంది.

మా అబ్బ వైపు చూసినా. వెల్లకిలా పడకొని ఆకాశం దిక్కు చూస్తా ఉండాడు. నేనూ చూసినా. ఆకాశం మా ఊర్లో కుమ్మరాము మాదిరి ఉంది. చుక్కలూ లేవు, గిక్కలూ లేవు. గాలి మాత్రం అంతో ఇంతో ఆడతా ఉంది.

మా అబ్బ నా వైపు తిరిగినాడు.

"గంగధరా! ఇక్కడికి రా" అని పిలిచినాడు. అబ్బ లేచి కూర్చున్నాడు. నేను అబ్బ పక్కన కూర్చున్నా.

"కుమ్మరాయనా, రాచపుండు కథ గుర్తుందా గంగాధరూ?" అని అబ్బ అడిగినాడు.

"ఉంది అబ్బా!" అన్నా. నాకు ప్రతి కతా గుర్తుంటుంది. ఒకసారి వింటే చాలు.

"ఆ కథ చెప్పు" అని మా అబ్బ అడిగినాడు.

మా అబ్బ ఈ కతను నాకు ఎప్పుడో చెప్పినాడు. నేను ఇప్పుడు మా అబ్బకు చెప్తా ఉండ:

"ఒక కుమ్మరాయనకు వీపు మీద రాచపుండు పుట్టిందంట! దాంతో ఒకటే దురద పుట్టిందంట. కుమ్మరాయనేమో కుండలు తట్టుకోవాల. దురద అడ్డంగదా? కుండలు తట్టుకునే తబ్బకతో దురదపుట్టినప్పుడల్లా తపాతపామని వీపు మీద కొట్టుకునేవాడు. ఎక్కడంటే, పుండు దురద పుట్టిన దగ్గర. రాచపురుగు తబక దెబ్బలకు తట్టుకోలేకపోయింది. 'వీడేమో ఇట్లా కొట్టి చస్తా ఉండాడు. వీడి దగ్గరుంటే నేను చస్తాను. రాజు దగ్గరకు పోతా' అనుకుందంట. పని లేని రాజు దగ్గరే ఉండిపోయింది". కతముగించి, "ఇంతేగదా అబ్బా" అన్నా.

మా అబ్బ పకాపకా నవ్వినాడు. నేను నవ్వినా

"గంగాధరా! దీనికి ఒక తోక కథ ఉంది. నేను ఇంతకుముందు చెప్పడం

మరిచిపోయినా. ఇప్పుడు జ్ఞాపకం వస్తాంది. వింటావా? నిద్రవస్తాందా?" అని అబ్బ అడిగినాడు.

"నిద్దర పట్టలేదులే అబ్బా! కత వింటా. చెప్పు" అన్నా.

"పని లేని రాజు దగ్గరకు రాచపుండు పోయిందని చెప్పినావు గదా?" అని అడిగినాడు.

"అవును" అన్నాను.

"అయితే విను... రాజు దగ్గర ఒక రాజ వైద్యుడుండాడు. ఆ ఆకు నూరినాడు. ఈ ఆకు నూరినాడు. కల్వంలో ఆ మందు నూరినాడు. ఈ మందు నూరినాడు. ఆ పసరు పూసినాడు. ఈ పసరు పూసినాడు. ఆ గుళికలు తినమన్నాడు. ఈ గుళికలు తినమన్నాడు. పుండు మానలేదు. పుండు మాన్పించినోళ్లకు అర్థ రాజ్యం ఇస్తానని చాటింపు వేయించినాడు రాజు. దేశదేశాల నుంచి వైద్యులు దిగినారు. మంత్రగాళ్ళు దిగినారు. ఆ రాచపుండు వైద్యులకు లొంగలేదు. మంత్రాలకు చింతకాయలు రాలవు. రాచపుండుకు భయమేసింది. వీళ్లంతా తనను మందుల్తో మాకుల్తో చంపుతారని దిగులు పడింది. 'ఎక్కడికి పోతామబ్బా?' అని ఆలోచన చేసింది. రాజ్యమంతా కరువు. పనిలేని రైతు కనబడినాడు. వేలాది మంది రైతులు కనబడినారు. 'వీళ్లైతే మంచిది. తిండి తిప్పలకు చస్తా ఉందరు. వైద్యమెక్కడ చేయించుకుంటారు? రేపోమాపో బాధపడి బాధపడి చచ్చిపోతారు, నా దెబ్బకు' అని అనుకున్నిందంట! అనుకొనీ అనుకొనీ రైతుల మీద ఒక్కసారిగా వచ్చి వాలింది. రైతులకు పెద్ద రాచపుండ్లు వచ్చినాయి."

అబ్బ కతను ముగించినాడు. మా అబ్బ మాటలు వణికినట్లు అనిపించింది. 'ఏందో?' కత విని నేను పెద్దగా దిగులు పడినా. మా అబ్బ పక్కనే నిద్దరపోయినా.

రెండు మూడు రోజులు మా అబ్బచెప్పిన కతను గురించి ఆలోచించినా. భగీరథుడు గంగను తెచ్చి, రైతుల రాచపుండ్లు మీద పోయేటట్లు చేస్తే రాచపుండ్లకు తిక్క కుదురుతుంది, అనుకున్నా. అంతే, కత రాసిపెట్టుకున్నా, కాగితం మీదే. మా నాయన ఇంకా రాలేదు. నోటు బుక్కులను నేను కొనలేదు.

కత తీసుకొని మా రంగయ్య సారు ఇంటికి పోయినా. బెరుకు బెరుకుగా కాగితం కతను ఇచ్చినా. 'ఏంది?' అనలేదు. చూసినాడు. చదివినాడు. మా రంగయ్య సారుకు కండ్లనీళ్లు వచ్చినాయి. కత చదివితే కండ్ల నీళ్లు వస్తాయా? వింటే వస్తాయి, అనుకున్నా.

కండ్ల నీళ్లు తుడచుకుంటూ రంగయ్య సారు అన్నాడు:

"గంగాధరా! రైతులకు పుట్టింది కరువు రాచపుండ్లు, నువ్వు బాగా రాసినావు. భగీరథుడు గంగను తెచ్చి పుండ్లను కడిగి పోగొట్టాలని. ఇప్పుడున్న భగీరథులకు మన రైతులు, వాళ్ళ తాతముత్తాతలు కాదు..."

ఇప్పుడున్న భగీరథులెవ్వరో నాకు తెలియలేదు. ఓహో! ఇప్పుడు అట్లాంటి రాజులు లేరు కదా? ముఖ్యమంత్రులు, మంత్రులు మాదిరోల్లు ఉండారు. ఏందో? ఇదంతా గొడవ, గొడవ. అయోమయం అంకాలమ్మ తిర్నాల.

పెరిగి పెద్దవుతాను గదా? రంగయ్యసారు భగీరథుని కత చదివినప్పుడు చెప్పినాడు గదా: "నలుగురికీ మేలు చేసేది ఉందా? లేదా?" అని. అదెట్లాగా? ఎట్లాగంటే గంగను మా ఊరికి తేవాల. అంతే. ఆరు నూరుగానీ గంగను తేవాల. అన్ని ఊర్లకూ తేవాల. తెచ్చి తీరాల... అంతే... అయితే, అంత దాకా ఇంతేనా?

● ప్రస్థానం, ఏప్రిల్-జూన్ 2003. ●

# విరూపం

ఇది వార్తో, వార్తా వ్యాఖ్యో, వార్తా కథనమో, ఫీటీయో, ముఖాముఖియో మరేదో చదివిన వెంటనే నా ఊహకు అందటం లేదు. ఈ మాత్రం రాయగలిగిన గ్రామీణ విలేకరి మా పత్రికకు ఉన్నాడా? అని ఆశ్చర్యపడ్డాను. రచన నిడివీ ఎక్కువే. నిర్మాణమూ కొత్తదే. రచనలో వాడిన రెండు రకాలైన శైలుల్లో ఒకటి పత్రికా భాషకు సరిపడేది. మరొకటి పత్రికా భాషలో పూర్తిగా ఇమడదంది. ఇలాంటి రచనను ప్రచురించాలో ప్రచురించకుండా చంపాలో, ప్రధాన పత్రికలో వచ్చేందుకు హైదరాబాదుకు పంపాలో తోచటం లేదు.

వచ్చి పడిపోతున్న వార్తల కూర్పు పని ఒత్తిడిలో సతమతమవుతున్నాను. అంత ఇబ్బందిలో కూడా మా గ్రామీణ విలేకరి పంపిన రచనను మళ్ళీ ఒకమారు చదివి నిర్ణయం తీసుకోవాలనుకున్నాను – ప్రాంతీయ కేంద్ర బాధ్యుడిగా. కంప్యూటరు తెరమీదే మొదటినుంచీ చదవటం మొదలు పెట్టాను:

## నీరూ - పైరూ

**తిప్పలూరు, ఏప్రిల్ 1. అది స్వర్ణాంధ్రప్రదేశ్‌లో ఒక చిన్న పల్లె. మజరా గ్రామం. పేరుకు వేపమాన్ల పల్లె. ఒకప్పుడు వందలాది వేపచెట్లుండే వనాలు గ్రామ నెత్తంలో ఉండేవని స్థానికులు చెప్పారు. ఇప్పుడు ఊరి పేరులో ఏదో ఉందనే దానికి గుర్తుగా ఊళ్ళో ఏ వేపచెట్టూ మిగలలేదు. ఒకప్పటి చీనీ తోటలూ లేవు. మూడు మట్లకు పైగా నీళ్లతో కలకలలాడిన బావులూ లేవు. ఆ బావుల కింద తోటల్లో ఒకప్పుడు కనిపించిన చిలకపచ్చదనమూ లేదు. పూడిన బావులూ, ఎండిపోతున్న బోర్లూ**

మాత్రమే కన్పిస్తాయి. మెట్టచేల గట్ల మీద ఒకప్పుడున్న తుమ్మ, రేగు, కానుగ చెట్లు ఇప్పుడు కలికానికి కూడా కన్పించవు. ఇప్పుడా పల్లె సిమెంటు ధూళి ధూసరావృతమైన పర్యావరణ సీమ; నింగి కెగిరి, నేల తాకి, పల్లె ప్రజల నాసికాపుటాల ద్వారా ఊపిరితిత్తుల్ని చుట్టుకుంటున్న సిమెంటు గాలి దుమ్ము క్షేత్రం. ఈ జన్మభూమి, సిమెంటు కర్మాగారాల లీలా విలాస కేళికి నర్తనశాల. ఈ కర్మభూమి, అన్నదాతలు ఫ్యాక్టరీ కార్మికులుగా మారిపోయిన అభివృద్ధి హేలకు రంగమండపం. ఫ్యాక్టరీకి వెళ్ళని సమయాల్లో, పల్లెలో ఇళ్ళ దగ్గరే ఉండిపోయిన పెద్దా చిన్నా, ముసలీ ముతకా, మహిళల తోడుతో, నిరుద్యోగ రైతు కూలీల తోడ్పాటుతో, అమ్ముకున్నవి పోగా మిగిలిన పొలాల్లో పంట కోసం కార్మిక రైతులు చేస్తున్న జయమెరుగని పోరాటభూమి ఇది!

ఉప్పర గురప్ప కథనం ప్రకారం:

'మా ఊరు నుంచా? దాపుదాపు నలభై మంది ఫ్యాక్టరీకి పోతాఉండాం అన్నా!' పల్లెలో ఉండేదా? యాభై ఇండ్లు. ఈ కులమని ఆ కులమని లేదు. మొత్తం అందరం పోతా ఉన్నట్లే. పెద్ద కులం లేదు. చిన్న కులం లేదు. అంతా ఒక దారే... అం భూమి ఉండే రైతు కుటుంబాలూ ఆ దారే; లేని కుటుంబాలూ ఆ దారే. నలభై ఎకరాలుండే కాపోల్ల పిల్లోడూ వస్తా ఉండాడు - ముప్ఫయి ఎకరాలుండే కమ్మోళ్ళ పిల్లోడూ ఉండాడు. అట్లాగే పద్దైదెకరాల గొల్లోల్లూ, ఆఖరికి రెండెకరాలోళ్ళూ ఫ్యాక్టరీ పనికి వస్తా ఉండారు. భూమి లేని కొదమోల్ల సంగతా? వాల్లూ ఉందారన్నా. రెండింట్ల మంగలోల్లు, మూడిండ్ల వడ్డోల్లు, ఒకింటి భట్రోజోళ్ళు, ఒక నాలుగిండ్ల బోయోళ్ళు, ఒక సాయిబుల ఇంటినుంచి వస్తాందారు. మర్చిపోయినా బోయోల్లకు భూమి ఉంది.

నాకా? ఆరెకరాలుంది. ఏం లాభంలే అన్నా. ఇప్పుడు మూడేండ్లయింది. విత్తనాలకూ, పెట్టుబడికీ - అదే సేద్దెం. దుక్కి దున్నదానికీ... దుక్కికి ఏన్నూటా యాభై. పాసిందానికి ఇన్నూటా యాభై. నాలుగు మూటెలు ఫాస్పేటు పదార్నూర్లు. కలుపులకూ దానికీ పంతొమ్మిది నూర్లు - విత్తనాలకు పదార్నూర్లు. లెక్కేసుకో అన్నా. చిల్లర మల్లర ఖర్చులు కలుపుకొని యాదాదికి తొమ్మిదివేలు. మూడేండ్లకు ఎంతయింది? ఇరవై ఏదువేలు - ఏం పంట వేసినానో చెప్పనేలేదు. కుసుమలు - నల్ల కుసుమలు - పొద్దు తిరుగుడు అంటా ఉన్నా - సన్‌ఫ్లవర్ అంటా ఉన్నా? అన్నా! ఆ పంట - అదే కొంప ముంచింది, వరసగా. రాబడా? వచ్చింది బ్రహ్మాండంగా తలకాయ తిరిగేటట్లు - అయిదు నూర్లా నలభై రూపాయలొచ్చింది - ఒక కింటాలు కూడా రాలేదు. నలభై కేజీ లన్నా!

ఎందుకింత అద్వాన్నమా? వర్షం ల్యాకనే. జొన్నో గిన్నో వేసుకుంటే ఇన్ని తిండిగింజలన్నా దక్కేవి అంటావా? బాగా చెప్తావన్నా! స్టోరు బియ్యం వచ్చినాక జొన్న లెవడు తింటాడు? నువ్వు తింటా ఉండావా? వాటిని నానబెట్టాల. దంచి పొట్టు దియ్యాల. ఎండ బెట్టాలా? నూకలు విసరాల. ఎసుట్లో పొయ్యాల, గెలకాల. బండమీద ముద్దలు చెయ్యాల. ఎంత పని? ఒక తట్టు నేను ఫ్యాక్టరీకి పోతానా? నా పెండ్లాం కూలికి పోవాల్నా? బోరింగు కాడనుండి నీళ్ళు మోసుకుని తెచ్చుకోవాల్నా? ఇంటి

పనులన్నీ చూసుకోవాల్నా? ముగ్గురు కొడుకులు బడికి పోవాల్నా? మా అమ్మా నాన్నా లేకపోయిరి. నేను ఫ్యాక్టరీ పనికి గ్యాప్ వచ్చినప్పుదల్లా పొలం పనులు చూసుకోవాలా? జొన్న సంగటి ఎక్కడవుతుందన్నా? కొర్రల సంగతి అంతే. నీకు తెలిందేముంది? తిండి పంటల కంటే దబ్బు పంటలే మేలనే కదా కుసుమల్నో, పత్తినో వేసేది. దబ్బుంటే ఏవైనా కొనుక్కోవచ్చు. ఏమంటావు?

నా భార్యా.? ఇంటి దగ్గరే ఉంటాది. ఏదన్నా పనికి పోతాది. మిగతా ఇండ్లల్లో ఆడోళ్ళ సంగతంటావా? ఫ్యాక్టరీకి నలుగురైదుగురు ఆడోళ్లు వస్తాందారు. పిల్లి రామయ్య కూతురు, మొగుడు పోయి పుట్టింటికి చేరిన కుంటి సుబ్బయ్య కూతురు, మంగలోల్లామె వస్తాందారు. బుదన్ సాయిబు పెండ్లాం - బూబమ్మ - ఆ పర్దా ముసుగు తీసి వస్తాంది. ముసుగులో ఏంది ఉందన్నా? అంతా బతకడంలో ఉంది. బూబమ్మ దేవత అనుకో - బీబీ నాంచారి. పెద్ద రైతుల కుటుంబాల ఆడబిడ్డ ఎవరూ రావడం లేదు.

ఫ్యాక్టరీలో ఆడోళ్ళు చేసే పని ఏందంటావా? సిమెంటు పొడరు కింద పోతాదే, దాన్ని ఊడ్చి మిషన్లో పోసే పని. ఏందో పిల్లేజి ఎల్పర్లు అంటారే వాళ్ళను - ఆ పని. కూలి సంగతా? మొగోళ్ళ కంటే తక్కువేలే. పని లేనప్పుదు వీళ్ళు కూడా పొలం పనులకు పోతారు - ఇంటి పనులూ అవీ చూసుకొని. వాళ్ళకే పని ఎక్కువంటారా? అవున్లే - పిల్లల్ని చూసుకోవాల. వందాల. మా జేజి, మా యమ్మ, నా పెండ్లాం కంటే ఎక్కువ పని చేసేవాళ్ళు. ఏందో అది అంతేనన్నా!

మొగోళ్ళు చేసే పనా? లోడింగు. కష్టమైందే. నెలకు ఎంతిస్తారంటావా? నెలంతా పనిచేస్తే - అంటే కనీసం ఇరవై అయిదు రోజులన్నా పని ఉంటే పదైదు నూర్లు వస్తాది - ఖర్చులు పోను. టిఫినుకు ఆర్రూపాయలు. అన్నం పది... మాకు ఫ్యాక్టరీ క్యాంటీన్లో ఇవ్వరు. దినకూలీ వాళ్ళం కదా? టన్నేజీ మీద మా కూలి పడతాంది. మేమేం చదివినోళ్ళం కాకపోతిమి. ఈ పల్లెలో ఒక సెంటు పొలాన్ని కూడా ఫ్యాక్టరీ తీసుకోలేదు. ఇక్కడా దరిద్రమే. ఈ పల్లె పొలాల కింద ఏ రాయీ లేదంట - పనికి రాని మొరం తప్ప. అందుకే నన్నా చెప్పేది - మేమంతా లేబరు - కరెంటు పనోళ్ళు, పిట్టర్లు, వెల్డర్లు కాదు. లోడింగోల్లం.

ఈ ఫ్యాక్టరీ వల్ల మంచి జరిగిందా? చెడ్డ జరిగిందా? అంటావా? జరిగినోల్లకు జరుగుతానే ఉంది. జరగనోల్లకు జరగడం లేదు. ఎక్కువ పొలముండే వాల్లుందారా? వాల్లకు అంతో ఇంతో పందుతుందా? ఫ్యాక్టరీకి కూడా పోతా ఉందారా? ఒకరో ఇద్దరో అట్లా మిగిలించుకుంటూ ఉందారు. ఫ్యాక్టరీకి రావదానికి ఒకరిద్దరు మోటారు సైకిళ్ళు కొనుక్కున్నారు. టి.వి.లు కొనుక్కున్నారు. కొంతమందికి సైకిల్లుందాయి. కొంతమంది ఆటోల్లో వచ్చి పోతా ఉందరు - రాను పోనూ నాలుగు రూపాయలిచ్చి. ఇంకా కొంతమందీ, ఆడోల్లూ నడిచే వస్తాందారు. ఇదే మంచిది అనుకో. కర్చులు పెరిగినాయా? జల్సాలు పెరిగినాయా? గుడ్డ గురుసా మారిందా? నాలోంటోల్లం కొందరం సంచుల్లో సారా తాగడం మానేసి, రమ్ము తాగుతూ ఉందామా? రోజూ కాదనుకో. వారానికి ఒక మారాన్నా మాంసం తెచ్చుకోవాలా? చపాతీలో, పూరీలో

చేసుకోవాలా? ఇది మంచో చెడ్డో నాబోటి వాడికి తెల్దు. బతుకు మాత్రం మారింది. యాపారాలు చేసేవాల్లు మాత్తరం మా కంటే బాగుండారు. మేము పొలాన్ని వదులుకోలేము. ఫ్యాక్టరీ పనినీ వదులుకోలేము. ఏది పోయినా, ఎట్లా బతుకుతామో తెల్దు. నువ్వే చెప్పు?

తాగడం తప్పో కాదో నాకు తెల్దు. మా నాయన సారాయి కాచేవాడు. అమ్మేవాడు. తాగేవాడు. నా సంగతి చెప్తా. షిఫ్టు నుంచి బయటపడతానా? ముక్కులోకి, దొమ్మల్లోకి ఏం పోతాందో తెల్దు. ఒంటిమీద ఎంత దుమ్ము అంటుకుంటుందో తెల్దు. ఏం జరుగుతాదో యాద పట్టించుకుంటాం? నిండా మునిగినాక చలేముందన్నా? ఇంటి కొచ్చాక ఇన్ని వేన్నీల్లు పైన పోసుకునేది – ఇంత గొంతులోకి రాత్రిపూట రమ్మో, సారాయో పోసుకునేది. ఇంత కడుపులోకి తినేది... పగలైతే డూటీ. లేకపోతే మల్లా పొలం పని ఏదో ఒకటి ఉండనే ఉంటుంది. చెమటలు కార్చుకోవడం తప్పదన్నా!

మా ఆరోగ్యమన్నా ఫ్యాక్టరీ మేనేజ్‌మెంట్ చూస్తాదా అని అడుగుతాండావా? రెగులరు ఎంప్లాయిలకు మాదిరి మమ్మల్నీ చూడాలని కొట్లాడతా ఉండాం. వాల్లకిచ్చే సవుకర్యాలు మా కివ్వాలా వద్దా? జీతం సంగతి కాదు నేననేది – మిగతావి.

ఇదంతా సరేనన్నా! ఫ్యాక్టరీలో కొత్త సామాన్లు వేస్తే మాకు ఇంకా బాగుంటుంది. ముప్పయి రోజులు పని దొరుకుతుంది. పట్టుకునేది పోనూ రెండువేలా ఇన్నూరు దాకా గిట్టుతుంది. ఇప్పుడా? చెప్పినా గదా అన్నా? మూన్నాల్ల కొకమారి నిలబెడ్తారు. ఈ నెలల్లోనే మూడు మాట్లు సట్‌డవును. పనిలేకపోతేనా? ఏముంది? వారం గానీ పది దినాలు గానీ బయట ఉండాల్సిందే – ఇంటి కాడే. పని చేస్తేనే దబ్బులొచ్చేది. ఆం యూనియన్లుండాయి, గలాటాలు పోయినాయి. యూనియన్లు చేసేకాడకి చేస్తాండాయి. మేనేజ్‌మెంట్ చెయ్యాల గద! 'కొత్త సామాన్లు వస్తుండయి. ఇదో బిగిచ్చాం' అంటారు. కొన్నేమో రావడం – బిగిచ్చడం. అన్నీ మార్చరు, ఒక్కమాటు. ఇదిట్లాగే... చట్టిలో కూడు, చట్టిలో ఉండాల, పిల్లలేమో బలంగా ఉండాల అంటే ఎట్లా కుదురుతుంది? ఫ్యాక్టరీ నడిస్తేనే టన్నేజి పెరుగుతుంది. టన్నేజీ పెరిగిపోతే మాకు లాబం.

మా కంటే వాల్లకే బాగా లాబం గదా? అంటుండావా? వాళ్లు తింటే తిననీ. మాకు ముప్పయి దినాలు పని దొరికితే చాలు. గవర్నమెంటు అన్నిట్నీ అయిన కాటికి ప్రైవేటోల్లకు తెగనమ్ముతావుందంట! ప్రైవేటోల్లు లాబం చూసుకోకుండా ఏదన్నా కొనుక్కుంటారా? నడుపుతారా? గవర్నమెంటు పాలసీ అది. ఈ ఫ్యాక్టరీలోల్ల పాలసీ ఇది. 'ఏం చెయ్యాల చెప్పు – చేతుల కష్టం అమ్ముకోక? అయినా ఈ ఫ్యాక్టరీని మద్రాసు బాపనోల్లు తీసుకున్నాక కొంత మేలేలే – గలాటా లన్నీ తగ్గినాయి. ఎట్లనా? ఎందుకా? ఎక్కడ పడేసేది అక్కడ పడేచ్చి ఉంటారు. యాద పట్టుకునే వాల్లను ఆద పట్టుకుంటూ ఉండారు.

ఫ్యాక్టరీ వల్ల పైర్లు దెబ్బతినలేదంటావా? 'పసుప్పచ్చటి చందమామ మాదిరుండే కుసుమ పువ్వుల మీద బూడిదరంగు సిమెంటు చూల్లేదా' అంటావా? అన్నా! అన్నీ మా కండ్లతోనే చూచ్చానే ఉండాం – కనిపించిన కాడికి. చూసి ఏం చెయ్యాల? ఇది మంచో

చెడ్డో మాకు తెల్దు. అటికీ మా యూనియన్ల వాల్లు అడగిచ్చినారు - ఎవర్తోనో. టి.వి.లో కూడ వచ్చిందంట. నేను చూల్లేదు. ఆ దుమ్ము సంగతి పోనీ - పండేది బాగా పండనన్నా - పండి చస్తే బాగుండు. పొంత లోంచి పొయ్యి లోకి పడినట్లయింది ఈ బతుకు.

చూడన్నా! మా అబ్బతరం, మా నాయన తరం సంగతి అడిగినావు. మా అబ్బది ఉప్పరి పని. పైగా గానుగాడేవాడు. ఎక్కువగా ఆముదాలు, నువ్వులు, ఎప్పుడన్నా సెనగ్గాయల పప్పు. ఒక గానుగ, ఒక కుంటి ఎద్దూ, మా అబ్బా, జేజి. ఈ ఆరెకరాలూ మా అబ్బ కొనిందే. రాళ్లూరప్పుల పొలం. మా నాయన, ఆ తర్వాత నేనూ బాగు చేసుకున్నాం - ఇంటిల్లపాదితో కలిసి. మా నాయన సేద్యానికుందేవాడు. గానిగ మూలబడింది. మా నాయన తరానికే గానిగాడించుకునేది పోయింది. నాకు ఇదిగో ఈ ఫ్యాక్టరీ పని దొరికి నప్పట్నుంచీ బాగుపడొచ్చుననుకుంటున్నా. ఈ ఆరెకరాల పొలం కూడా, పైరు పెట్టడానికి లాయికి అయింది, అయిదారేండ్లు నుంచే. ఏమన్నా అను వాళ్ల కాలం కంటే మాది నయమే. నా ముగ్గురు కొడుకుల్ని చదివించుకుంటే చాలు. పెద్దోడు ఏడు, నడపోడు అయిదు. చిన్నోడు మూడు. ముందు ముందు వాల్లు ఏం చదువుతారో నాకు తెల్దు. ఉద్యోగాలొచ్చాయో లేదో నాకు తెల్దు. ఈ పొలం ఉంటుందో ఊడుతుందో నాకు తెల్దు. అన్నా! ముందు ముందు ఎట్లా ఉంటుంది అంటే ఏం చెప్పేది? నేనేమి పోతులూరు వీరబ్రమ్మాన్నా? గవర్నమెంటునా?...'

ఉప్పర గురప్ప మూడేండ్ల కిందటి కథనాన్ని మా విలేకరి తానప్పుడు సేకరించిన వివరాలను - ఇటీవలి గురప్పకు విన్పించాడు. తాజా పరిణామాల గురించి ప్రశ్నించాడు. గురప్ప మాటల్లోనే ఇటీవల వృత్తాంతం:

'అన్నావ్! ఈ మధ్యనే అరియర్లు వచ్చినాయి. మొగోని మాదిరి ఇరవైవేలు బాకీ తీర్చినా. ఇంకా పదివేలుందనుకో. లెక్కలేదు. దొమ్మ పొగరుంది. ఫ్యాక్టరీ ఉంది. పొలం తల్లి ఉంది...

పైగా కూలి పెరిగిందన్నా, మా కంట్రాక్టు లేబరుకు. ఇప్పుడు రోజుకు ఇన్నూటెనభై పడతుంది. ఏడువేలకు పైన్నే నెలకు వచ్చాదా అంటావా? అంతొచ్చే ఇంకేం? నెలకు పది రోజులు కూడా పని ఉండడం లేదు. మల్లా, పిఎఫ్ అదీనూ. మూడేండ్ల కిందటి లెక్కేననుకో - ఒక ఇన్నూరో మున్నూరో అటూ, ఇటూగా ఎక్కువే రావచ్చు. మరి గూబ అదిరేటట్లు అన్నీ పిరెం అయినాయి. పెంచడం ఏందో? పని రోజులు తగ్గించడమేందో? కూలిరేటు పెరిగితే, పని రోజులు తగ్గాలా? ఈ మాయ ఏందో తలకాయ కెక్కదు.

అందుకే... అన్నా! ఈసారి ఆరెకరాల్లో పత్తి వేసినా - పెట్టుబడి ఎంతైనా సరే, తెగించి పెడుతున్నా. కల్తీ విత్తనాలు, కల్తీ మందులు అంటావా? మా కెట్లా తెలుస్తుందన్నా! పురుగు పట్టకుండా చూసుకోవాల? పత్తి విరగ బుయ్యాల. ఇంటికి చేరాల అంతే. మంచి రేటు ఉంటుందో ఉండదో అంటావా? ఏమన్నా గానీ... అనంతపురం రైతుల మాదిరి నేను పురుగుల మందు తాగి మాత్తరం చచ్చిపోను.

అంత దరిద్రం నెత్తి మీద కూకుంటే, అప్పులు తీర్చలేకపోతే ఒక పని చెయ్యడమే. సిమెంటు రాయి, కంకర, బొగ్గు, ఎర్రమట్టి - అన్నిటితో పాటుగా మిషనులోకి దూకడమే. 'ఏమవుతాది?' ఉడికి ఉడకి చచ్చి సున్నమై సిమెంటును కావడమే. పెండ్లాం, పిల్లోల్లు గతి ఏమంటావా? చచ్చినాక నాకు తెలిసిందేముంది?'

దా'రుణ' సీమలోని ఒక జీవన దృశ్యం ఇది. పైరూ, మనిషీ నీరుగా మారిపోతున్న 'నీరూ - మీరూ' లోకం ఇది. హైటెక్ చలనమిది!"

రచన చదవటం పూర్తి అయింది. ఆ క్షణంలో నాలో ఏ ఏ భావాలు కలిగాయో చెప్పలేను. శీర్షికలోని 'నీరు' ను గురించి ఆలోచించాను. పైరూ, మనిషీ నీరుగా మారిపోవడం అంటే ఏమిటి? నీరూ - మీరూ సరే సరి. ప్రభుత్వం ప్రచార నినాదంలో నీళ్ళున్నాయి. మరి గ్రామీణ విలేకరి ఏ అర్థంలో వాడాడు? చప్పున స్ఫురించింది. నీరు అనే మాటకు మరొక అర్థం బూడిద అని. అది ఒకప్పటి నీఱు అనే తెలుగు పదానికి ఇప్పటి రూపం అన్నమాట! మా గ్రామీణ, విలేకరి ఊహాశక్తిని మెచ్చుకోకుండా - మనసులోనే - ఉండలేకపోయాను. పని ఆపి కడప మోడెం సెంటరుకు ఫోను చేశాను. అక్కడి విలేకరి సుబ్రహ్మణ్యం దొరికాడు.

"నీరూ - పైరూ స్టోరీ రాసి పంపిన స్ట్రింగరు పేరేమి?" అని అడిగాను.

"అతనా సార్! నెల కిందట మన ఎడిటరు సారు కడపకు వచ్చినాడు గదా సార్? ఎం.ఎల్.ఏ సుబ్బిరెడ్డి మన ఎడిటరుకు చెప్పినాడు. 'ఉద్యోగం లేదు. బి.ఏ. పాసై అయిదేండ్లయింది. కమలాపురం. పైగా పెళ్ళయింది. ఇద్దరు పిల్లలు. గంపెడంత సంసారం. తండ్రి టింకరు'..."

నాకు తిక్కరేగింది. నా తొందర నాది. సమయం తరుముతోంది. నా చావు నాది. జిల్లాల పేజీలు పెట్టడమూ, ప్రింటింగూ ఇంకా పూర్తి కాలేదు. ఈ సుబ్రహ్మణ్యం ఏదీ సూటిగా చెప్పడు; ఏదీ సూటిగా రాయడు. వివరాలు ఏకరువు పెడుతూనే ఉంటాడు. సమయాన్నీ, సందర్భాన్నీ పట్టించుకోడు. విసుగును అణచుకుంటూ అడిగాను:

"ముందు స్టోరీ రాసిన మనిషి పేరు చెప్పవయ్యా స్వామీ! వివరాలు రేపడుగుతాను"

"ఇస్మాయిల్ సార్! ముస్లిం. తెలుగు బాగా రాస్తాడు. కొంచెం తిక్క సార్..."

మా అనంత వచన విలేకరి ఇంకే వివరాలు చెప్పబోతాడో అనుకుంటూ పని తొందరలో ఫోను పెట్టేశాను.

'నీరు - పైరూ'ను హైదరాబాదులోని మా అసిస్టెంట్ ఎడిటర్‌కు మోడెం ద్వారా పంపివేశాను. ఆయన మానవతా వార్తల్ని రాయటంలో పేరున్న పత్రికా రచయిత. అవసరమైన మార్పులతో, ప్రతి శనివారం వెలువడే మా ప్రధాన పత్రికలోని ప్రత్యేక పేజీ 'రైతు ప్రపంచం'లో నీరూ - పైరూ రావచ్చు ననుకున్నాను. ఆయనకు ఏది ముఖ్యమో, ఏది కాదో, ఎట్లా, ఎందుకుపయోగించుకోవాలో తెలుసునని నా నమ్మకం.

నమ్మకాలు అన్ని సమయాల్లో నిజం కావు. మనం నమ్మినట్లు మనుషులందరూ ఉండరు. ఉండలేరు.

'రైతు ప్రపంచం'లో మా గ్రామీణ విలేకరి ఇస్మాయిల్ వార్త రచన రాలేదు. ఆ ఆదివారం మాత్రం మా ఎడిటరు గారి నుంచి ఫోను వచ్చింది – కంఠస్వరంలోని రంగూ, రుచీ, వాసనా, ధ్వనీ, స్పర్శా భేదాలలో.

"ఏదో స్టోరీ పంపారట. చూశాలే. తలా తోకా లేదు. ఈ స్ట్రింగర్లతో వేగలేక చస్తున్నాం. మన ఖర్మ కొద్దీ దొరుకుతారు – ఇలాంటి వాళ్ళు. బాగా రాస్తాడని అంటే, ఇలాగా రాయటం? మన కడప కరస్పాండెంట్ ఆ సుబ్రహ్మణ్యం లేదూ అతనితో మాట్లాడండి. ఇలాంటి వాటిని రాయవద్దని ఆ స్ట్రింగరుకు చెప్పమనండి. లైన్ అకౌంటు వార్తలేవో రాసుకోమని బుద్ధి చెప్పమనండి. మనది ఇంగ్లీషు జర్నలిజమూ కాదు. ఆ కొత్త స్ట్రింగరు మన కాలమిస్టూ కాదు. ముఖ్యంగా రాజకీయంగానో, మరొక రకంగానో నేను ఇరుక్కునే వాటిని రాయవద్దని తలకెక్కేట్లు చెప్పమనండి. వింటున్నారా?... అంతగా కావాలంటే స్వంతంగా కథలు రాసుకోమనండి. ఎక్కడైనా అచ్చు వేసుకోమనండి. మనకు సాల్మన్ రష్దీలో, అరుంధతీ రాయ్‌లో, రామ్‌లో అక్కర్లేదు: వింటున్నారు కదా! మనకు ప్రయోగాలొద్దండి. ఆ రకం వాటిని కిల్ చేసేది కూడా తెలియకపోతే ఎలాగండి? మీరు సీనియర్ అనే గదా అక్కడికి పంపింది. మన హిందువులు సృష్టించుకుంటున్న సంపదకు వ్యతిరేకంగా రాయటమేమిటండీ?..."

మా ఎడిటరు గారి ఫోను గూటింపుతో నా బుర్ర తిరిగి పోయింది – మధ్య మధ్యలో 'సార్ సార్ అం సార్' అనటంలో తల దిమ్మెక్కింది. ఇంతకూ నీరూ – పైరూ రాజకీయమో, ఏ విధంగా మరొక రకమో నాకు అర్థం కాలేదు. పత్రికా రచన, కథల కంటే ఎంతెత్తున ఉందో నాకు ఏ మాత్రం తెలియటం లేదు. ప్రయోగాలు నా ఒంటికి సరిపడతాయో లేదో అనే సంగతి ఏమో గానీ, వృత్తి భద్రతకు సరిపడవని మాత్రం ఎడిటరు గారి గొంతు తీరును బట్టి తెలిసిపోయింది.

ఎడిటరు గారి చివరి మాటే నాకు బోధ పడలేదు – ఎంత గింజుకున్నా ఆ వాక్యార్థాన్ని వెతుక్కుంటూనే ఉన్నాను – మా దినపత్రికలోని వార్తల బట్టీ, మా సంపాదకుల ప్రత్యేక వ్యాసాల్ని బట్టీ – ప్రతిరోజూ వెతుక్కుంటూనే ఉన్నాను, రాయలేలిన రతనాల సీమలో, తెలుగు గంగాజలం గొంతు తడపని భూముల్లో... ఇస్మాయిల్ రచన మిగిల్చిన జ్ఞాపకాల్లో...

● ప్రస్థానం సాహిత్య ప్రత్యేక సంచిక, 2002. ●

కథలు చదివిన తరువాత:

# పాఠకులతో పదినిమిషాలు

తన కథలకు ఎవరి ముందుమాటా అవసరంలేని చాలా కొద్దిమంది కథా రచయితల్లో విశ్వనాథరెడ్డిగారు ఒకరు. వారు దాదాపు 1961 నుంచీ కథలు రాస్తున్నారు. ఇప్పటికి "జప్తు", "కేతు విశ్వనాథరెడ్డి కథలు", "ఇచ్ఛాగ్ని" అన్న మూడు సంపుటాలు ప్రచురించారు. కథలతోపాటు "వేర్లు", "బోధి" అన్న రెండు నవలికల్ని కూడా రాశారు. విశ్వనాథరెడ్డిగారికి మొదటినుంచీ విమర్శమీద ముఖ్యంగా కల్పనా సాహిత్యంమీద - ప్రత్యేకమైన శ్రద్ధా, ఆసక్తీ ఉన్నాయి. తన సాహిత్య విమర్శా వ్యాసాలలో కొన్నిటిని వారు "దృష్టి" అన్న సంపుటంగా ప్రచురించారు. పరిశోధనారంగంలో కూడా విశ్వనాథరెడ్డిగారు మౌలికమైన కృషి చేశారు. అంతవరకూ విశ్వవిద్యాలయాల గుర్తింపుకు నోచుకోని గ్రామ నామాల మీద పరిశోధన (Onamsastics) తెలుగులో వారే ప్రారంభించారు. ఎందరో విద్యార్థులచేత కల్పనా సాహిత్యం మీద పరిశోధన చేయించారు. కొడవటిగంటి సాహిత్యాన్ని సంపాదించి, ప్రచురించటానికి వారు చేసిన కృషి అపూర్వమైంది ఆ కార్యక్రమంలో వారు ఉపయోగించిన "మెథడాలజీ" తరువాత వారికి ప్రామాణిక మార్గంగా రూపొందింది. వీటన్నిటితోపాటు తెలుగు భాషా సాహిత్యాల పాఠ్య ప్రణాళికల్ని చేరాగారితోకలిసి - రూపొందించటంలో వారుచేసిన కృషి అపూర్వమైంది. అంతకుముందు తెలుగు పాఠ్య ప్రణాళికలకు ఎలాంటి విస్తృతీ ఉండేదికాదు. "పాండిత్యాన్ని" పెంచుకోవటం కోసం సాహిత్యాన్ని చదవాలన్న సంకుచిత లక్ష్యాన్ని దాటి అవి వెళ్ళేవికావు. "పాండిత్యం" అంటే సాధ్యమైనన్ని ఎక్కువ మృతపదాలకు అర్థం తెలుసుకోవటమేనన్న నిర్వచనం దాదాపుగా స్థిరపడిపోయిన కాలంలో జీవితాన్ని అర్థం చేసుకోవటం కోసం సాహిత్యాన్ని అధ్యయనం చేయాలి అన్న కొత్త లక్ష్యంతో ఆంధ్రప్రదేశ్ ఓపెన్ యూనివర్సిటీ తెలుగు పాఠ్య ప్రణాళికలను వారు రూపొందించారు. మనుషులు వెనక్కు మాత్రమే నడవాలి అన్న కృతనిశ్చయం ఉన్న కొందరు వాళ్ళమీద రాళ్ళు రువ్వటానికి ప్రయత్నించారు. వాళ్ళు ఇప్పుడు ఏమయ్యారో కానీ ఓపెన్ యూనివర్సిటీ పాఠ్యగ్రంథాలు విద్యార్థులకు మాత్రమే కాకుండా సాహిత్యాభిమానులందరికీ పఠన గ్రంథాలౌతున్నాయి.

ఎన్ని వ్యాసంగాలున్నా విశ్వనాథరెడ్డిగారి ఆత్మ వ్యాసంగం మాత్రం కథా రచనే. "గడ్డి", "దాపుడుకోక", "జప్తు", "పీర్లచావడి", "కూలిన బురుజు",

"నమ్ముకున్న నేల" లాంటి ఎన్నో కథలు విశ్వనాథరెడ్డిగారి పేరు చెప్పగానే స్ఫురిస్తాయి. తిరుపతిలో ఉన్నా, హైదరాబాదులో ఉన్నా, కడపజిల్లా పల్లెలనూ, పల్లీయులనూ, మట్టివాసననూ వారు మరిచిపోలేదు. తమ జీవితంలో భాగాలైన విశ్వవిద్యాలయాలను గురించో, నగరాలను గురించో వారు అరుదుగా కొన్ని కథలు రాసినా వాటి వేర్లు పల్లెలకే వెళ్ళాయి. ఇందుకు ఉదాహరణంగా ఈ సంపుటంలో "సంకట విమోచని" కథను చెప్పుకోవచ్చు. పట్టణాలలో ఉన్న రచయితలు పల్లెలను గురించి కథలు రాయటానికి వ్యతిరేకంగా ఈలోగా కొన్ని వ్యాఖ్యలు వినిపించాయి. ఆ వ్యాఖ్యలు చేసినవారు కూడా పట్టణాలలోనే ఉంటూ, పట్టణ సంస్కారాన్ని ఒంట పట్టించుకున్నవారే. లేదంటే ఆ విషయాన్ని వారు మరిచిపోయారు. సృజన ప్రక్రియను గురించి కానీ, సృజన స్వభావాన్ని గురించి కానీ అర్థం చేసుకోకపోవటమే ఇలాంటి అభిప్రాయాలకు మూలం. తగినంత దూరంలో ఉండి, వస్తునిష్ఠంగా జీవితాన్ని పరిశీలించటంచేత కథావస్తువులో కూరుకుపోవటాన్ని తప్పించుకోవచ్చనీ, aesthetic distanceను సాధించవచ్చనీ మనలో చాలామంది ఇంకా అర్థం చేసుకోవటంలేదు.

రాయలసీమ జీవితానికి సంబంధించిన సాధ్యమైనన్ని ప్రత్యేకాంశాలను సాధ్యమైనంత కళాత్మకంగా విశ్వనాథరెడ్డిగారు తన కథల్లోకి తీసుకువచ్చారు. అందుచేత వారిని మరొక సందర్భంలో "రాయలసీమకు ప్రాతినిధ్య రచయిత" అన్నాను. ఈ సంపుటిలో ఉన్న పన్నెండు కథలూ నా విశ్వాసానికి మరింత బలాన్నిస్తున్నాయి. అంతేకాకుండా విశ్వనాథరెడ్డిగారి కథా వస్తువుల విస్తృతి పెరిగినందుకూ అవి literal plane నుంచీ ideational planceకు ఎదుగుతున్నందుకూ సంతోషిస్తున్నాను.

ఈ సంపుటంలోని అన్ని కథలూ 1998–2003 సంవత్సరాల మధ్యకాలంలో రాసినవి. అంటే ఈ కథలు ప్రౌఢనిర్భరవయః పరిపాకంలో కాదు – షష్ఠిపూర్తి తరువాత రాసినవి. సాధారణంగా కథా ప్రక్రియను యువతరం ప్రక్రియ అంటూ ఉంటాం. అందులో కొంత సత్యం లేకపోలేదు. కథారచనలో పదును పోగొట్టుకోకూడదనుకుంటే రచయిత తనకు మానసికంగా ముసలితనాన్ని రానివ్వకూడదు. కథారచన మానివేసిన యువకుల్లోనూ, కథా రచన మీద కంట్రోలు పోగొట్టుకున్న మధ్య వయస్కుల్లోనూ చాలామంది ఇలా అకాల వృద్ధాప్యం వచ్చినవారే, లేదా పిందెలో పండుమాగినవారే. ఈ సంపుటంలోని కథల రచనా విధానంలో, దృక్పథంలో ముసలితనపు చాదస్తమూ, పరాజయవాదమూ లేనందుకు సంతోషిస్తున్నాను. మనసునూ, బుద్ధినీ తాజాగా ఉంచుకోగలిగినందుకు విశ్వనాథరెడ్డిగారిని అభినందిస్తున్నాను.

ఈ సంపుటంలోని దాదాపు అన్ని కథలూ కడప జిల్లా గ్రామీణ వాతావరణంతో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సంబంధం ఉన్నవే. ప్రవాసాంధ్రుల జీవితాలను గురించి రాసిన "రెండు ప్రపంచాల మధ్య", "దగ్గరైన దూరం దూరమైన

దగ్గర* కథల్లో కూడా కథావస్తువుల ఫలితాలూ, పరిణామాలూ రాయలసీమలోనే ఉన్నాయి. "రెండు ప్రపంచాల మధ్య"లో చిన్న కొడుకు కుటుంబాన్ని చూడటానికి అమెరికా వెళ్ళిన తల్లికి అమెరికన్ జీవితంలోని పాజిటివ్ అంశాలు అర్థమౌతాయి. కడపజిల్లాలో ఉన్న తన పెద్దకొడుకు అహంకారపూరితమైన వ్యర్థ జీవితాన్ని గడుపుతూ తన చిన్నకొడుకును ఆర్థికంగా పీడించటంలోని అసామంజస్యం ఆమెకు తెలుస్తుంది. అతడిలాంటి వాళ్ళు తమ జీవితాలను గురించి పునరాలోచన చేసుకోవాల్సిన అవసరం కూడా ఆమెకు అర్థమౌతుంది. అలాగే రెండవ కథలో సొంత ఊరికి తిరిగొచ్చిన ప్రవాసాంధ్రునికి ఇక్కడి జీవితంలోని కష్టాలూ, కడగండ్లూ అర్థమౌతాయి. రాయలసీమలో గత పది సంవత్సరాలలో నేలతోపాటు మనుషుల బతుకు కూడా ఎలా ఎండిపోయిందో అనుభవంలోకి వస్తుంది. ఈ రెండు కథలూ తనకు సంబంధించిన inside reality ని Out sider దృక్పథం నుంచీ పరిశీలించాయి.

రాయలసీమ జీవితంలోని విభిన్నాంశాలను చిత్రించిన కథలు "స్వస్తి", "మాయపొరలు", "విరూపం", "పొడి నిజం". వీటిలో స్వస్తి భద్రతను గురించిన కథ. భద్రతకు సంబంధించిన మరొక పార్శ్వాన్ని చిత్రిస్తూ వివినమూర్తి రాసిన "స్పర్శ"కు దీటైన కథ ఇది. రాజకీయ ఫాక్షనిస్టులకు భద్రత కల్పించే గన్‌మన్‌లకు ఎవరు భద్రత కల్పిస్తారు? వారి భార్యా పిల్లలకు నామమాత్రపు భద్రత కావాలన్నా వారు తెలిసి అభద్రతను కౌగలించుకోక తప్పదు. ఫాక్షన్ నాయకుని మీద జరిగిన దాడిలో ఇద్దరు గన్‌మెన్‌లు చనిపోయి నాగు అన్న గన్‌మన్ బతికిపోతాడు. అతనికి గన్‌మన్‌గా కొనసాగాలా, వద్దా? అన్నది బతుకుకూ, చావుకూ సంబంధించిన సమస్య. మామగారూ, భార్యా కొనసాగమనే చెబుతారు - వారి భద్రత కోసం. ఫాక్షన్ నాయకుడు రాజకీయాలలో కొనసాగటం లేదా - అని మామగారు ప్రశ్నిస్తాడు. నాయకుని కోసం గన్‌మన్‌లు ప్రాణాలర్పిస్తారు, కానీ గన్‌మన్‌ల కోసం నాయకుడు ఎప్పుడూ ప్రాణాలు అర్పించడన్నది అతడు తెలిసి విస్మరించే వాస్తవం. తమకోసం చచ్చే వాళ్ళున్నంతవరకూ ఫాక్షనిస్టులుంటారు - అన్నది ఈ కథ చేసే సూచన. ఈ కథలో 'కథ', కథనమూ పొందికగా కుదరటం చేత కథావస్తువు చక్కగా రూపొందింది.

"మాయపొరలు" హింసను గురించి తాత్వికంగా ఆలోచించే కథ. హింస మానవ స్వభావంలోనే ఉందా, లేదా? అని మహాభారత కాలం నుంచి రచయితలు ఆలోచిస్తూనే ఉన్నారు. విలియం గోల్డింగ్ అన్న బ్రిటిష్ రచయిత ఈ ఇతివృత్తంతో "Lord of the Flies" అన్న గొప్ప నవల రాశాడు. నాగరిక, ప్రజాస్వామిక వాతావరణంలో పెరిగిన కొంతమంది పబ్లిక్ స్కూల్ విద్యార్థులు ఆ వాతావరణం నుంచీ దూరం కాగానే వారిలో హింసా ప్రవృత్తి ప్రజ్వరిల్లుతుంది. వారు క్రమంగా అనాగరికులూ, ఆటవికులూ కావటాన్ని ఈ నవల అద్భుతంగా చిత్రిస్తుంది. "మాయపొరలు" కథ కులం, రాజకీయ భావజాలం హింసకు అసలు కారణాలు కావనీ, అసలు కారణం ఆర్థికం మాత్రమేననీ చెబుతుంది. ఈ కథలో

విశ్వనాథరెడ్డిగారు అకారణంగా జరిగే హింసకూ, ఒక స్వార్థ ప్రయోజనం కోసం జరిగే హింసకూ మధ్య ఉన్న తేడాను చూపించారు. తొండను అకారణంగా చంపిన పిల్లలు అది తప్పని అంగీకరిస్తారు. కానీ తొండను చంపి దాని సహాయంతో ఎంద్రకాయల్ని వేటాడే పిల్లలు హింస తప్పని అంగీకరించరు. సిద్ధారెడ్డి తాతను మూడు లక్షలు ఖర్చుపెట్టి హత్యచేయించినవారు ఆర్థిక ప్రయోజనం కోసమే చేశారు. తండ్రిని చంపిన వారితో ఆర్థిక ప్రయోజనం కోసమే కొడుకు రాజీ చేసుకున్నాడు.

ఈ కథలో హింసకూ, రిరంసకూ ఒక మనస్తాత్విక సంబంధాన్ని కల్పించటానికి విశ్వనాథరెడ్డిగారు ప్రయత్నించారు. ఈ పోలిక కథకు (విజయవాడ కొడుకు, కోడలు సంఘటన ఉన్నాసరే) అతకవలసినంత బాగా అతకలేదని నేను భావిస్తున్నాను. రిరంస (రంతుం ఇచ్ఛ)లో తీవ్రమైన సహజాతమే కానీ ఇతరులను హింసించి ఆనందించాలన్న పైశాచికత లేదనుకుంటాను. ఈ విషయంలో శ్రీశ్రీ కూడా పొరపడ్డారేమో!

"పొడి నిజం" తడిని గురించిన కథ. రెండు కథల ఆధారంగా విశ్వనాథరెడ్డిగారు ఈ కథలో నేటి రాయలసీమ పరిస్థితిని ధ్వనింపచేశారు. మొదటిది పురాణకథ. భగీరథుడు అన్న రాజు తన వంశస్థులకు సద్గతులు కల్పించటం కోసం గంగను భూమి మీదికి తీసుకువచ్చాడు. అది స్వార్థమే కావచ్చు. కానీ దానివల్ల నీరు అవసరమైన వారికి - రైతులకు - నీరు లభించింది. రెండవది జానపదగాథ. రాచపుండు భద్రమైన చోటును వెదుక్కుంటూ వచ్చి రాయలసీమ రైతును చేరుకుంది. చాలాకాలంగా వాళ్ళు కరువు అన్న రాచపుండుతో బాధపడుతున్నారు. దానికి వాళ్ళు వైద్యం చేయించుకోలేదు. మరో భగీరథుడు వారి పుండుమీద గంగను ప్రవహింపచేస్తే తప్ప అది నయం కాదు. కానీ ఈనాడు కనీసం అలాంటి పాలకులులేరు. రాయలసీమ రాచపుండు మీద గంగ ప్రవహించదు. పులివెందుల కాలువలో తడిపుట్టదు. ఇదీ పొడినిజం. ఇది చక్కని లోతైన కథ. శిల్ప సామర్థ్యంచే కథావస్తు విస్తృతి పెరిగిన కథ, diologic స్వభావం ఉన్న కథ.

"విరూపం" కూడా అనేకార్థాల కథే. "అభివృద్ధి" అంటే ఏమిటి? - అన్న ప్రశ్నవేయటం ఈ కథలోని ప్రధాన కథావస్తువు. వ్యవసాయ భూములు ఫాక్టరీల ముడిసరుకుగా మారిపోతే, వారి పొలాల్లో లేచిన ఫాక్టరీలో రైతులు కూలీలుగా మారిపోతే వచ్చే పరిణామాలు ఎలాంటివి అని ఈ కథ విశ్లేషిస్తుంది. వారి గ్రామాల్లోనూ, కుటుంబాల్లోనూ మానవ సంబంధాలు మారిపోతాయి. వారి ఆత్మాభిమానం ధ్వంసమైపోతుంది. ఈ పరిణామాలు అభివృద్ధేనా? ప్రపంచీకరణం ప్రారంభమైన తరువాత మన దేశంలో growth కూ development కూ తేడా లేనట్టుగా మాట్లాడటం అలవాటైపోయింది. ఈ తేడా తెలిసిన ఒక గ్రామీణ విలేఖరి ఈ పరిణామాలను గురించి ఒక విమర్శనాత్మక కథనాన్ని రాస్తే సంపాదకుడికి కోపం వస్తుంది. అతడు "మన హిందువులు సృష్టించుకుంటున్న సంపదకు వ్యతిరేకంగా రాయటమేమిటండీ?" అని చీదరించుకుంటాడు. ఈలోగా

అర్థశాస్త్రంలోనూ, భారతీయ సమాజంలోనూ వస్తున్న నూతన పరిణామాలకు ప్రతిధ్వని సంపాదకుడు వేసిన ప్రశ్న. చాలామంది మేధావులు "మరింత సంపదను సృష్టించటమే పేదరికానికి పరిష్కారం" - అని చెబుతూ ఉంటారు. ఆ సంపదను ఎవరు సృష్టిస్తారు? సృష్టించబడిన తరువాత ఆ సంపద ఎవరి చేతుల్లోకి వెళ్ళుతుంది - అన్న ప్రశ్నలు వీరిని బాధించవు. ఇది అంతర్జాతీయంగా వినిపిస్తున్న పోస్ట్ మాడర్న్ అభిప్రాయం. మనవాళ్ళుచేస్తే అది దోపిడీ కాదనటం, "హిందువుల" దోపిడీని ప్రశ్నించకూడదనటం ఈలోగా మన దేశంలో వినిపిస్తున్న కొత్త దేశభక్తి నినాదం. ఈ రెండూ ఆమోదయోగ్యమైన సిద్ధాంతాలు కావు. "మన హిందువులు" అన్న మాటను సంపాదకుడు మతం అర్థంలో వాడినా, జాతి అర్థంలో వాడినా అతని సిద్ధాంతం మాత్రం దేశానికి ప్రమాదకరమైందే.

ఈ సంపుటంలో నన్ను బాగా ఆకర్షించిన కథ- "అమ్మవారి నవ్వు". ఈ కథలో వర్ణించబడిన మతాతీతమైన స్నేహం ఒక్కటే ఈ దేశాన్ని పీడిస్తున్న జాతి (nationality) సమస్యకు పరిష్కారం. ఇది మంచి భావుకతా, నిర్మాణ చాతుర్యం ఉన్న కథ కూడా. పువ్వులు ప్రధానమైన ఇమేజ్‌గా, మెటాఫర్‌గా రూపొందిన ఈ కథ పువ్వులతో ప్రారంభమై, పువ్వులతో అంతమౌతుంది. కానీ ఈ కథను గురించి చిత్రమైన వ్యాఖ్యలూ, అభ్యంతరాలూ వినిపించాయి. ప్రస్ఫుటంగా చెప్పినా చెప్పకపోయినా "మైనారిటీ మతానికి చెందిన జాఫర్ మాత్రమే మెజారిటీ మత భావజాలంతో సర్దుకోవాలా?" అన్నది ఆ విమర్శల సారాంశం. వాటిని చదివి నాకు నవ్వు వచ్చింది. కొంతకాలం కితం ఒక రచయిత మిత్రుడు "ప్రపంచీకరణలో ఒక భాగంగా రోడ్లు వెడల్పు చేస్తే ఖాదర్, బట్టలు కుట్టటంలో యాంత్రీకరణం జరిగితే పీరూభాయి- ఇలా దెబ్బతిన్నవాళ్ళు ముస్లిములేనా? ఇంకెవరూ దెబ్బతినలేదా?" అని ప్రశ్నించినప్పుడు కూడా అలాగే నవ్వు వచ్చింది. సాహిత్యంలో representation of reality ని ఒక్కొక్క రచయిత ఒక్కొక్క రకంగా చేస్తాడు. అతని మనసులో లేని సంకుచితత్వాన్ని అతనికి అంటగట్టకూడదు. "అమ్మవారి నవ్వు"ను శ్రద్ధగా చదివితే ఇలాంటి సందేహాలు రావు. ఆ కథలో చివర సుందర రామానందుల పాత్రను రచయిత ఏ ఉద్దేశంతో ప్రవేశపెట్టాడో వీరు గమనించలేదు. మతాన్ని గురించీ, ఆధ్యాత్మికతను గురించీ, కళలో భావనాశక్తిని గురించీ ఆ సర్వసంగపరిత్యాగికున్న అపరిపక్వ భావాలు ఎవరిమీద ప్రయోగించిన వ్యంగ్యమో గమనించి ఉంటే కథావస్తువులోని కేంద్ర బిందువేదో తెలిసిపోయేది.

ఈ సంపుటిలో నాకు అసంతృప్తిని కలిగించిన కథలు "ఒక వాల్మీకి", "కాంక్ష". మొదటి కథలో బలమైన కథావస్తువే లేదు. రెండవ కథలో ఉన్నా నిర్మాణం అసంతృప్తిగా ఉండటంచేత అది రూపు దిద్దుకోలేదు. "ముఖదర్శనం" లోని వస్తువు (స్త్రీని విధవను చేయటం) చాలా పాతది. శ్రీపాదతో ప్రారంభించి ఎందరో రచయితలు ఆ వస్తువును అరగదీసేశారు. దాన్ని అలా literal plane లో కాకుండా ప్రతీకాత్మకంగా చెప్పి ఉంటే కాస్త బాగుండేదేమో. తెలుగు సినిమాలో లాగా ఆ

సంఘటనను అంత వివరంగా కథా ప్రక్రియలో వర్ణించటం గొప్ప కళ లక్షణం కాదు. లేదంటే ఆ సంఘటనను చూసిన మనుమరాలు మానసికంగా చెదిరిపోవటం ఈ కథ మరింత దిగజారి పోకుండా రక్షించింది. "పోలికలు" కథను గురించి కూడా నా అభ్యంతరాలు ఇవే. లేదంటే పల్లెల దైన్యానికి నగరాల వైభవమే కారణమన్న అంశం ఈ కథలోకి బాగా వచ్చింది. కథలు రాయటమంటే మానవ సంబంధాలను గురించి రాయటమే. వాటిని నమ్మశక్యంగా ఉండేలా ఆవిష్కరించే గొప్ప కథలు. "పోలికలు"లో కాలవ్యవధికీ, మానవ సంబంధాలకూ మధ్య సరైన సంబంధం లేదనిపిస్తుంది.

విశ్వనాథరెడ్డిగారు జీవితం తెలిసినవారు. జీవితాన్ని అధ్యయనం చేయటానికి తగిన దృక్పథం ఉన్నవారు. తెలుగు సాహిత్యాన్ని మాత్రమే కాకుండా ప్రపంచ సాహిత్యాన్ని విస్తృతంగా అధ్యయనం చేసినవారు. స్పష్టమైన ప్రక్రియా పరిజ్ఞానం ఉన్నవారు. రాయలసీమలో గత యాభై సంవత్సరాలుగా వస్తున్న అన్ని మార్పులనూ ప్రత్యక్షంగా చూచి అర్థం చేసుకున్నవారు. అందుచేత వారి వద్ద నుంచీ - గొప్ప కథలతోపాటు - రాయలసీమ జీవితానికీ, భాషకూ దర్పణంలాంటి సమగ్రమైన నవల రావలసి ఉంది. దానికోసం ఆసక్తితో ఎదురుచూస్తుంటాను.

మదనపల్లి, వల్లంపాటి వెంకట సుబ్బయ్య

8-4-2004.